# ఆంధ్రప్రదేశ్ ను గురించి....

| | |
|---|---|
| విస్తీర్ణం | 1,06,286 చ. మై. |
| జిల్లాలు | 20 |
| తాలూకాలు | 188 |
| గ్రామాలు | 28,997 |
| పట్టణాలు, నగరాలు | 212 |
| మొత్తం జనసంఖ్య (1961) | 359.83 లక్షలు |
| జన సాంద్రత (1961) | 339 చ. మై. 18. |
| అక్షరాస్యులు (1961) | 76.27 లక్షలు |
| షెడ్యూల్డు కులాలవారు (1961) | 49.74 లక్షలు |
| షెడ్యూల్డు తెగలవారు (1961) | 13.24 లక్షలు |
| నమోదైన కర్మాగారాలు | 3,928 |
| విశ్వవిద్యాలయాలు | 4 |
| పంచాయతీలు | 15,266 |
| పంచాయతీ సమితులు | 321 |
| ఆంధ్రప్రదేశ్ నుండి పార్లమెంటు సభ్యులు | 41 |
| విధానసభ సభ్యులు | 288 |
| శాసనమండలి సభ్యులు | 90 |

# ఆంధ్రప్రదేశ్


సంపుటి: 13 ] జనవరి – ఫిబ్రవరి. 1969 [సంచిక: 3 & 4

పుష్యం–ఫాల్గుణం– 1890 శా.శ.



ప్రధాన సంపాదకులు

బి. కె. రావు, ఐ. ఎ. యస్.

సంపాదకులు

ఎన్. వి. గోపాలశాస్త్రి


## ఈ సంచికలో...



**మొదటి అట్ట :** రిపబ్లిక్ దినోత్సవ దృశ్యాలు

**మూడవ అట్ట :** సోవియట్ బాలేదృశ్యం (సోవియట్ సాంస్కృతిక బృందం ఇటీవల నగరంలో యిచ్చిన ప్రదర్శన నుండి)

**నాలుగవ అట్ట :** అఖిల భారత పారిశ్రామిక ప్రదర్శనలోని జనసంబంధశాఖ స్టాలు

[ ఈ సంచికలోని అభిప్రాయాలు తప్పనిసరిగా ప్రభుత్వానికి సంబంధించినవిగా భావించనక్కరలేదు. ]





గవర్నరు రిపబ్లిక్ దినోత్సవ సందేశం:

# 'సమైక్యతను పటిష్ఠం చేద్దాం'

ఆంధ్రప్రదేశ్ గవర్నరు శ్రీ ఖండూభాయ్‌దేశాయ్ 1969 జనవరి 26 వ తేదీన ఆకాశవాణి హైదరాబాదు కేంద్రం నుంచి ప్రసారం చేసిన రిపబ్లిక్ దినోత్సవ సందేశం పూర్తి పాఠం దిగువ యివ్వబడినది:—

''మిత్రులారా!

"భారతదేశం రిపబ్లిక్‌గా అవతరించి నేటితో 19 సంవత్సరాలు గడిచాయి. ఈ సందర్భంలో సహజంగానే మనం ఎంతో ఆనందం పొందుతున్నాము. ఇతర ప్రదేశాలలోవలెనే ఆంధ్రప్రదేశ్‌లో కూడా ప్రజలు రిపబ్లిక్ దినోత్సవాన్ని సముచిత రీతిని జరుపుకున్నారు. స్మరణీయమైన యీ సందర్భంలో ఆంధ్రప్రదేశ్ ప్రజలకు, దేశంలోని ఇతర ప్రాంతాల వారికీ నా శుభాకాంక్షలు తెలియజేస్తున్నాను. దేశ సమైక్యత, పురోభివృద్ధి కొరకు నిస్వార్థంగా కృషి చేయడం కొరకు యీనాడు మనం తిరిగి ప్రతిజ్ఞ బూనాలి. గతంలో మనం సాధించిన విజయాలను సమీక్షించుకొని దేశాభ్యున్నతిని సాధించడానికై పునరంకితులం కావడానికి కూడా యీ సందర్భాన్ని వినియోగించుకోవాలి."

"స్వతంత్ర భారతదేశం తన ప్రజాస్వామిక రాజ్యాంగం ద్వారా; కులం, మతం, రాబడి, విద్య మొదలైన వాటితో నిమిత్తం లేకుండా వయోజను లందరికీ ఓటు హక్కును సంక్రమింపజేసింది. మనం రాజకీయంగా స్వరాజ్యం సంపాదించడంలో సఫలులమైనప్పటికీ ఆర్థికంగా, సామాజికంగా కూడా స్వరాజ్యం పొందేవరకూ మన వాసవిక సమస్యలు పరిష్కారం కావు. కనుకనే మనం ఆ లక్ష్యసాధనకొరకు నిరంతరం కృషి చేస్తున్నాము. దారిద్ర్యం, అజ్ఞానం, అనారోగ్యం, అస్పృశ్యత, నిరుద్యోగం మొదలైన వాటి నిర్మూలన కొరకు పాటు పడుతున్నాము.

"భారత పదాతిదళం, విమానదళం, పోలీసుదళం, అగ్నిమాపకదళం, ఎన్. సి సి., హోం గార్డులు, జైలు గార్డులు మొదలైన వారు యీ రోజు ఉదయం జరిపిన ఆకర్షణీయమైన పెరేడును మీలో చాలామంది చూచి ఆనందించి ఉంటారు. ఈ పెరేడులో వందన స్వీకారం చేసే అవకాశం కలగడాన్ని నేను చాలా గౌరవంగా భావిస్తున్నాను. ఇదిఎంతో హుందాగా, ఆకర్షణీయంగా ఉంది. అందుకు వారందర్నీ నేను అభినందిస్తున్నాను. ఈ ఉదయం పోలీసు పతకాలు పొందిన వారికి కూడా నా అభినందనలు తెలియజేస్తున్నాను.

''1950 జనవరి 26 వ తేదీన మనదేశం సర్వ సమగ్ర ప్రజా స్వామిక రిపబ్లిక్‌గా అవతరించింది. దేశ ప్రజలందరికీ భావ ప్రకటనా స్వాతంత్ర్యాన్ని, సాంఘిక, రాజకీయ న్యాయాన్ని, సమానావకాశాలనూ చేకూర్చే రాజ్యాంగాన్ని ఆ నాడు మనం అవలంభించాము. గత 19 సంవత్సరాలుగా మన లక్ష్య సాధనకై మనం పురోగమిస్తున్నాము. దేశప్రజల ఆర్థిక పరిస్థితిని ముఖ్యంగా సమాజంలోని బీద వర్గాల ఆర్థిక దుస్థితిని–బాగు చేయడంపట్ల దేశమంతటా చైతన్యం వెల్లివిరుస్తున్నది.

''భారతావని వంటి అభివృద్ధి చెందిన దేశాలను ఎదుర్కొనే ప్రధాన సమస్య–నిరుద్యోగం. మన పంచవర్ష ప్రణాళికల వల్ల ఏర్పడుతున్న ఉద్యోగావకాశాలు, జనాభా పెరగడంవల్ల యీ సమస్యను పూర్తిగా పరిష్కరించలేక పోతున్నాయి.

''దేశ వ్యాప్తంగా సహకార సంఘాలను నెలకొల్పడం వల్ల సామ్యవాద నరళి సమాజ లక్ష్యాన్ని చక్కగా సాధించడానికి సాధ్యమవుతుంది. ప్రతి గ్రామంలోనూ ఒక సహకార సంఘం ఉండాలి. ఆ సంఘంలో సభ్యత్వం పొందడానికి గ్రామంలోని ప్రతి కుటుంబాన్నీ ప్రోత్సహించాలి. ఈ సంఘాల ద్వారా గ్రామాలకు సౌకర్యాలు కల్పించడం సులభసాధ్యమవుతుంది. ఈ సంఘాలు గ్రామస్థులలో సంఘీభావం ఏర్పడడానికి దోహదం చేయడమేగాక ప్రజాస్వామ్యపు పునాదులను పటిష్ఠం చేయగలుగుతాయి.

''రాజకీయ స్వరాజ్యం ఒక లక్ష్య సాధనం మాత్రమే కాని లక్ష్యం కాదు. అహింసా విధానంలో, శాంతియుత మార్గంలో,

ప్రజాస్వామిక పద్ధతిలో మన ప్రజలకు సుఖ సంతోషాలను కలగ జేయడమే అసలు లక్ష్యం. ఈ లక్ష్య సాధనకై మనందరం కష్టపడి పని చేయడం అవసరం. సమైక్యతా భావాన్ని మనం పెంపొందించాలి. అనైక్యతవల్ల కలిగే అనర్థాలను గురించి హెచ్చరించే ఉదంతాలు మన దేశచరిత్రలో అనేకం ఉన్నాయి. కాబట్టి సమైక్యతకు తోడ్పడే సుగుణాలను మనం అలవర్చుకోవాలి. విశాల దృక్పథం, సహనం, సుహృద్భావం, సదవగాహన —ఇవే ఆ సుగుణాలు.

"వచ్చే సంవత్సరాలలో మనం బృహత్కార్యాలను నెరవేర్చవలసి ఉంది. మనం స్వాతంత్ర్యం పొంది 21 సంవత్సరాలు మాత్రమే గడిచాయి. కాబట్టి రాజకీయంగా మన దేశం తరుణ ప్రాయురాలు. అయితే మన సాంస్కృతిక వారసత్వం సుసంపన్నమైనది. మన దేశంలో జీవన ప్రమాణం చాలా తక్కువగా ఉంది. కాబట్టి ఆర్థికాభివృద్ధి మనకు అత్యావశ్యకం. అయితే యీ అభ్యుదయ కాంక్షవల్ల మనం నైతిక, ఆధ్యాత్మిక విలువల ప్రాధాన్యాన్ని ఎంతమాత్రం విస్మరించమని నేను విశ్వసిస్తున్నాను.

ప్రతిఒక్కరు క్రమశిక్షణకులోబడి, కర్తవ్యాన్ని గుర్తెరిగి, నిజాయతీతో వ్యవహరించాలి. అందరూ దేశంకోసం నిస్వార్థంగా నిజాయతీతో కృషిచేసినట్లయితే అభ్యున్నతి అచిరకాలంలోనే సాధ్యమవుతుంది.

"ఇది గాంధీ శతజయంతి సంవత్సరం కాబట్టి యీ ఏడాది రిపబ్లిక్‌దినోత్సవాలకు విశేష ప్రాముఖ్యంఉంది. గాంధీజీ స్వదేశీ సందేశంద్వారా మనకు జాతీయతా భావాన్నీ, ఆత్మ గౌరవాన్నీ కలిగించాడు. కాబట్టి గాంధీ శతజయంతి ఉత్సవాలు, మనలో జాతీయ సమైక్యతత్వాన్ని దృఢతరం చేయడానికి దోహదం చేయాలి. మన జాతిపిత ఆదర్శాలైన జాతీయ సమైక్యత, మత సామరస్యం, హరిజనోద్ధరణ కొరకు పునరంకితులై తద్వారా రాష్ట్రాభ్యుదయాన్నీ, దేశాభ్యుదయాన్నీ సాధించవలసిందిగా యీ శుభ సందర్భంలో నేను ఆంధ్ర ప్రజలందరికీ విజ్ఞప్తి చేస్తున్నాను.

జై హింద్ !"



## మహాకవి గాలిబ్

ఫిబ్రవరి 15న గాలిబ్ శత వర్థంత్యుత్సవాలు దేశమంతటా ఘనంగా జరిగాయి.

46వ పుటలో జీవిత విశేషాలు

## ముఖ్యమంత్రి రిపబ్లిక్ దినోత్సవ సందేశం



# 'వేర్పాటుధోరణులు సమసిపోవాలి'

"చతుర్థ ప్రణాళిక ప్రారంభంకానున్న ఈ తరుణంలో భారత రిపబ్లిక్, మన చరిత్రలో ఒక గణనీయమైన ఘట్టంలోనికి ప్రవేశిస్తున్నది చిరతస్థాయంలో వున్న మన ప్రజాస్వామ్యాన్ని ఎదుర్కొంటున్న సమస్యలూ, సవాళ్లూ అనేకం.

"నిజానికి భారతదేశం బాహ్యంగా ఎదురైన అనేక సవాళ్ళను ధైర్యంగా, ఆత్మవిశ్వాసంతో ఎదుర్కొన్నది కాని ఈ నాడు అంతర్గతంగా ఎదుర్కొనవలసి వస్తున్న సవాళ్లు మరింత జటిలమైనవిగా, మన మనుగడకే ప్రమాదకరమైనవిగా పరిణమిస్తున్నాయి కాగా వాటిలో హింసావిధానం, ప్రాంతీయతత్వం, అలజడి ఆందోళనలు జరపాలన్న దృక్పథం, మన సమాజం క్రమ పద్ధతిలో పురోభివృద్ధి చెందడంలో తీవ్ర ప్రతిబంధకం కలిగిస్తాయి.

"విశాలమైన ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం 12 సంవత్సరాల క్రితం ఏర్పడింది. ఈ రాష్ట్రావతరణం దాదాపు చారిత్రకంగా తప్పనిసరి. మన పాత తరానికి చెందిన నాయకాగ్రేసరుల నిరంతరకృషి, నిరుపమ త్యాగాల ఫలితంగా ఇది సిద్ధించింది. ఆ తరం నుండి మనకు లభించిన అమూల్యమైన వారసత్వం యిది.

"దీనికి మనం యోగ్యులం కావాలంటే మనం, మన భవిష్యత్తును తీర్చిదిద్దుకునే కృషిలో నిమగ్నులై, క్రమశిక్షణకు బద్ధులైవున్న ప్రజలు ప్రదర్శించేటట్టి కర్తవ్యపరాయణతనూ, దేశభక్తిభావాన్నీ ప్రదర్శించాలి. సమైక్యం జరుగుతున్న ఈ తరుణంలో విచ్ఛిత్తిధోరణులు తలెత్తడంవల్ల ఆ ఆంధ్రప్రదేశ్ ప్రయోజనాలకూ, దేశశ్రేయస్సుకూ విఘాతం ఏర్పడడం తథ్యం.

"ఈ నాడు భారతదేశం ప్రధానంగా ఆర్థికరంగంలో అనేక సవాళ్ళను ఎదుర్కొంటున్నది. మన ఆర్థిక వ్యవస్థ నానాటికీ సుదృఢమై, ప్రజలు సుఖజీవనం గడపగలరని నేను ఆశిస్తున్నాను. మనం మన బాధ్యతలను గుర్తించి, ఈ బృహత్కృషిలో పాల్గొనడానికై భగవంతుడు మనకు శక్తి సామర్థ్యాలను ప్రసాదించుగాక."

# రిపబ్లిక్ దినోత్సవ వేడుకలు



గవర్నరు పతాక వందనం స్వీకరిస్తున్న దృశ్యం

ఈసారి నగరంలో జరిగిన రిపబ్లిక్ దినోత్సవ వేడుకలలో ముగ్ధ మోహనంగా చూపరులను ఆకట్టుకోగలిగినది కవాతు ప్రదర్శన కార్యక్రమం. ఇందులో త్రివిధ సాయుధ బలాల సభ్యులు, ఎన్.సి.సి కేడెట్లు, ప్రాంతీయ సైనికదళం సభ్యులు, హోంగార్డులు, అశ్వారూఢులైన పోలీసులు. ప్రత్యేక సాయుధ పోలీసుదళ సభ్యులు, నగర పోలీసుదళ సభ్యులు, అగ్నిమాపకదళ సభ్యులు పాల్గొన్నారు. కవాతుప్రదర్శన సాగిపోయిన దారిపొడవునా వేలాది ప్రజలుచేరి ఆనందోత్సాహాలతో ఈ ప్రదర్శనను తిలకించారు. రాష్ట్రగవర్నరు శ్రీ ఖండూభాయి దేశాయ్ సైనిక వందనం స్వీకరించారు.

పోలీస్ యిన్‌స్పెక్టర్ జనరల్ శ్రీ ఆత్మా జయరాంకు, రాష్ట్రపతి పోలీస్, ఫైర్‌సర్వీస్ పతకాన్ని గవర్నరు బహూకరించారు. వీరితోపాటు మరి ఏడుగురు అధికారులకు కూడా పోలీసు పతకాలను గవర్నరు ప్రదానంచేశారు. సికందరాబాద్‌లోని మిలిటరీ కాలేజికి చెందిన శ్రీ యస్. యేసుదాస్‌కు జీవన రక్షా పతకాన్ని కూడా ఆయన బహూకరించారు.



హైద్రాబాదులోని ఆంధ్రప్రదేశ్ నాల్గవ తరగతి ఉద్యోగుల కేంద్ర సంఘం కార్యాలయం వద్ద జాతీయ పతాకాన్ని ఆవిష్కరిస్తున్న రాష్ట్ర ప్రభుత్వ ప్రధాన కార్యదర్శి

దాదాపు రెండు మైళ్ళ పొడవున సాగిపోయిన ఈ కవాతు ప్రదర్శనం నగరంలోని ముఖ్య ప్రాంతాల గుండా వెళ్ళింది. పబ్లిక్ గార్డన్స్ వద్ద శ్రీ సర్దార్ పటేల్ విగ్రహానికి అభిముఖంగా ప్రత్యేకంగా నిర్మించబడిన వేదిక నుండి గవర్నరు వందన స్వీకారం చేశారు.

ప్రబోధాత్మక సందేశంతో అలంకృత శకటాలు కూడా కవాతు ప్రదర్శనలో వున్నాయి. కుటుంబ నియంత్రణ, హరిజ



గిరిజన సంక్షేమశాఖ అలంకృత శకటం

నోద్ధరణ, గిరిజన సంక్షేమం, వినోదకై యాత్రాస్థల సందర్శన, విద్యారంగంలో సాధించిన అభివృద్ధిని వివరిస్తూ, రాష్ట్ర ప్రభుత్వం ఈ అలంకృత శకటాలను ఏర్పాటుచేసింది.

ప్రభుత్వభవనాలు, ప్రయివేటు భవనాలు, పార్కులు, చౌరస్తాలు, వివిధ కేంద్రాలలో స్వేచ్ఛా వాయువులను పీల్చుకుంటూ జాతీయ పతాకాలు ఆకాశంలో నాట్యం చేస్తుంటే నగరం శోభాయమానంగా ప్రకాశించింది.

ప్రముఖస్థలాలలో రాత్రిపూట దీపాలంకరణ నగరానికి వినూత్నశోభను చేకూర్చింది. సెక్రటేరియట్ భవనం, శాసనసభ భవనం, పబ్లిక్‌గార్డెన్స్ ద్వారం, చార్మినార్‌లు దీపాలంకరణతో దేదీప్యంగా ప్రకాశించాయి.



పోలీసు ఇనస్పెక్టర్ జనరల్ శ్రీ ఆత్మా జయరాం కు రాష్ట్ర గవర్నరు, రిపబ్లిక్ దినోత్సవ పరేడులో రాష్ట్రపతి పోలీసు, ఫైర్ సర్వీసు పతకాన్ని అలంకరిస్తున్న దృశ్యం



జనసంబంధశాఖ అలంకృత శకటం

## ఆంధ్రప్రదేశ్‌లో ఈ ఏడాది రాష్ట్రపతి రిపబ్లిక్ దినోత్సవ అవార్డులను పొందినవారు

పద్మభూషణ్ : ప్రొఫెసర్ హరూన్‌ఖాన్ షెర్వాణీ, విద్యావేత్త, హైదరాబాదు.

పద్మశ్రీ : శ్రీ ఎన్. బాలకృష్ణారెడ్డి, సాంఘిక కార్యకర్త, వాకాడు, నెల్లూరు జిల్లా.

పద్మశ్రీ : శ్రీ ఉలిమిరి రామలింగస్వామి, పేథాలజీ ప్రొఫెసర్, ఆలిండియా ఇనిస్టిట్యూట్ ఆఫ్ మెడికల్ సైన్సెస్, న్యూఢిల్లీ.

గవర్నరు యీ దిగువ వారికి కూడా విశిష్ట సేవకు చిహ్నంగా యిచ్చే రాష్ట్రపతి పోలీసు పతకాలను బహూకరించారు.

సర్వశ్రీ ఎస్. ఆనందరాం, డిప్యూటీ ఐ. జి. పి. దక్షిణ విభాగం; జె. లక్ష్మణరావు, డిప్యూటీ ఎస్. పి. ఆదిలాబాదు; ఎం. ఇంద్రారెడ్డి, అవినీతి నిరోధకశాఖ ఇనస్పెక్టర్, హైదరాబాదు; ఎం. వి. సుబ్రహ్మణ్యం, అవినీతి నిరోధక శాఖ ఇనస్పెక్టరు, అనంతపురం; ఎ. ఎస్. ప్రబోధనరావు సి.ఐ.డి. స్పెషల్ బ్రాంచి ఇనస్పెక్టరు, హైదరాబాదు; మహబూబ్ అలీ, హెడ్ కానిస్టేబుల్, సి. ఐ. డి., క్రైమ్ బ్రాంచి, హైదరాబాదు; డి. పాపారావు, హెడ్ కానిస్టేబుల్ తూర్పు గోదావరి జిల్లా.



# "పరిపూర్ణ భావసమైక్యతాకృషి-మన తక్షణ కర్తవ్యం"

—ముఖ్యమంత్రి ఉద్బోధ

ఆంధ్రప్రదేశ్ అవతరణ 1-11-1956వ తేదీన జరగడంతో శతాబ్దాల తరబడి యావదాంధ్రుల చిరకాల వాంఛగా నిలిచిపోయిన ధ్యేయం సిద్ధించింది. సాంస్కృతికంగానూ, భాషాపరంగాను, ఆర్థికంగాను, నైసర్గిక సంపద దృష్ట్యాను — ఆంధ్రప్రదేశ్ సమగ్ర సమృద్ధి కలిగిన రాజ్యంగా రూపొందిందనడంలో సందేహం లేదు. గోదావరీ, కృష్ణా, తుంగభద్ర, పినాకినీ నదులతోను, అశేష ఖనిజ సంపదతోను, సస్యశ్యామలమైన అసంఖ్యాక సుక్షేత్రాలతోను, నౌకాయాన వాణిజ్య సౌలభ్యంతోను, వేంకటరమణుని దివ్యసన్నిధితోపాటు శ్రీశైల కాళేశ్వర ద్రాక్షారామనామక త్రిలింగాది మహాక్షేత్రములతోను, అనేక భాషల కూడలిగా, అనేక సాహిత్యాల సంగమంగా, అనేక కళలకు ఆటపట్టుగా, అనేక ప్రాచీన అర్వాచీన శిల్ప సౌందర్యాలకు నిలయంగా — ఒక్క మాటలో చెప్పాలంటే ఉత్తర దక్షిణాల మధ్య సేతువుగా రూపొందిన చిన్నపాటి భారతదేశమే ఆంధ్రప్రదేశమనడంలో అతిశయోక్తి లేదు. తెలుగువారందరు ఏకరాష్ట్ర చ్ఛాయలోకి చేరుకొనడమంటే ఒక అపూర్వ చారిత్రాత్మక సంఘటన, తమ భవితవ్యాన్ని తీర్చిదిద్దుకొని సర్వతోముఖ ప్రగతిని సాధించి వికసించడానికి ఆంధ్రులకు కాలపురుషుడు ప్రసాదించిన సర్వ ప్రథమ మహదవకాశం. ఆంధ్రప్రదేశ్ అవతరణ ఏవో కొన్ని తాత్కాలిక ప్రయోజనాలకొరకో, ఒత్తిళ్ళ ఫలితంగానో జరగలేదు. ఏ కొద్దిమంది పరిపాలకులో, నాయకులో సంకల్పించినందున మాత్రమే జరగలేదు. వాస్తవమేమంటే ఆంధ్రప్రదేశ్ అవతరణ భారత స్వాతంత్ర్యానంతరం జరిగిన పునర్వ్యవస్థీకరణలో సహజ పరిణామంగా జరిగింది. రాష్ట్రాల పునర్విభజన సందర్భంలో వివిధాభిప్రాయాలను పరిశీలించిన పిదపనే యావదాంధ్రుల సర్వతోముఖ ప్రగతికి సాధనంగా రాష్ట్ర నిర్మాణం జరిగింది కాబట్టి ఆరు నూరైనా, నూరు ఆరైనా ఆంధ్రప్రదేశ్ నేడొక తిరుగులేని సత్యంగా, చెరగబోని తథ్యంగా నిలిచిందని అందరం గ్రహించాలి.

## పెద్దమనుష్యుల ఒప్పందం

పూర్వపు మద్రాసు రాష్ట్రంలోని తెలుగు జిల్లాలతో 1953 లో రూపొందిన ఆంధ్రరాష్ట్రమున్నూ, పూర్వపు హైదరాబాదుకు చెందిన తెలంగాణా ప్రాంతమున్నూ కలసి ఆంధ్రప్రదేశ్ విశాల రాష్ట్రం రూపొందిన విషయం అందరికీ విదితమే. ఐతే ఈ రెండు ప్రాంతాల విలీనీకరణ జరుగనున్న సందర్భంలో దాని సాధక బాధకాలకు సంబంధించిన అనేక చర్చలు జరిగాయి. అనేక దృక్కోణాలు పరిశీలింపబడ్డాయి. రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ కమిషన్‌వారు కూడ అన్ని విషయాలను క్షుణ్ణంగా పరిశీలించారు. త్రిభాషా రాష్ట్రమైన హైదరాబాదు విభజన అంగీకరించిన సందర్భంలో తెలంగాణా ప్రాంతం వేరయ్యే పరిస్థితి ఏర్పడింది. అటు ఆంధ్రప్రాంతం, ఇటు తెలంగాణా ప్రాంతం దేనికది ఉంటే అసమగ్రంగానే ఉండిపోతాయన్న విషయం స్పష్టమైంది. కారణమేమంటే ఆంధ్ర, తెలంగాణా ప్రాంతాలు ఎన్నో విషయాలలో పరస్పర పూర్వకంగా ఉన్నాయి. రెండూ కలిస్తే సముజ్జ్వల భవితవ్యాన్ని సంతరించుకో జాలిన ప్రముఖ రాష్ట్రమౌతుంది. పసిడికి తావి అబ్బినట్లుంటుంది. ఆంధ్రుల చరిత్ర వికసిస్తుంది. తెలుగువెలుగు నలుదెసల వ్యాపిస్తుంది. ఐతే ఈ ఆశాభావంతోపాటు ఒక సందేహం కూడా పొడ చూపింది. కారణమేమంటే అనేక విషయాల్లో పరస్పర పూరకంగా ఉన్న ఆంధ్ర తెలంగాణా ప్రాంతాలు కొన్ని విషయాల్లో పరస్పర వ్యత్యాసాలు కూడ కలిగి ఉన్నాయి. ఆర్థిక సోమతలో విద్యా వ్యాప్తిలో, వైద్యాది సౌకర్యాల్లో, నీటిపారుదలలో, విద్యుచ్ఛక్తి మొదలగు మరికొన్ని కార్యక్రమాల్లో తెలంగాణా ప్రాంతం వెనుకబడిఉంది. అట్టి స్థితిలో రెండూ నిర్నిబంధంగా కలిస్తే వెనుకబడిన ప్రాంతానికి నష్టం వాటిల్లదుకదా అన్నదే సందేహం. ఆశాభావాన్నీ, సందేహాన్నీ, రాష్ట్ర నిర్మాతలు కూలంకషంగా పరిశీలించి సమన్వయించారు. దాని ఫలితంగానే ఒక పెద్దమనుషుల ఒప్పందం ఏర్పడింది. తెలంగాణా ప్రాంతానికి చెందిన నాన్ గెజెటెడ్ ఉద్యోగాలు ఈ ప్రాంతం వారికే దొరకాలనిన్నీ, తెలంగాణా ప్రాంతపు ఆదాయాన్ని ఈ ప్రాంతపు అభివృద్ధికొరకే తప్పనిసరిగా ఖర్చుచేయాలనిన్నీ, ఒక ప్రాంతీయ సంఘాన్ని తెలంగాణా ప్రాంతపు శాసన సభ్యులతో ఏర్పరచాలనిన్నీ — ఈ ముఖ్యాంశాలతో ఒప్పందం రూపొందింది. ఆంధ్రప్రదేశ్‌నిర్మాణం జరిగింది.

ఆంధ్ర ప్రదేశ్ అవతరణానంతరం తెలంగాణా ప్రాంతంలో జరిగిన అభివృద్ధిని పరిశీలిస్తే కించపడవలసిన

అవసరమేమాత్రం కనిపించదు. ఏ రంగంలో చూచినా గణనీయమైన అభివృద్ధిని సాధించడం జరిగిందని చెప్పవచ్చు ఉదాహరణానికి కొన్ని అంకెలు గమనిద్దాం. 1957వ సంవత్సరంలో విద్యుచ్ఛక్తి సరఫరా పొందిన గ్రామాల సంఖ్య ఆంధ్ర ప్రాంతంలో 764, తెలంగాణాలో 18 వున్నాయి. 1968 మార్చి నెలవరకు ఇట్టి గ్రామాల సంఖ్య ఆంధ్రప్రాంతంలో 3405 కు, తెలంగాణాలో 1402 కు పెరిగింది. అనగా గత పది సంవత్సరాల్లో ఆంధ్రప్రాంతంలో 2641 క్రొత్తగ్రామాలకు, తెలంగాణా ప్రాంతంలో 1384 క్రొత్త గ్రామాలకు విద్యుచ్ఛక్తి సరఫరా చేయడం జరిగింది. 1956 లో తెలంగాణాలో విద్యుచ్ఛక్తి తలసరి వినియోగం అత్యంత స్వల్పంగా ఉందని వేరే చెప్పనవసరం లేదు. కాని పది సంవత్సరాల పిమ్మట ఆంధ్ర ప్రాంతంలో తలసరి వినియోగం 35.5 ఉండగా తెలంగాణా ప్రాంతంలో 28.9 కు పెరిగింది. ఈ పెరుగుదలకు ఎవ్వరైనా గర్వించదగినదే. ఆరోగ్య వైద్య సదుపాయాలు చూస్తే నేడు ఆంధ్రప్రాంతంలో రోగుల పడకల మొత్తం సంఖ్య 10707. తెలంగాణా ప్రాంతంలో 8,[illegible]94. అనగా ఆంధ్రప్రాంతంలో లక్ష జనాభాకు దాదాపు 46 పడకలుంటే తెలంగాణాలో 67 ఉన్నాయి. ఇటీవలనే ఖమ్మం, నల్లగొండ జిల్లా కేంద్రాల్లో క్రొత్త ఆసుపత్రి భవనాలు కట్టడం జరిగింది. మహబూబునగర్ లో భవన నిర్మాణం ప్రారంభమైంది. విద్యా రంగంలో పరిశీలిస్తే తెలంగాణాలో గత 10 సంవత్సరాల్లో జరిగిన అభివృద్ధి గర్వకారణమైంది. ఉన్నత పాఠశాలల సంఖ్య 105 నుంచి 1173 వరకు పెరిగింది. మారుమూల గ్రామాల వరకు విద్యా సౌకర్యాలు అందించబడ్డాయి. సాంకేతిక విద్యారంగంలోకూడ మంచి ప్రగతి సాధించడం జరిగింది. అలాగే నీటిపారుదలలోను, ఎరువుల సరఫరాలోను, అప్పులివ్వడంలోను, వ్యవసాయ రంగంలో కావలసిన ఇతర వనరులు సమకూర్చడంలోను, పరిశ్రమలు నెలకొల్పడంలోను ఎన్నుకోదగ్గ ప్రగతిని సాధించడం జరిగిందనడం తథ్యం.

## దేశంలో వచ్చిన ఆర్థికమాంద్యం ప్రభావం

ఐతే ఇప్పటికి సాధించిన ఈ ప్రగతి తెలంగాణా ప్రాంతపు అవసరాల దృష్ట్యా చాలునని కానీ, ఈ ప్రాంతపు వెనుకబడినతనం ఇంతటితో తుదముట్టిందని కానీ ఎవ్వరూ అనరు; అనజాలరు నానాటికీ పెరిగిపోతున్న అవసరాల దృష్ట్యా అన్ని ప్రాంతాలవలెనే, అన్ని రాష్ట్రాలవలెనే, తెలంగాణా ప్రాంతంలో కూడ అవసరాలను పూర్తి చేసుకునే స్తోమత క్షీణిస్తూ వచ్చింది. ముఖ్యంగా గత 3 సంవత్సరాల్లో దేశంలో సంభవించిన ఆర్థిక మాంద్యం, అభివృద్ధి కార్యక్రమాల స్తంభన, ప్రణాళికల నిలుపుదల, వనరులతగ్గుదల—ఈ కారణాల వల్ల నిరుద్యోగ సమస్య కరాళస్వరూపం దాల్చింది. విద్యా సంస్థలనుండి ఉత్తీర్ణులై వచ్చే యువకులకు జీవనోపాధి అవకాశమేదీ కానరాలేదు. పెక్కుమందిని ఉద్యోగం నుండి తొలగించడంకూడ జరిగింది. దానితో యువకులందరిలో అసంతృప్తి బయలు దేరింది.

## తెలంగాణా అభివృద్ధికి ప్రభుత్వం నిర్ణయం

తెలంగాణా ప్రాంతానికి చెందిన పబ్లిక్ ఉద్యోగాల మొత్తం సంఖ్య షుమారు 80,000 ఉండవచ్చు. వీటిలో నాన్ గెజెటెడ్ ఉద్యోగాలకు తెలంగాణా ప్రాంతీయులను మాత్రమే నియమించే పాలసీని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం పూర్తిగా అంగీకరించింది. ఐతే గత 10 సంవత్సరాల్లో దాదాపు 2,3 వేల ఉద్యోగాలు వివిధ స్థాయిల్లో స్థానిక సంస్థలలో వివిధ నియామకాధికారుల ద్వారా ప్రాంతీయేతరులకు లభ్యమైనట్టు ఇటీవల తేలింది. వీటిలో బి.ఇడి. ఉపాధ్యాయులు, నర్సులు, స్టెనోగ్రాఫర్లు మొదలైన వారున్నారు. స్థానికుల్లో తగిన అర్హతలున్నవారు లేనందున వీటిలో కొన్ని నియామకాలు జరిగాయనిన్నీ, మరికొన్ని అకారణంగానే జరిగాయనిన్నీ తెలుస్తున్నది. ఈ విషయం ప్రభుత్వ దృష్టికి రాగానే అట్టి ఉద్యోగాలు స్థానికులకు మళ్లీ దొరికేటట్టు కట్టుదిట్టాలు చేయాలని నిర్ణయం జరిగింది. దీనితోపాటు గత 12 సంవత్సరాల్లో తెలంగాణా నిధులనుండి వినియోగం కాక మిగిలిపోయిన మిగులు నిధులను వచ్చే 5 సంవత్సరాల్లో తెలంగాణా ప్రాంతాభివృద్ధికి వ్యయం చేయాలని ప్రభుత్వం నిర్ణయించింది. గతంలో కూడ తెలంగాణాలో ఖర్చు కాక మిగిలిపోయిన నిధులను మళ్లీ తెలంగాణా అభివృద్ధికి ఖర్చు పెట్టే నిర్ణయాలు తీసుకోవడం జరిగింది. తెలంగాణా మిగులు నిధుల నుండి ఉస్మానియా విశ్వవిద్యాలయానికి ఫౌండేషన్ నిధి ఇవ్వడంతోసహా జిల్లాల్లో కూడా వివిధ కార్యక్రమాలు చేపట్టడం జరిగింది. ఈ కార్యక్రమాన్ని ఇతోధికంగా అమలుపరచి వచ్చే నాలవ పంచవర్ష ప్రణాళికా కాలంలో తెలంగాణా మిగులు నిధులు నిశ్శేషంగా వ్యయంచేసి ఈ ప్రాంతపు సత్వరాభివృద్ధిని సాధించాలని ప్రభుత్వ నిర్ణయం.

## అర్థరహితమైన నినాదం

ఖచ్చితమైన పై నిర్ణయాలు జరిగినప్పటికీ దురదృష్టవశాత్తు గతకొన్ని రోజులుగా రాష్ట్రంలో వికృతస్వరూపం దాల్చిన అలజడులు జరిగాయి. ముఖ్యంగా విద్యార్థులతో ఈ ఉద్యమం ప్రారంభమై చివరకు అసాంఘిక శక్తుల హస్తగతమై ప్రాంతీయ విద్వేషానికి దారితీసి నిర్దోషులైన పెక్కుమంది పౌరులకు అత్యంతమైన బాధకలిగించడం మిక్కిలి గర్హనీయమైన విషయం. దౌర్జన్యాలకు గురియైన పౌరులందరికి నా హృదయపూర్వక సానుభూతి తెలియజేస్తున్నాను. ప్రాణాలుకోలుపోయిన వారిపట్ల ప్రగాఢ సంతాపాన్ని ప్రకటిస్తున్నాను. అరాచక శక్తుల చర్యలను అణచి శాంతి భద్రతలను పరిరక్షించడం ప్రజాప్రభుత్వ తక్షణ కర్తవ్యమైయున్నది. ఈ కర్తవ్య నిర్వహణలో ప్రభుత్వానికి సాయపడుతూ ఇటీవలి అమానుషచర్యల మూలాన ఆంధ్రప్రదేశ్ పౌరులకు సంక్రమించిన కళంకాన్ని తుడిచిపెట్టి, రాష్ట్ర ప్రజల సమైక్యతను పునఃప్రతిష్ఠించే బాధ్యతను అందరు స్వీకరించవలసి యున్నది. ఉద్యమ సందర్భంలో కొందరు వేరుగా తెలంగాణారాష్ట్రం కావాలన్న నినాదాన్ని లేవనెత్తారు. యీ విషయయంలో, ప్రత్యేకంగా ఉద్యోగులు ఎలాటి అసంతృప్తికి తావివ్వకుండా వ్యవహరించవలసివుంటుంది. దానికన్న అవాస్తవిక

మైన నష్టదాయకమైన నినాదం మరొకటి ఉండబోదు. కాలచక్రాన్ని వెనక్కి తిప్పజూచే ఈ నినాదం అత్యంత అసంగతమైనది. అందుకనే దానికేలాటి బలమూ చేకూరకుండడం ముదావహం.

వ్యవసాయరంగంలో ఆంధ్రప్రదేశ్ ఎంతో ముందంజ వేసినప్పటికి పారిశ్రామిక రంగంలో అనుకున్నంత అభివృద్ధి సాధించడం జరగలేదు. ఇప్పుడిప్పుడే రాష్ట్రంలో పరిస్థితులు కుదురుకొని ఇతర ప్రాంతాలనుండి పారిశ్రామిక పెట్టుబడులు పెద్దయెత్తున మన రాష్ట్రంలోకి వచ్చే సూచనలు కానవచ్చాయి. దీనికి మన ఆంతరంగిక ప్రశాంతత, పటిష్ఠత కారణం. ఆశించిన మేరకు నూతన పరిశ్రమలు వస్తే మన యువకులకు ఉద్యోగావకాశాలు పెరుగుతాయి; రాష్ట్ర సంపద పెరుగుతుంది. కొన్ని పబ్లిక్ ఉద్యోగాల కొరకు చెలరేగిన అలజడిలో మనకు లభ్యం కావలసిన అనేకమైన అదనపు ఉద్యోగావకాశాలను జారవిడుచుకోవడం శ్రేయస్కరం కాదు.

## చారిత్రికమైన బాధ్యత

ఏదెలాగున్నా తెలంగాణా ప్రాంతపు ప్రత్యేక అవసరాలను తీర్చాలని ప్రభుత్వం కృతనిశ్చయంతో ఉన్నది. ఇది మన చారిత్రిక బాధ్యత. దీనివల్ల మరే ప్రాంతం వారికిన్నీ ఎట్టినష్టమూ ఉండదు. వారికట్టి ఆందోళన అనవసరం. ఒక్క రాష్ట్రంలోనే కాదు, దేశమంతటా ఎక్కడెక్కడ వెనుకబడిన ప్రాంతాలున్నప్పటికి వాటి సత్వరాభివృద్ధికై కృషిచేయడం ఆ యా ప్రాంతాలకే కాక దేశమంతటికీ శ్రేయస్కరమౌతుంది. అన్ని విధాల వ్యత్యాసాలు తొలగించి సమానావకాశాలు కల్పించడమే మన ధ్యేయం. ఈ ధ్యేయ సాధనకు ఆంధ్రప్రదేశ్‌వాసులందరూ బద్ధకంకణులై సర్వవిధ సమైక్యతా సముపార్జనకు పూనుకోవాలని హృదయపూర్వకంగా కోరుతున్నాను.''

(ఫిబ్రవరి 8 న ఆకాశవాణి ప్రసారం చేసిన ముఖ్యమంత్రి రేడియో ప్రసంగం)

# స్వర్గీయ అన్నాదురైకి శ్రద్ధాంజలి

తమిళనాడు ముఖ్యమంత్రి శ్రీ సి. యన్. అన్నాదురై ఫిబ్రవరి 3వ తేదీన మదరాసులో స్వర్గస్థులైనారు.

"శ్రీ అన్నాదురై మరణించారన్న విషాదకర వార్త నన్ను దిగ్భ్రాంతుణ్ణి చేసింది. ఆయన మరణంతో తమిళనాడు ఒక రాజనీతిజ్ఞుని, ప్రజా నాయకుని కోల్పోయింది. దేశం ఒక సుపుత్రరత్నాన్ని పోగొట్టుకొంది. ఆయన నిజమైన ప్రజాసేవకుడు. ఆయన మరణంతో దేశానికి తీరని నష్టం వాటిల్లింది. ఆయన కుటుంబానికి, తమిళనాడు ప్రజలకు సానుభూతిని అందజేస్తున్నాను." అని ఆంధ్రప్రదేశ్ గవర్నరు శ్రీ ఖండూభాయ్ దేశాయ్ ఒక సందేశంలో పేర్కొన్నారు.

"శ్రీ అన్నాదురై మరణవార్త నాకు తీవ్ర సంతాపాన్ని కలిగించింది. ఆయన ఉదాత్తుడు. ఆయనతోటి నా స్నేహం కేవలం రెండు సంవత్సరాల పాటిదే అయినా ఆయన నాతో ఎంతో సన్నిహితంగా వున్నారు. ఆయన మరణించడంతో వ్యక్తిగతంగా నేనేదో పోగొట్టుకున్నంత బాధ కలిగింది. ముఖ్యంగా తమిళనాడు ఒక ఉదాత్తనాయకుని కోల్పోయింది. ఆయన ఆత్మకు శాంతి చేకూరుగాక" అని అన్నాదురై మరణవార్త విన్న ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డి తన సంతాపాన్ని వెలిబుచ్చారు.

# తెలంగాణా రక్షణల అమలు

*శాసనసభలోని అఖిలపక్ష నాయకులతో 1969 జనవరి 19వ తేదీన హైదరాబాదులో ముఖ్యమంత్రి ఏర్పాటు చేసిన సమావేశంలో తెలంగాణా రక్షణలను సరిగ్గా అమలు పరచడానికి అనేక నిర్ణయాలు తీసుకోవడం జరిగింది.*

ఈ సమావేశంలో తీసుకున్న నిర్ణయాల పూర్తి పాఠం:—

తెలుగుభాష మాట్లాడే ప్రజలందరికి స్వంత రాష్ట్రం ఉండాలనే చిరకాల అభిమతం ఆంధ్ర తెలంగాణా ప్రాంతాల నాయకుల సమైక్య యత్నాల ఫలితంగా 1956 నవంబర్ 1వ తేదీ ఆంధ్రప్రదేశ్ అవతరించడంతో సఫలమైనది. తెలుగు ప్రజలు సాంస్కృతికంగా ఆర్థికంగా సంపూర్ణాభివృద్ధి సాధించడం మౌలికంగా వారి ఉభయుల ఆశయం. తెలంగాణా శ్రేయస్సును కాపాడడానికీ, అభివృద్ధికి హామీ ఏర్పరచడానికీ కొన్నిరక్షణలు కల్పించడం అవసరమని ఉభయప్రాంతాల నాయకులు భావించారు. తదనుగుణంగా పెద్దమనుషుల ఒప్పందంలో నిబంధనలను చేర్చారు.

## పెద్దమనుషుల ఒప్పందం అమలులో లోపాలు

పెద్దమనుషుల ఒప్పందం షరతులను ఖచ్చితంగా అమలు జరపాలని ప్రభుత్వ విధానంగా ఉంటూవచ్చినా ఆవిధానాన్ని అమలుజరపడంలో కొన్ని లోపాలు ఉత్పన్నమైనవి. ఆరక్షణలను స్వయంగా అమలుజరపేందుకు కట్టుదిట్టాలు చేయడానికై ముఖ్యమంత్రి ఏర్పాటు చేసిన శాసనసభలోని అన్నిపార్టీల నాయకుల సమావేశం దిగువనిర్ణయాలను గైకొన్నది.

## ఉద్యోగాలు

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వోద్యోగుల నియామకం [ముల్కీ-నిబంధన] నిబంధనల (1959) క్రింద తెలంగాణా ప్రాంతీయులకు రిజర్వుచేసిన ఉద్యోగాలలో నేరుగా, లేక ప్రమోషన్‌ద్వారా, లేక బదిలీద్వారా నియమించబడిన అన్య ప్రాంత వాసులైన వ్యక్తులందరినీ వెంటనే తొలగించడం జగురుతుంది. ఆ విధంగా ఏర్పడిన ఖాళీలన్నిటిని అర్హులైన తెలంగాణా ప్రాంతీయుల నియామకం ద్వారానే భర్తీచేయడం జగురుతుంది. అట్టి అభ్యర్థులు లేని సందర్భాలలో అట్టి వారు లభ్యమయ్యే దాకా ఉద్యోగాలను ఖాళీగా ఉంచడం జరుగుతుంది. ఈపైన పేర్కొన్న తరహాలో తక్షణ చర్యలు ప్రారంభమౌతాయి.

ఆ విధంగా ఉద్యోగాలనుండి తొలగించబడిన అన్య ప్రాంతీయులకు సర్వీస్ విచ్ఛిత్తి లేకుండా ఆంధ్ర ప్రాంతంలో ఉద్యోగాలు చూపుతారు. అవసరమైతే కొత్త పదవులను కల్పిస్తారు.

ఈ నిర్ణయాలను వెంటనే ఖచ్చితంగా అమలుజరిపే బాధ్యత నిర్వహణకై ఇద్దరు సీనియర్ అధికారులను నియోగిస్తారు.

దొంగముల్కీ సర్టిఫికెట్ల ఆధారంగా ఉద్యోగాలు సంపాయించారన్న ఫిర్యాదులు కొన్ని ఉన్నాయి. అట్టి ఫిర్యాదులపై దర్యాప్తునకు ప్రభుత్వం ఏర్పాటు చేస్తుంది.

## చట్టప్రాతిపదికపై ఏర్పడిన సంస్థలు

ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వోద్యోగుల నియామకపు (ముల్కీ-నిబంధన)చట్టం నిబంధనలు ప్రభుత్వ, స్థానిక పరిపాలన క్రిందగల ఉద్యోగాలకే వర్తిస్తున్నవి. ఈ చట్టం ఆంధ్రప్రదేశ్ విద్యుచ్ఛక్తి బోర్డుకు వర్తించదని హైకోర్టు ఇటీవల తీర్పుచేసినది. ఈ సంస్థలు రాష్ట్రవ్యాప్తమైనవి అయినందున వాటిలోని ఉద్యోగాలలోకూడా ప్రభుత్వోద్యోగాల విషయంలోవలెనే తెలంగాణా ప్రాంతపు అభ్యర్థులకు రిజర్వేషన్ ఉండాలని ప్రభుత్వం భావిస్తున్నది. ఈ నిబంధనలు రాష్ట్ర విద్యుచ్ఛక్తి బోర్డుకు వర్తింపచేసే విషయంలో హైకోర్టు తీర్పుపై రాష్ట్ర ప్రభుత్వం వెంటనే అపీలు దాఖలు చేస్తుంది. దానితోపాటే ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వోద్యోగుల నియామక (ముల్కీ-నిబంధన)చట్టాన్ని ప్రభుత్వనిధులతో నిర్వహింపబడుతున్న చట్ట ప్రాతిపదికపై ఏర్పడిన సంస్థలు తదితర కార్పొరేషన్లకు కూడా వర్తించే విధంగా మరి ఐదేళ్ళపాటు పొడిగించే విధమును బిల్లులో చేర్చవలసిందని కేంద్రప్రభుత్వాన్ని రాష్ట్రప్రభుత్వం అభ్యర్థిస్తుంది.

## ఏకీకృత సీనియారిటీ జాబితాలు

ఆంధ్ర, తెలంగాణా ఉద్యోగులకు వారి హోదాలు నిర్ణయిస్తూ ఒకేజాబితాను కేంద్ర ప్రభుత్వం ఆమోదించిన అన్ని సందర్భాలలోను, లేక అట్టి జాబితాల తయారీకి, లేక వాటి సవరణకి ఆదేశాలు జారీచేసిన సందర్భాలలోను అట్టి ఆమోదం పొందిన జాబితాలనే వారి ఉద్యోగ నిబంధనలను క్రమబద్ధం చేసేవిషయంలో అనుసరించడం జరుగుతుంది. కేంద్రప్రభుత్వం ఆమోదించిన ఆ తరహా జాబితాలు లేని సందర్భాలలోను, లేక అట్టి జాబితాల తయారీకి, సవరణకు ఆదేశాలు జారీకాని సందర్భాలలోను, రాష్ట్ర ప్రభుత్వం అనుసరిస్తున్న తాత్కాలిక జాబితాలను, పాటించడమే కొనసాగుతుంది. పదవులను సమస్థాయిలో ఉండేట్టు చేసేవిషయంలో, లేక హోదాల నిర్ణయానికి ఉమ్మడిజాబితాలను తయారు చేసే విషయంలో కేంద్రప్రభుత్వం ఏదైనా ఆదేశం జారీచేసిన సందర్భంలో ఇక ఆ విషయంపై ఎట్టి ఉత్తర ప్రత్యుత్తరాలు జరపకుండా అట్టి ఆదేశాన్ని రాష్ట్ర ప్రభుత్వం అనుసరిస్తుంది.

## తెలంగాణా మిగులునిధులు

తెలంగాణా మిగులునిధులను ఈ దిగువ ప్రాతిపదికపై నిర్ధారిస్తారు :—

(ఎ) ఉభయ ప్రాంతాలకు ఖర్చులను, రాబడిని కేటాయించడంలో ప్రస్తుతం అమలులో వున్న పద్ధతి కొనసాగుతుంది.

(బి) ప్రతి సంవత్సరం తెలంగాణా మిగులు నిధులను లెక్క వేయడానికి, ఆ సంవత్సరంలో తెలంగాణా నికర రెవెన్యూ మిగులుకు, ఆ సంవత్సరంలో రాష్ట్రం మొత్తంలోని పెట్టుబడి వ్యయంలో మూడవ భాగానికి, ఆకాలంలో వాస్తవంగా తెలంగాణా లోని పెట్టుబడి ఖర్చుకు మధ్యగల తేడా మొత్తాన్ని కలపడంద్వారా తేల్చవలసి ఉంటుంది.

(సి) చట్ట ప్రాతిపదికపై ఏర్పడిన తదితరమైన బోర్డులు, కార్పొరేషన్లు మొదలైన రాష్ట్ర వ్యాప్త ప్రాతిపదికపై రాష్ట్ర ప్రభుత్వ నిధులతో నిర్వహింపబడుతున్న వాటిని తెలంగాణా మిగులు నిధుల నిర్ధారణ విషయంలో, వాటిని కూడా రాష్ట్ర వ్యాప్తమైన ప్రభుత్వశాఖలుగానే, వాటి జమా ఖర్చులు ప్రభుత్వ ఖాతాలలోచేరి ఉన్నట్టుగానే పరిగణించడం జరుగుతుంది.

ఆంధ్రప్రదేశ్ విద్యుచ్ఛక్తిబోర్డు విషయంలో విద్యుచ్ఛక్తి ఉత్పాదన, హైటెన్షన్ట్రాన్స్‌మిషన్ లైన్స్‌విషయంలో మాత్రమే ఖర్చును పైన పేర్కొన్న తరహాలో ఉభయప్రాంతాలకు కేటాయించడం జరుగుతుంది. విద్యుత్సరఫరా లైను, గ్రామాలకు విద్యుచ్ఛక్తి సౌకర్య విస్తరణ విషయంలో రెండు ప్రాంతాలకు వాస్తవంగా అవసరమైనంత మేరకే ఖర్చును నిర్ణయించడం జరుగుతుంది.

(డి) ప్రత్యేకం తెలంగాణాకే పరిమితంగా వినియోగిస్తున పారిశ్రామిక ట్రస్టు నిధిని ఆ విధంగా వినియోగించడమే కొనసాగుతుంది.

ఆంధ్రప్రదేశ్ ఏర్పడినప్పటినుంచి జమకడుతూ వచ్చిన తెలంగాణా మిగులునిధులను పైన పేర్కొన్న సూత్రాల ప్రాతిపదికపై ఖచ్చితంగా లెక్క తేల్చడానికీ, ఈ విషయంలో వివాదానికి ఆస్కారం లేకుండా చేయడానికీగాను అకౌంటెంటు జనరల్ హోదాకల సీనియర్ అధికారిని నియోగించవలసిందిగా కంప్ట్రోలర్ ఆండ్ ఆడిటర్ జనరల్‌ను అభ్యర్థిస్తారు. 1969 ఫిబ్రవరి నెలాఖరులోగా తన నిర్ణయాన్ని తెలుపవలసిందిగా ఆ అధికారిని కోరుతారు.

ఆ విధంగా నిర్ధారణ అయిన తెలంగాణా మిగులునిధులను రానున్న ఐదేండ్లలో తెలంగాణా ప్రాంతం అభివృద్ధికే పూర్తిగా వినియోగిస్తారు. భవిష్యత్తులో సమకూడే తెలంగాణా మిగులు నిధులను ప్రతి ఆర్థిక సంవత్సరాంతంలో లెక్క తేల్చి, వాటిని ఆ మరుసటి సంవత్సర కాలంలో తెలంగాణా ప్రాంతంలో వినియోగించడానికి తగు ఏర్పాటు చేస్తారు. తెలంగాణా ప్రాంతంలో చేసే ఖర్చును ఆరునెలలకొకపర్యాయం ప్రభుత్వం సింహావలోకనం జరుపుతుంది. ఆ పరిశీలనా నివేదిక ప్రతిని ప్రాంతీయ సంఘానికి, శాసనసభ సభ్యులకు ప్రభుత్వం అందజేస్తుంది.

ఆంధ్రప్రాంతంలోకూడా వెనుకబడిన మండలాలున్నాయని, వాటి విషయం కూడా తక్షణం పరిశీలనార్హమని మేము గమనించాము. ఆ ప్రాంతాల సత్వర ఆర్థికాభివృద్ధికి తక్షణ ప్రాధాన్యం ఇచ్చి కృషిచేయడం ద్వారా ప్రాంతీయ అసమానతలు తొలగించడానికి, నిరుద్యోగానికి గురిఅయి కష్టపడుతున్న వారి పరిస్థితి మెరుగుదలకై ఉద్యోగావకాశాలు పెంపొందించడానికి ప్రభుత్వం యత్నిస్తుంది.

## విద్యాసౌకర్యాలు

ప్రాంతీయ ప్రసక్తి లేకుండా రాజధాని నగరమైన హైదరాబాదులో విద్యార్థులకు విద్యా సౌకర్యాలను పెంపొందింప చేయడానికి వచ్చే విద్యా సంవత్సరంనుండి చర్యలు గైకొనడం జరుగుతుంది.

పైన పేర్కొన్న తరహాలో దృఢమైన కార్యాచరణద్వారా, తెలంగాణా ప్రాంతంలో ప్రజలు వ్యక్తపరుస్తున్న కష్టాలు నివారణ కాగలవని మేము విశ్వసిస్తున్నాము. తెలుగు ప్రజల సాంస్కృతిక వికాసం ఆర్థికాభివృద్ధి మా ప్రధానాశయంగా కొనసాగగలదు. రాష్ట్ర ఆర్థిక పురోగతికి, యువతరానికి ఇతోధికంగా ఉద్యోగావకాశాల కల్పనకు దారి తీసేట్టుగా ఇతోధికమైన పెట్టుబడులనురాష్ట్రానికి ఆకర్షించడానికి తగిన వాతావరణాన్ని కల్పించడానికై రాష్ట్రంలో ఐక్యత ప్రశాంతత అత్యంతావశ్యకం. అందుచేత మన సమాజంలో విచ్ఛిన్నకర ధోరణులకు దారితీసే పనులేవీ చేయరాదు. రాష్ట్ర సంపూర్ణ ఐక్యతకు సత్వర ఆర్థికాభివృద్ధి సాధనకు యావచ్ఛక్తితో కృషిచేస్తామని విభిన్న రాజకీయ దృక్పథాలుకల మేము దృఢంగా సంకల్పిస్తున్నాము. భారత దేశంలో ఆంధ్రప్రదేశ్ ప్రముఖ స్థానాన్ని ఆక్రమిస్తున్నది జాతీయ సమైక్యతా సాధనకు మన వంతుమేరకు తోడ్పడేందుకై మనరాష్ట్రంలో మనం సంపూర్ణ సమైక్యతను సాధించడం అత్యంత ప్రధానమైన విషయం.

అందుచేత ప్రత్యేక తెలంగాణారాష్ట్రం ఏర్పాటుకు కొన్ని శక్తులు లేవదీసిన నినాదాన్ని మేము అసందిగ్ధంగా తీవ్రంగా ఖండిస్తున్నాము."

ప్రకటనపై సంతకం చేసినవారి పేర్లు.—

శ్రీయుతులు జె. చొక్కారావు, కె అచ్యుతరెడ్డి, వి.బి.రాజు, పి. నరసింగరావు, సి. హెచ్. రాజేశ్వరరావు, బద్రీవిశాల్, వై. వి. కృష్ణారావు, పి వి. నరసింహారావు, జూపూడి యజ్ఞనారాయణ, కుడుపూడి ప్రభాకరరావు, వి.రామారావు రోడామిస్త్రీ, సి. జంగారెడ్డి, ఎ. వాసుదేవరావు, సుల్తాన్ సలాఉద్దీన్ ఒవైసి, పి. నరసారెడ్డి, జె. రంగారెడ్డి, పి. గోవర్ధనరెడ్డి, జె. వెంగళరావు, టి. పురుషోత్తమరావు, కె. రాంచంద్రారెడ్డి, ఎమ్. కమాలుద్దీన్, ఎర్రం సత్యనారాయణ, సి. హెచ్. మూర్తిరాజు, కె. రాజమల్లు, కె. సుదర్శన్ రెడ్డి, కాకాని వెంకటరత్నం, ఎమ్. ఎన్. లక్ష్మీనరసయ్య, కాజ రామనాథం, టి. రామస్వామి, ఎస్. సిద్దారెడ్డి, ఎన్. రామచంద్రారెడ్డి, అరిగె రామస్వామి, ఎన్. ప్రసాదరావు, పెద్దిరెడ్డి తిమ్మారెడ్డి, జె. వి నరసింగరావు, కె. వి. నారాయణరెడ్డి, బి. వి. గురుమూర్తి, మహమ్మద్ ఇబ్రాహిమ్ అలీ, జి. లచ్చన్న, వావిలాల గోపాలకృష్ణయ్య, నరసింహారెడ్డి, చెంచురామానాయుడు, కొండా లక్ష్మణ్ బాపూజీ, కె. బ్రహ్మానందరెడ్డి.

## పరిపాలనావిషయాలు

### రాష్ట్రప్రభుత్వోద్యోగులకు కరువుభత్యం హెచ్చింపు

జీవనవ్యయ సూచీలో పది పాయింటులు పెరిగిన కారణంగా ప్రభుత్వోద్యోగుల కరువు భత్యాన్ని హెచ్చిస్తూ రాష్ట్ర మంత్రి మండలి జనవరి 18న ఒక నిర్ణయం తీసుకుంది. ఫిబ్రవరి 1వ తేదీ నుండి ఈ నిర్ణయం అమల్లోకి వస్తుంది. రు 6 నుండి రు 10 వరకూ ప్రయోజనం లభించే ఈ పెరుగుదల వల్ల రాష్ట్ర ప్రభుత్వానికి రు 4.2 కోట్లు ఖర్చు అవుతుంది. 500 రూల లోపు జీతం తీసే ఉద్యోగులకు ఈ ప్రయోజనం వర్తిస్తుంది. కరువుభత్యం పెరుగుదలలో సగభాగం నగదు రూపేణా చెల్లించబడి, తక్కిన సగభాగం ఉద్యోగుల ప్రావిడెంటు ఫండుకు జమకట్టబడుతుంది.

### తెలంగాణా మిగులు నిధులు

తెలంగాణా మిగులు నిధులను లెక్కకట్టి తేల్చేందుకు భారత ఆడిటర్, కంప్ట్రోలర్ జనరల్‌చే సూచించబడిన అధికారి శ్రీ కుమార్ లలిత్ జనవరి 21న నగరం చేరుకున్నారు. ఇటీవలి వరకూ ఆయన ఢిల్లీలో వాణిజ్య వ్యవహారాల శాఖలో అక్కౌంటెంట్ జనరల్‌గా పనిచేశారు.

### భూమిశిస్తు రెమిషను

రాష్ట్రంలో అనావృష్టికి గురైన ప్రదేశాలలో ప్రస్తుత వ్యవసాయ సంవత్సరంలో భూమిశిస్తు రెమిషను కొరకు ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం ఉత్తర్వుచేసింది. వరి పండించిన మాగాణి భూముల విషయంలో దిగుబడి ఎకరానికి 150 కి. గ్రా లు అంతకు లోపు వున్న సందర్భంలో పూర్తి రెమిషను, దిగుబడి ఎకరానికి 150 కి గ్రా. లకు పైన 300 కి. గ్రా. లకు లోపువున్న సందర్భంలో సగం రెమిషను మంజూరు చేయ బడుతుంది. వరిపంట మినహా నీటిపారుదల క్రింద సేద్యం చేయబడిన పైర్ల విషయంలో, దిగుబడి ఎకరానికి మామూలు దిగుబడిలో 8వ వంతు, అంతకు తక్కువవున్న సందర్భంలో పూర్తి రెమిషను; దిగుబడి ఎకరానికి మామూలు దిగుబడిలో 8 వ వంతుకు పైన, నాల్గవ వంతుకులోపు వున్న సందర్భంలో సగం రెమిషను ఇవ్వబడుతుంది. మెట్ట భూముల విషయంలో, పంట దిగుబడి మామూలు దిగుబడిలో నాల్గవవంతు, అంతకు తక్కువవున్న సందర్భంలో పూర్తి రెమిషను; దిగుబడి మామూలు దిగుబడిలో నాల్గవ వంతుకు పైన 3/8 వంతుకులోపు వున్న సందర్భంలో సగం రెమిషను ఇవ్వబడుతుంది. పూర్తిగా కానీ, పాక్షికంగాకానీ రెమిషను మంజూరు చేయబడిన భూముల విషయంలో రైతులు చెల్లించవలసి వున్న భూమిశిస్తు బకాయిలు, సెస్సులు, ఋణాలు మొదలైన వాటి వసూళ్ళను కూడా వాయిదా వేస్తారు. రాష్ట్రంలో అనావృష్టికి గురైన గ్రామాలలోని భూములకు యీ రాయితీలు వర్తిస్తాయి.

---

## శాసనపర్వం

### జంతువుల, పక్షుల బలిని నిషేధించడానికి శాసన చర్యలు

ఆంధ్రప్రదేశ్‌లోని హిందూదేవాలయాలలో కానీ, లేక దేవాలయావరణలో కానీ జంతువులను, పక్షులను బలి యివ్వడాన్ని 1950వ సంవత్సరపు ఆంధ్రప్రదేశ్ జంతువుల, పక్షుల బలుల నిషేధచట్టం నిషేధిస్తున్నది. మత సంబంధమైన బహిరంగ ఆరాధనాస్థలంలో కానీ, ఆవరణలో కానీ, మత సంబంధమైన ఆరాధనకు సంబంధించిన ఊరేగింపులో లేక సమూహంలో, లేక వీధిలోకానీ ఈబలులను చట్టం నిషేధించడంలేదు. అందుచేత అట్టి స్థలాలలో జంతువుల, పక్షుల బలిని నిషేధించే నిమిత్తం ప్రభుత్వం ఒక సవరణబిల్లును ప్రతిపాదించింది. ఇది ఆంధ్రప్రదేశ్ గజెటు 4–ఏ భాగం 10–7–1967 తేదీ అసాధారణ సంచికలో ప్రచురించబడింది.

ప్రస్తుత చట్టంలోని "హిందూదేవాలయం" అనే మాటలకు బదులు మత సంబంధమైన ఏదైనా బహిరంగ ఆరాధనాస్థలం, మత సంబంధమైన ఆరాధనకు సంబంధించిన ఏదైనా ఊరేగింపు లేక సమూహం–అనే మాటలను చేర్చడానికి ఈ సవరణబిల్లు ఉద్దేశిస్తున్నది. బహిరంగ ఆరాధనాస్థలానికి సంబంధించినంత వరకు, "ఆవరణ" అనే నిర్వచనం, సాధారణంగా మతసంబంధమైన ఆరాధనకొరకు ఉపయోగించేటట్టి స్థలంవద్ద వున్న భూములు, భవనాలకన్నింటికీ వర్తిస్తుంది. 'దేవాలయం' అనే ప్రస్తుతపు నిర్వచనాన్ని సవరణబిల్లు తొలగిస్తున్నది.

ఈ చట్టం క్రింద నేరస్థులైన వారికి శిక్షలను పెంచడాన్ని ప్రతిపాదిత బిల్లు ఉద్దేశిస్తున్నది. ప్రస్తుత చట్టాన్ననుసరించి, నేరస్థులకు రూ 300/–ల వరకు జరిమానా మాత్రమే విధించవచ్చు. దీనితోపాటు మూడు మాసాలకు మించకుండా సాధారణ జైలుశిక్ష విధించడానికి కూడా ఈ బిల్లులో అవకాశం కల్పించబడింది.

పశువులను, లేక పక్షులను బలిగొనడం హిందూదేవాలయాలలోగాక, మతసంబంధమైన అన్ని బహిరంగ ఆరాధనా స్థలాలలో సైతం నేరమే. సామాజిక ప్రయోజనాల దృష్ట్యా అన్ని రకాల జంతువులకు ప్రభుత్వం రక్షణ కల్పించవలసి వుంటుంది. జంతువులపట్ల క్రూరంగా ప్రవర్తించే వ్యక్తులను శిక్షించడానికి సంబంధించి రాష్ట్రంలో ఇప్పటికే ఒక శాసనం అమలులో వుంది. ప్రతిపాదిత శాసనచర్య ద్వారా, ప్రస్తుత చట్టాన్ని అన్ని ఆరాధనా స్థలాలకూ వర్తింపజేయడం వల్ల మత సంబంధమైన అన్ని బహిరంగ ఆరాధనా స్థలాలలోనూ పశువులను బలి యిచ్చే దురాచారాన్ని నివారించడానికి ప్రభుత్వానికి వీలు కలుగుతుంది.

—పి. శేషాద్రి

# పే-క్లినిక్కులు, ఇతర సదుపాయాలను గురించిన వివరాలు

ప్రభుత్వ డాక్టర్ల ప్రయివేటు ప్రాక్టీసును పూర్తిగా నిషేధించిన ఫలితంగా ప్రభుత్వాసుపత్రులలో యీ దిగువ సదుపాయాలను కల్పించడం జరిగింది. అన్ని బోధనా ఆస్పత్రులలోనూ సాయంవేళల ఉచితంగా వైద్యనిపుణుల అవుట్ పేషంట్ సర్వీసులు నిర్వహించ బడుతున్నాయి. డబ్బుచెల్లించడం ద్వారా వైద్యసలహా లభించే సాయంత్రపు క్లినిక్కులలో యిది అదనంగా కల్పించబడిన సౌకర్యం.

1) వైద్య సలహా పొందేందుకు డబ్బు చెల్లించలేని ప్రజల ఉపయోగార్థం, ప్రతిదినం సాయంత్రం పూట ఉచితంగా జనరల్ అవుట్ పేషంటు సర్వీసులు నిర్వహించబడుతున్నాయి. వైద్య నిపుణుడే దీనిని నిర్వహిస్తాడు.

2) నిపుణుల సేవలు లభ్యపడే ఆస్పత్రులలో ముందుగా నిర్ణీత రుసుం చెల్లించడం ద్వారా తాము కోరిన వైద్యనిపుణునితో సంప్రదించి సలహాపొందే సౌకర్యం ప్రజలకు కల్పించేనిమిత్తం యీ ఆస్పత్రులలో పేక్లినిక్కులను ఏర్పాటు చేశారు. ఈ విధంగా నిర్ణీత రుసుం చెల్లించి డాక్టరును కలుసుకొనేందుకు ముందుగా సమయ నిర్ణయం జరిపించుకున్న వారెవరైనాసరే తను కోరిన వైద్యునితో సంప్రదించి సలహా పొందేందుకు యిక్కడ అవకాశం లభిస్తుంది.

3) ఇదే పద్ధతిలో ఆస్పత్రులలో దంతచికిత్స శాలలను కూడా ఏర్పాటు చేయడం జరిగింది.

4) అనుమతింపబడిన వైద్యులతో సంప్రదించి సలహాలు పొందగోరే కేంద్ర ప్రభుత్వోద్యోగుల ప్రయోజనార్థం ఆస్పత్రులలో ప్రత్యేక పేక్లినిక్కులను కూడా ఏర్పాటు చేయడం జరిగింది. ఈ క్లినిక్కులలో పై ప్రభుత్వోద్యోగులు డబ్బు చెల్లించి వైద్య సలహా పొందవచ్చు. కేంద్ర ప్రభుత్వోద్యోగులకు ప్రస్తుతం లభిస్తున్న సౌకర్యాలు యిక ముందుకూడా కొనసాగుతాయి.

## 1-11-1968 నుండి నగరంలో పే-క్లినిక్కులు పనిచేసే ఆస్పత్రులు

1. ఉస్మానియా జనరల్ హాస్పిటల్, హైదరాబాదు. (2) గాంధీ హాస్పిటల్, సికింద్రాబాద్. (3) ప్రభుత్వ మెటర్నిటీ హాస్పిటల్, హైదరాబాద్ (4) నిలోఫర్ హాస్పిటల్, హైదరాబాద్. (మహిళలకు శిశువులకు) (5) సరోజినీదేవి కంటి ఆస్పత్రి, హైదరాబాదు (6) రేడియం యినిస్టిట్యూట్ అండ్ కేన్సర్ హాస్పిటల్, హైదరాబాద్. (7) క్షయ, ఊపిరితిత్తుల జబ్బులకు సంబంధించిన టి. బి. హాస్పిటల్, హైదరాబాద్ (8) ఇ.యన్.టి. హాస్పిటల్, హైదరాబాద్ (9) మానసిక రోగాలకు సంబంధించిన ప్రభుత్వ ఆస్పత్రి, హైదరాబాద్.

## తెలంగాణాలోని జిల్లా ప్రాంతాలలో

(10) యమ్. జి. యమ్. హాస్పిటల్, వరంగల్. (11) గవర్నమెంటు మెటర్నిటీ హాస్పిటల్, హనుమకొండ, వరంగల్ (12) గవర్నమెంట్ మెటర్నిటీ హాస్పిటల్, మట్వాడ, వరంగల్ (13) గవర్నమెంట్ టి. బి. హాస్పిటల్, హనుమకొండ, వరంగల్, (14) గవర్నమెంట్ టి. బి. హాస్పిటల్ వికారాబాద్.

## ఆంధ్ర ప్రాంతంలో

(15) కె. జి. హాస్పిటల్, విశాఖపట్నం
(16) గవర్నమెంట్ విక్టోరియా హాస్పిటల్ (మహిళలకు, శిశువులకు) విశాఖపట్నం.
(17) గవర్నమెంట్ మెంటల్ హాస్పిటల్, వాల్తేరు.
(18) గవర్నమెంట్ టి. బి. హాస్పిటల్, విశాఖపట్నం.
(19) గవర్నమెంట్ జనరల్ హాస్పిటల్, కాకినాడ.
(20) గవర్నమెంట్ జనరల్ హాస్పిటల్, గుంటూరు.
(21) గవర్నమెంట్ టి. బి. హాస్పిటల్, మంగళగిరి.
(22) గవర్నమెంట్ హాస్పిటల్, విజయవాడ.
(23) గవర్నమెంట్ జనరల్ హాస్పిటల్, కర్నూలు.
(24) యస్. వి. ఆర్. హాస్పిటల్, తిరుపతి.
(25) గవర్నమెంట్ మెటర్నిటీ హాస్పిటల్, తిరుపతి.
(26) గవర్నమెంట్ టి. బి. హాస్పిటల్, నెల్లూరు.

## జిల్లా కేంద్ర స్థానాలలో పనిచేసే ఆస్పత్రులు (తెలంగాణా ప్రాంతం)

(27) ఖమ్మం (28) నల్గొండ (29) కరీంనగర్ (30) నిజామాబాద్ (31) ఆదిలాబాద్ (32) సంగారెడ్డి

( తరువాయి 15వ పుటలో )

# నేటి-నేడు

## ఢిల్లీ ముచ్చట్లు

రామ్ కె. వేపా



ఢిల్లీలోని సమాచార కేంద్రాన్ని డిశంబరు 5వ ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి, మునిసిపల్ వ్యవహారాల మంత్రి, పార్లమెంటు సభ్యులు సందర్శించినప్పటి చిత్రం

ఢిల్లీలో నవంబరు 1న ప్రారంభించబడిన ఆంధ్రప్రదేశ్ సమాచార కేంద్రం గత ఆరు వారాల్లో పార్లమెంటు సభ్యులతోనూ, స్థానిక పత్రికా సంస్థలతోనూ, ప్రజలతోనూ సంబంధాలేర్పరచుకొని వారికి అవసరమైన సమాచారాన్ని అందించే సత్ప్రయత్నం ప్రారంభించింది. డిసెంబరు మూడో వారంలో ముగిసిన పార్లమెంటు తుది సమావేశకాలంలో రాష్ట్రాన్ని గురించిన అనేక సమస్యలపై పార్లమెంటు సభ్యులకు అవసరమైన సమాచారం ఈ కేంద్రం అందజేసింది.

చర్చకు వచ్చిన ముఖ్యమైన సమస్యల్లో, ఆంధ్రప్రదేశ్‌లోని తుఫాను భీభత్సం, ఫ్యాక్టరీ యజమానులు చెరకు ఉత్పత్తిదారులకు చెల్లించే ధరల విషయం వున్నాయి. ఈ రెండు సమస్యలపైన రాష్ట్ర ప్రభుత్వ వైఖరిని వివరించి చెప్పడంలో పార్లమెంటు సభ్యులు కృతకృత్యులయ్యారు. పార్లమెంటు సమావేశకాలంలో రాష్ట్ర ముఖ్యమంత్రి, రెవెన్యూమంత్రి ఢిల్లీకి విచ్చేసి పై రెండు ప్రధాన సమస్యల విషయంలో ప్రభుత్వ దృక్పథాన్ని పార్లమెంటు సభ్యులకు వివరించి చెప్పారు. స్థానిక ప్రముఖులతోనూ, పార్లమెంటు సభ్యులతోనూ ముఖ్యమంత్రి చర్చలు జరిపారు.

రాష్ట్రాన్ని గురించి శ్రద్ధగలిగిన వ్యక్తులు అనేకమంది రోజూ సమాచార కేంద్రానికి వస్తున్నారు. గత ఆరు వారాల్లో ఈ కేంద్రాన్ని సందర్శించిన ప్రముఖుల్లో ఆంధ్రప్రదేశ్ గవర్నర్ శ్రీ ఖండూభాయ్ దేశాయ్ కూడా వున్నారు. కేంద్రం పనిచేసే విషయంలో వారు విశేష శ్రద్ధాసక్తులను ప్రకటించారు. ఇదే తరుణంలో కేంద్రాన్ని సందర్శించిన ప్రముఖులలో ఆంధ్రప్రదేశ్ రెవెన్యూమంత్రి, కార్మిక మంత్రి, మునిసిపల్ పరిపాలనా వ్యవహారాల మంత్రి మున్నగువారు వున్నారు. రాష్ట్ర శాసనసభకు చెందిన అంచనాల సంఘ సభ్యులు కూడా నవంబరు 16న సమాచార కేంద్రాన్ని సందర్శించి మరింత ఎక్కువ ప్రయోజనకరంగా ఈ కేంద్రం పనిచేయగలందులకు సలహాలిచ్చారు. రాజధానిలో నివసించే ఆంధ్రుల ప్రయోజనార్థం ఢిల్లీలోని వాడవాడలా ఈ కేంద్రం చలన చిత్రాలను ప్రదర్శించింది. ఢిల్లీలోని ఆంధ్ర ప్రముఖుల గురించిన వివరాలను సేకరించి 'డైరెక్టరీ' ఒక దానిని ప్రచురించేందుకు కూడా ఈ కేంద్రం సంకల్పించింది. ముఖ్యమైన రెఫరెన్సు పుస్తకంగా యిది వుపకరిస్తుంది. మార్చి నెలలో ఎప్పుడో ఒకప్పుడు 'రాష్ట్ర ఆర్థికాభివృద్ధి విషయమై సదస్సు నొకదానిని ఏర్పాటు చేయాలని కూడా ఈ కేంద్రం ఆలోచిస్తూవుంది. బృహత్తరమైన వనరులు, శక్తి సంపదల దృష్ట్యా రాష్ట్ర పారిశ్రామిక అభివృద్ధికి ఎంతగా అవకాశమున్నదీ అంచనా వేసుకునేందుకు ఈ సదస్సు తోడ్పడుతుంది.

*   *   *

ప్రముఖ ఆంధ్ర పాత్రికేయులైన శ్రీ నార్ల వేంకటేశ్వరరావుకు ఆయన 60వ జన్మదినోత్సవ సందర్భంగా ఏర్పాటు చేయబడిన ఘనసన్మానం-ఢిల్లీలో డిసెంబరు నెలలో జరిగిన ప్రధానమైన సంఘటన. ఈ సందర్భంగా డిసెంబరు 1న ఏర్పాటు చేయబడిన సమావేశానికి ఉపరాష్ట్రపతి శ్రీ వి. వి. గిరి అధ్యక్షత వహించారు. లోక్‌సభ స్పీకర్ డా॥ సంజీవరెడ్డి, ఇప్పటి కేంద్ర సమాచారశాఖ మంత్రి శ్రీ కె. కె. షా యిందులో పాల్గొన్నారు. తన విశిష్ట రచనల ద్వారా శ్రీ నార్ల వెంకటేశ్వరరావు కావించిన అపూర్వ కృషిని ఉపరాష్ట్రపతి ప్రస్తావించి ప్రశంసించారు. 'తెలుగు పత్రికా రంగ చరిత్ర' అనే గ్రంథాన్ని శ్రీ కె. కె. షా ఈ సందర్భంలో విడుదల చేశారు. శ్రీ నార్లవారు రచించిన ఒక తెలుగు నాటకాన్ని ప్రదర్శించడంతో నాటి కార్యక్రమం ముగిసింది.

•   •   *

ఢిల్లీలోని ఆంధ్ర వనితా మండలికి చెందిన ప్రసూతి గృహ సహాయార్థం, దక్షిణభారత నటీనట సమాఖ్యవారు "దాసోహం" అనే తెలుగు నాటకాన్ని ప్రదర్శించారు. ఇక్కడి తెలుగు సాహిత్య సమాఖ్యవారు కూడా ప్రసన్న కవి శ్రీ శంకరబండ సుందరాచారి గారి స్వీయకవితా గానాన్ని ఏర్పాటు చేశారు. ఢిల్లీలోని ఆంధ్ర అసోసియేషన్ సర్వసభ్య సమావేశం నవంబరు 24న జరిగింది.

కొత్త ఎన్నికలు జరిగే వరకు శ్రీ పి. ప్రభాకరరావు తాత్కాలిక అధ్యక్షులుగా వ్యవహరించేందుకు ఈ సమావేశం తీర్మానించింది.

హైదరాబాద్ ఆర్ట్స్ సొసైటీవారి సంయుక్త ఆధ్వర్యాన అఖిల భారత లలిత కళల, వృత్తుల సంఘం ఏర్పాటు చేసిన ప్రదర్శనలో హైదరాబాదుకు చెందిన యువ కళాకారులు అనేకమంది తమ కళాఖండాలను యిక్కడ ప్రదర్శించారు.

మొదటి గ్రూపులో సర్వశ్రీ దొరైస్వామి, దాతర్, గిల్, తాహెర్ అహమ్మద్, జయంత్ తమ కళావైదగ్ధ్యాన్ని ప్రదర్శించగా రెండవ గ్రూపులో సర్వశ్రీ భోలేకర్, హనుమాన్‌సూరి, బాలు, నరేంద్రరాయ్, అల్మేలు తమ కళాచాతుర్యాన్ని ప్రదర్శించారు. ఈ రెండు ప్రదర్శనలు అటు ప్రజల మెప్పునూ, ఇటు వ్యాఖ్యాతల మెప్పునూ పొందగలిగాయి.

* * *

ఢిల్లీలోని వాతావరణ పరిస్థితి, శీతాకాలం ప్రారంభమైనదన్న విషయాన్ని సూచిస్తున్నది. కనిష్ఠ ఉష్ణోగ్రత ఘనీభవ స్థాయికి చేరుకుంది. సిమ్లాలోనూ, ముస్సోరీలోనూ కొండల్లో మంచుకురిసి "తెల్లని చల్లని క్రిస్‌మస్" పండుగను అక్కడివారికి అందించింది. ప్రస్తుతం దేశంలో పర్యటిస్తున్న యిరాన్‌షా, షహబానూలకు ఢిల్లీ నూతన సంవత్సరంలో రాజమర్యాదలతో ఘనమైన స్వాగతాన్ని పలికింది.

ఢిల్లీలో రిపబ్లిక్ దినోత్సవ సందర్భంగా జరిగిన ప్రదర్శనలో కృష్ణానదీతీరీయ జీవితాన్ని చిత్రిస్తూ, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం "కృష్ణవేణి"అనే పేరుతో ఒక అలంకార శకటాన్ని ప్రదర్శించింది. నవీన, ప్రాచీన చిహ్నాలతోను, నాగార్జునసాగరం త్రవ్వకంలో బయల్పడిన శిథిలాలతోనూ, నాగార్జునసాగర్ భారీ ఆనకట్ట నమూనాతోనూ రమ్యంగా అలంకరించబడ్డ ఈ శకటం అందరిదృష్టి ఆకర్షించకలిగింది. ఇంతేగాకుండా ఈ శకటం



సాగర్ ప్రాంతంలో ఏర్పాటుచేసిన విద్యుత్ యంత్రాలు, యితర పరిశ్రమల నమూనాలు కూడా వివరంగా ప్రదర్శించబడాయి. నదీ లోయప్రాంతం సంప్రదాయాన్ని ప్రతిఫలింపజేసే 'పంటసూర్పిడి నృత్యం' యిందులో ప్రదర్శించబడింది. ప్రజాబాహుళ్య ప్రశంసలకు పాత్రం కాగలిగింది ఈ 'కృష్ణవేణి'శకటం.

ప్రాచీనభారత నైపుణ్యాన్ని, కళాలను ప్రతిబింబింపజేసే ఒక విశిష్టమైన వస్తుప్రదర్శన జనవరి ఆఖరి వారంలో యిక్కడ నిర్వహించబడింది. హైదరాబాదుకు చెందిన శ్రీమతి పద్మావతి ఈ ప్రదర్శనను ఏర్పాటుచేశారు. "సౌందర్యభారతం" అనే ఈ వస్తుప్రదర్శనాన్ని ఉపప్రధాని జనవరి 26న ప్రారంభించారు. లోహవిగ్రహాలు, జేడ్‌రాళ్ళు, కలంకారీ అద్దకాలు, చేనేతవస్త్రాలు, దంతపు చెక్కడాలు, కొయ్యబొమ్మలు యిత్యాదులు యిందు ప్రదర్శించబడాయి. ఆంధ్రప్రదేశ్ పురాతన కళాకౌశలానికి ప్రతీకగా నిలిచిన మూడువందల సంవత్సరాలనాటి గద్వాలచీర నేత పవితనం అందరి మెప్పులకు పాత్రమైంది.

---

(13వ పుట తరువాయి)

## పే-క్లినిక్కులు........

(33) మహబూబ్‌నగర్.

### ఆంధ్ర ప్రాంతం

(34) శ్రీకాకుళం, (35) రాజమండ్రి (తూ. గో. జిల్లా) (36) ఏలూరు (ప. గో. జిల్లా) (37) మచిలీపట్నం (కృష్ణాజిల్లా) (38) నెల్లూరు (39) అనంతపురం (40) కడప (41) చిత్తూరు.

1 నుండి 26 వరకు పేర్కొనబడిన ఆస్పత్రులు నిపుణుల వైద్యసలహా లభించేవి. ఇక్కడ నిపుణులు కానివారి సలహాలు లభించవు. 27 నుండి 41 వరకు పేర్కొనబడిన ఆస్పత్రులలో అటు నిపుణులు, యిటు నిపుణేతరుల వైద్యసలహా రెండూ లభిస్తాయి.

11 ఆంధ్ర జిల్లాలలో వుండే తాలూకా కేంద్ర ఆస్పత్రులలో 99 పేక్లినిక్కులు, 9 తెలంగాణా జిల్లాలలో వుండే తాలూకా కేంద్ర ఆస్పత్రులలో 93 పేక్లినిక్కులు వుంటాయి. గవర్నమెంట్ టి. బి. హాస్పిటల్, వికారాబాద్; గవర్నమెంట్ మెంటల్ హాస్పిటల్, వాల్తేరు, గవర్నమెంట్ టి. బి. హాస్పిటల్, నెల్లూరు, తాలూకా కేంద్ర ఆస్పత్రులలో మినహాయించి పైన పేర్కొన్న ఆస్పత్రులలో కేంద్ర ప్రభుత్వోద్యోగుల సౌకర్యార్థం పేక్లినిక్కులు పనిచేస్తాయి. ఇదిగాక హైదరాబాద్ సుల్తాన్‌బజార్‌లోని హాస్పిటల్ నాంపల్లి గోల్కొండలలోని ప్రభుత్వ ఆస్పత్రులు, మలక్‌పేటలోని పోలీస్ హాస్పిటల్ వీటిలో కూడా యిదే సౌకర్యం ఈ వుద్యోగులకు లభించగలదు.

*

కవిత

# జ్ఞాన రోచిస్సు

రాత్రిం దివాల పరిభ్రమణంలో
గతం బరువు హెచ్చు తున్నది.
ప్రభవిస్తున్న కోట్లాది జనంలో
ఈ భారం మోస్తున్న దెవరు?

స్వార్థం కోసం, అధికార దర్పాలతో
సుఖ సంతోషాల కర్రులు సాచే
నయవంచకులా?
లేక అసంఖ్యాక సామాన్య జనావళియా ?
పాలికులా? కార్మికులా?
ధనికులా? దరిద్రులా?
వీరు చేస్తున్న పనేమిటి?
భారం హెచ్చిస్తున్నారు.
మోస్తున్న వారిని శిక్షిస్తున్నారు.

ఎవరా శిక్షితులు?
సమస్త బాధలనూ భరించి
ఈ ప్రపంచపు తీరుకు దుఃఖించి
వేదన కలల్లో మంది
ఆలోచనల ఆటు పోటులో రాటుతేలి
తాను ముందుగా తేలిక పడి
మంచిచెడుల వితర్కించి
ప్రపంచపు సమక్షంలోవుంచి
ఋజు మార్గం చూపించి
ఐకమత్యపు విలువలు సూచించి
సహజీవన ప్రభావం ఏకరువు పెట్టి
గత సంస్కృతి సంస్కారాల నాణ్యం ఎరుకపరచి
ఆనందపు బాటల నేర్పరచి
బాధల భరించి శ్రమ కోర్చి
బాహ్య జగదానందాల వీడి
అంతర్ముఖులై
అనల్ప భారాన్ని వర్తమానానికి చేరవేస్తున్న వారు.

:: శిష కృష్ణమూర్తి ::

దుర్భరమైన గతాన్ని, వర్తమానాన్ని
మన సంతతి కోసం
భవిష్యత్తుకుమోసుక పోతున్న వారు
ఎవరు వీరు?
జ్ఞాన ప్రభా భాసమానులైన మేధావులు వారు
దుఃఖితులయెడ హృదయం స్పందించిన వారు!
స్వార్థాన్ని విడిచేసినవారు !!!

# గోదావరిపై రామపాదసాగర్ ప్రాజెక్టు

--వావిలాల గోపాలకృష్ణయ్య

ఆంధ్రప్రదేశాన్ని పునీతం చేసిన నదులలో గోదావరి ముఖ్యమైనదిగా ప్రజానీకం భావించుతుంది. మహారాష్ట్రంలో నాసిక్‌కు దగ్గరగా జననమంది 900 మైళ్లు ప్రయాణంచేసి బంగాళాఖాతంలో సాగరసంగమం చేస్తుంది. దీని ఆరగాని 1,21,5[illegible]0 చదరపు మైళ్లు వుంది. పూర్వపు సమిష్టి మద్రాసు రాష్ట్రం అంత. దీని జలప్రవాహం 3600 శతకోటి ఘనపుటడుగుల నీరు ప్రవహించుతుంది. (లేదా 8 3 కోట్ల ఎకరాల అడుగులు). నీరు వరువుతో వచ్చిన అధిక ప్రవాహం 5860 శతకోటి ఘనపుటడుగుల నీరు. అంటే 13.5 కోట్ల ఎకరాల అడుగులు) కనిష్ట ప్రవాహం 930 శతకోటి ఘనపుటడుగుల నీరు. 1899 సంవత్సరంలో 140 శతకోటి ఘనపుటడుగులు మాత్రమే ప్రవహించింది. దీని గరిష్ట ప్రవాహం కెయిరోలో నైలునది కన్నా మూడింతలు, అమెరికా కియెక్ దగ్గర మిసిసిపీ ప్రవాహానికన్నా ఏడురెట్లు

గోదావరి జలాలను 1951కి పూర్వం 7 నుండి 8 శాతం కన్నా వాడుకోలేదు ఈమధ్య కడెం డాము ఒకటి మాత్రం నిర్మాణమై జలం మంకొంత వినియోగం అవుతున్నది. పోచంపాడు నిర్మాణంలో వుంది. పోచంపాడు తెలంగాణా భూభాగాలను సస్యశ్యామలం చేయనున్నది. కోస్తాజిల్లాలను సర్ ఆర్థర్ కాటన్ చేత 1850–60ల మధ్య ధవళేశ్వరంవద్ద నిర్మింపబడిన ఆనకట్ట క్రింద పదిలక్షల ఎకరాలు సాగు అవుతున్నది ఈ ఆనకట్ట గడువు నూరేండ్లుగా నిర్ణయించారు. నూరేండ్లు నిండికూడా 18 సంవత్సరాలయింది. దానిని పదిలపరచడం యెట్లా అని దానికొక బ్యారేజీ నిర్మాణం ఆలోచనలు సాగుతున్నవి.

గోదావరి నదిలో ఈ క్రింది ఉపనదులు కలుస్తున్నవి. ఆ ఉపనదులు మోసుకొస్తున్న నీరు ఈ క్రింది వైశాల్యములో ప్రవహించే ఆరగాని భూమి ఉన్నది.

## గోదావరి ఉపనదులు

| ఉపనది | ఆరగాని చ. మై. |
|---|---|
| 1. గోదావరి(ప్రాణహిత కలిసేంతవరకు) | 44,500 |
| 2. పెన్‌గంగా — వార్ధా | 17,300 |
| 3 పెన్‌గంగా — ప్రాణహిత | 20,800 |
| . ఇంద్రావతి | 15,700 |
| 5 శబరి | 7,500 |
| 6. ఇతర చిన్నవాగులు | 8,500 |

మంజీర 11000 చ. మైళ్లు ప్రవహించి నిజాంసాగర్‌కు నీరిచ్చి చిన్ననదిగా కలిసిపోతుంది. శబరి కలిసిన తర్వాత పాపికొండలలో మూడుమైళ్ళ పొడవున 100 నుండి 300 అడుగుల వెడల్పులో 2000 అడుగుల ఎత్తు కొండలలో గుండా ప్రవహించుతుంది. జనించిన గోదా, తర్వాత శబరి కలిసి గోదావరి అయిందని చాలామంది చెప్తతారు. ఈ లోయలో నది 100 నుండి 200 అడుగుల లోతు ప్రవాహం వుంటుంది. ఈ పరిసరాలు వదలి బయటపడగానే పోలవరం వద్ద వెడల్పు పెరిగి 20 మైళ్ళ క్రింద రాజమహేంద్రవరం వద్ద 2 మైళ్లు అయి ధవళేశ్వరం వద్దకు చేరునప్పటికి 4 మైళ్ళ వెడల్పు అయిపోతున్నది. ఈ ధవళేశ్వరం ఆనకట్ట క్రింద సాగు అయ్యే భూమి 10 లక్షల ఎకరాలు మాత్రమే. గోదావరి జలాలను వాడుకుంటే లక్షలాది ఎకరాలు సస్యశ్యామలం చేయవచ్చు.

ఆ సుదీర్ఘమైన, విశాలమైన, ఉదారమైన ఆలోచనతో పోలవరం వద్ద ఆనకట్ట కట్టవలెనని సంకల్పించడం జరిగింది. పోలవరం వద్దనున్న మహానంది ఆలయం మధ్యగా అటూ యిటూ ఆనకట్టలు కట్టడం జరుగుతుంది. ఈ పోలవరం వద్ద నిర్మించే జలాశయం భద్రాచలం రామచంద్రుని దేవాలయంకు తగిలి రామచంద్రుని పాదాలు అంటుతుంది. అందుకు దీనికి రామపాద సాగర్ అని పేరు పెట్టడం జరిగింది. ఈ ఆశయం 1942లో ఆనాటి గవర్నరుకు యుద్ధ సమయంలో ఎడ్వయిజర్‌గ వున్న శ్రీ శాంతి రామమూర్తిగారికి తట్టింది.

అందుకు సంబంధించిన సాంకేతిక ప్రవీణుల సలహాకై అంతవరకు భారతదేశంలో బృహత్తర పథకాలను ఆలోచనలు చేసివుండలేదనే భావంతోను, విదేశాల నిపుణుల సలహాలు తీసుకుంటే బాగుంటుందని అమెరికా పునరావాససంస్థ ప్రధాన పరిశీలనా ఇంజనీరు డాక్టరు జె.ఎల్. సాలేజీని అమెరికాలోని కేంబ్రిడ్జికి చెందిన హార్వర్డు విశ్వవిద్యాలయ డాక్టర్ కారల్ టెర్జుఘీని, లండను చార్టర్డు సివిల్ ఇంజనీరు సర్ మార్డచ్ మాక్డనాల్డును, అమెరికాలోని మాజీ చీఫ్ ఇంజనీరు శ్రీ ఎస్. వో. ఆర్చర్‌ను సలహాలు యివ్వవలసినదిగా కోరారు. వారికి కొన్ని చిన్న యిబ్బందులున్నా ఈ డాము నిర్మాణం నిర్వివాదంగా సాధ్యమేనని తేల్చి చెప్పారు.

దీని పరిశీలన 1943లో ప్రారంభించడం, పూర్తిచెయ్యడం జరిగింది. 460 చోట్ల రంధ్రాలుచేసి రాతిస్థితి గతులు పరిశీలన చేశారు. భూగర్భ పరిశోధనలు కూడ చేయడం జరిగింది.

50నుండి 120 అడుగుల లోతు వరకు త్రవ్వి పరిశీలన చేశారు. కుడి యెడమల వైపు నిర్మించవలసిన కాఫరుడాములకు సంబంధించిన పునాదులు త్రవ్విచూచారు. నదీగర్భంలో రాయి తగిలేంతవరకు కొన్నిచోట్ల 2306 అడుగుల వరకు త్రవ్విపరిశీలన చేశారు.

కాల్వల నిర్మాణం చాలా తేలికగానే కనిపించింది. ఎడమ కాల్వ 4.66 లక్షల ఎకరాలను మొదటి పంటకు; 3 లక్షల ఎకరాలను రెండవ పంటకు నీరు అందచేస్తూ 130 మైళ్ళు నిడివిగలిగి విశాఖ పట్నం ఓడరేవును చేరుతుంది. ఈకాల్వ 9139 క్యూసెక్కుల జలాన్ని తీసుకుపోతుంది. దీని వెడల్పు 390 అడుగులు. దీని లోతు 10 అడుగులు.

కుడికాల్వ ఒక్కొక్క సొరంగం 32 అడుగుల వెడల్పు గలిగిన రెండు సొరంగాల ద్వారా 110 మైళ్లు నిడివిగలిగి కృష్ణా నదిని చేరుతుంది. ఈ లోగా మూడు లక్షల ఎకరాలు మొదటి పంటకు, 2 లక్షల ఎకరాలు ఒకే పంటకు నీరు అందిస్తుంది. అంతే కాకుండా కృష్ణా డెల్టా క్రింద మరి రెండవ పంటకు యివ్వవలచిన నీటిని కూడా మోసుకుపోయి కృష్ణా నదిలో వదులుతుంది. గుంటూరు జిల్లాలోని కృష్ణా ఆయకట్టు క్రింద రెండవ పంటకు నీరు అందించటానికి అవసరమగు కాల్వ కృష్ణమీద అక్విడక్టు ద్వారా కృష్ణా నదిని దాటి 105 మైళ్ళు ప్రయాణం చేసి 4.2 లక్షల ఎకరాల సాగుకు నీరు యిస్తుంది. ఈ కాల్వ క్రింద ఉదేశించిన రెండవ పంట అంతకు ముందున్న మొదటి పంటకన్న అధికంగా వుండడంవల్ల ఈ విధంగా దీని నిర్మాణం భావించడం జరిగింది. ఈ కాల్వ 470 అడుగులు వెడల్పు, 15 అడుగులలోతు గలిగి 21,980 క్యూసెక్కుల నీటిని ప్రవహింప జేస్తుంది.

డాములో 1,50,000 కిలోవాట్ల స్థిరమగు విద్యుచ్ఛక్తిని ఉత్పత్తి చేయగల 18 అడుగుల మధ్య కొలతగల 6 నుండి 7 యూనిట్ల టర్బైనులు పనిచేసి విద్యుచ్ఛక్తిని ఉత్పత్తి చేస్తాయి.

## ఈ ప్రాజెక్టువల్ల ప్రయోజనాలు

(1) 27 లక్షల ఎకరాలు సాగుకు రావడం ముఖ్యం. అందుతోబాటు కృష్ణా గోదావరి నదుల క్రింద ఆనాటి నీటి పారుదల క్రిందవున్న 21 లక్షల ఎకరాలకు పుష్కలంగా నీరు అందిస్తుంది. ఈ 27 లక్షలలో (అ) 11.86 లక్షల ఎకరాలు విశాఖ పట్నం, గోదావరి, కృష్ణ, గుంటూరు డెల్టాలకు రెండు కాలవల క్రింద నీరు అందిస్తుంది. 5.1 లక్షల ఎకరాలను మెట్ట తాలూకాలలో రెండవపంటకు కూడా నీరు యిస్తుంది. (ఇ) ఈ నాటి గోదావరి క్రింద సాగు అవుతున్న 3 లక్షల ఎకరాలకు అదనంగా రెండవ పంటకు నీరునిస్తుంది. (ఈ) కృష్ణలో నీరు లేక ఎండిపోతున్నందున కృష్ణా డెల్టాలో రెండవపంట లేకుండా పోతున్నందున అదనంగా 7 లక్షల ఎకరాలకు కృష్ణా డెల్టాలో నీరు యిస్తుంది. (ఉ) అంతేకాక యిప్పుడు అదనులో నీరు రానందున నమ్మకం లేకుండా ఉన్న గోదావరి ఆయకట్టుకు విశ్వాసపూరితంగా నీరు అందించగలుగుతుంది. కృష్ణ ఆయకట్టు క్రింది భూములు కొన్ని నాగార్జునసాగర్ రెండవపంట క్రిందికి వస్తున్నవి.

(2) దేశంలో ముఖ్యంగా (ఆనాడు సమిష్టి) మద్రాసు రాష్ట్రంలోవున్న ఆహార కొరతను తీర్చటానికి 11 లక్షల టన్నుల బియ్యం ఉత్పత్తికి సహాయపడుతుంది.

(3) 1,50,000 కిలోవాట్ల స్థిరమైన విద్యుచ్ఛక్తిని ఉత్పత్తి చేస్తుంది. అందుమూలంగా పారిశ్రామికాభివృద్ధికి ఉపయోగపడుతుంది.

(4) హైదరాబాద్-మధ్యప్రదేశ్ రాష్ట్రాలకూ, అప్పటికున్న మద్రాసుకూ ఈ సాగర్ వద్దకు పడవల రాకపోకలు ఏర్పడడంతో విశాఖపట్టణం రేవుతోసహా పడవల రవాణా సౌకర్యం ఏర్పడుతుంది.

ఇంకా దానికి సంబంధించిన వివరాలు ఈ క్రింది విధంగా ఉన్నవి.

### వివరాలు

| | |
|---|---|
| గోదావరి ఆరగాని | 1,25,600 చ. మైళ్లు. |
| గోదావరిలో వార్షిక ప్రవాహం, | 36,00,000 శ.కో.ఘ.అ |
| వరదప్రవాహం-సెకండుకు | 21 లక్షలు ఘ. అ. |
| పూర్తి సాగర్ లెవెల్ | + 198 (అడుగులు) |
| డాముపై రోడు లెవెల్ | + 237.82 (అడుగులు) |
| లోతైన పునాది | —190 |
| క్రిందినుండి డాము ఎత్తు | 428 (అడుగులు) |
| రోడ్డు లెవెలున డాము పొడవు | 6600 (అడుగులు) |
| పొర్లిపోయే లెవలు - కుడి | 2,100 .. |
| .. ఎడమ | 2,100 .. |
| 135 అడుగుల ఎత్తు షట్టర్లు(క్రంగేట్లు (186 అడుగుల నిడివి) | 16 సంఖ్య |
| డాములో ఇసుక పోవటానికి తూములు | 160 |
| ఇసుక తూముల సైజు | 10 × 20 (అడుగులు) |
| పెద్దతూములు-కుడి | 6 (10' × 20') |
| పెద్దతూములు-ఎడమ | 12 (10' × 20') |
| పడవలు పైకి క్రిందికి సాగర్‌లో | 300' × 40' |
| రిజర్వాయర్ నుండి కాల్వలకు లాకులు | 150' × 30' |
| రిజర్వాయర్ వైశాల్యం మొత్తం | 527 చ. మై |
| ఆనాటి మద్రాసు రాష్ట్రంలో | 316 .. |
| ఆనాటి హైదరాబాదులో | 181 .. |
| ఆనాటి మధ్యప్రదేశ్‌లో | 16 .. |
| ఈనాటికీ ఒరిస్సాలో | 14 .. |
| రిజర్వాయర్ నికర వైశాల్యం | 690 శ. కో. ఘ. అ. |
| సిమెంటు కాంక్రీటు డాములో | 80 లక్షల ఘ. అ |

| | |
|---|---|
| రాయి ప్రత్యేకం పునాదిలో | 5 లక్షల ఘ. అ. |
| పునాదులు ప్రత్యేకం | 200 లక్షల ఘ. అ. |
| ఎడమ కాల్వ (విశాఖ రేవు వరకు) | 130 మైళ్లు |
| కుడికాల్వ - కృష్ణ వరకు | 124 మైళ్లు |
| కుడికాల్వ కృష్ణదాటిన తర్వాత | 89 మైళ్లు |
| నీటి పారుదల - మెట్ట తాలూకాలలో | |
| 1 వ పంట | 11.86 లక్షల ఎకరాలు. |
| నీటి పారుదల - మెట్ట తాలూకాలలో | |
| 2 వ పంట | 5.10 లక్షల ఎకరాలు |
| గోదావరి డెల్టాలో అదనం | |
| 1 వ పంట | 3.50 లక్షల ఎకరాలు. |
| కృష్ణా డెల్టా 2 వ పంట మరియు | |
| కొల్లేరులో ఒకే (రెండవ) పంట | 7.0 లక్షల ఎకరాలు |
| మొత్తం | 27.46 లక్షల ఎకరాలు |

ఈ డాము,పైన చెప్పినట్లు 6,600 అడుగుల పొడవు కలిగి 428 అడుగుల ఎత్తు పునాదుల నుండి వుంటుంది. సముద్రమట్టానికి 198 అడుగుల ఎతున నీరు పొర్లిపోతుంది. రిజర్వాయరు 527 చతురపు మైళ్ళ వైశాల్యం కలిగివుంటుంది. ఈ రిజర్వాయరులో నికరంగా 690 శతకోటి ఘనపుటడుగుల నీరు నిల్వ ఉంటుంది. (690,000 మిలియన్ క్యూబిక్ అడుగు) ఇది అమెరికాలోని బేల్‌డర్‌డాం తర్వాత రెండవదిగా ప్రపంచంలో వుంటుందని ఆనాటి అంచనా. నీటి పొర్లుడు 4200 అడుగులపై వుంటుంది. దీని కంతటికి పీపాల మాదిరిగా '135 × 18' అడుగుల ప్రమాణంగల గేట్లద్వారా ప్రవహిస్తుంటవి. వీటితోబాటు 10 × 20 అడుగుల వైశాల్యంగల 160 తూములు భూమట్టానికి 83 అడుగుల లెవెలులో మేరువ తొలగించుటకు అమర్చబడి, పూడిక తీసివేయుచుండును. జూలై - సెప్టెంబరు నెలల్లో నీరంతా రిజర్వాయరులో నింపకుండా ప్రవాహంగా పోనీయ దలచారు. అందుచే ఈ సమయంలో పూడిక పేరుకోకుండా వుంటుంది. అందుచే దీని ఆయువు తగ్గకుండా వుంటుంది. ఈ ప్రాజెక్టు 392 సంవత్సరాలు పర్యంతం వుంటుందని అంచనా వేశారు. అందుకనే జూన్ నెల సగంనుండి డిసెంబర్ సగం నెలవరకు నీరును సరాసరి పోనివ్వడంవల్లనూ, సెప్టెంబరునుండి జూన్ వరకు కొద్దిగనే పూడిక పేరుతుంది కనుకనూ పేరుకపోయిన పూడికను తూములద్వారా ప్రవాహం ద్వారా పంపుటవలను పూడిక ప్రమాదం తగ్గించటానికి సదుపాయం కలిగించారు. వీటి అన్నింటికి అవకాశం కలిగించినందువల్ల మొదటి సంవత్సరాలలో సంవత్సరానికి 181 కో. ఘ. అ ఇసుక మేట వేస్తుందని, తర్వాత రోజుల్లో 33 కో. ఘ. అ. పేరుతుందని అంచనావేసి చలనంలేని నీటి లెవెలులో 16.8 శ. కో. ఘ. అ. ఇసుక మేట వేస్తుందని, అందువల్ల ఈ డాము ఆయువు 392 సంవత్సరాలుంటుందని అంచనా వేశారు. అప్పటికి కూడా పాత, కొత్త నీటిపారుదల ఆయకట్టుకు నీరు యివ్వగలుగుతుందని, విద్యుచ్ఛక్తికి స్థిరంగా కావలసిన నీరునుకూడా యివ్వగలుగుతుందని అంచనా వేసుకున్నారు.

ఈ నది నిరంతరం ప్రవహించేది కావడంవల్ల, ఇందులోని ఇసుక గంద్రస అయినందున, చెమ్మగిల్లడం అధికం అయినందున, అందులోనుండి పునాదులను చాలాలోతు త్రవ్వవలసి రావడంవల్ల, వరదలు అధికం అయినందున, మట్టి త్వరత్వరగా కొట్టుకుపోతూండడం వల్ల, సిమెంటు కాంక్రీట్ వేయడం ఇది వరకు ఎన్నడు ఎదుర్కోని సమస్యలు ఎదుర్కోక తప్పదు. అందుచే ఈ ప్రాజెక్టు నిర్మాణం ఒక విశేషమే-ప్రత్యేకతే అని కూడా ఆశించారు.

ఈ డాము రెండు భాగాలుగా నిర్మాణం చేయదలచారు. ఒక సగం నిర్మించునపుడు రెండవ భాగం నుండి నీరు పోనిస్తారు. ప్రథమంగా పడమర- అంటే ఎడమభాగం- పూర్తిచేస్తారు. ఈ పడమర భాగం నేలమట్టం వరకు పునాదులురాగానే, ఈ వైపు నీటి ప్రవాహం వదలి తూర్పుభాగం పని సాగిస్తారు. వూట, ప్రవాహాలు వుంటవి. అయినా మధ్యలో మహానందీశ్వరాలయం కొండ వుండడం వల్ల అది చాలా సహాయపడగలదని ఆశించారు. ఈ ఇబ్బందులను మనస్సులో వుంచుకొనే ప్రవీణుల సలహాలు తీసుకోవడం జరిగింది.

## అభ్యంతరాలు

ఈ ప్రణాళికనంతను విదేశీ ఇంజనీరుల సలహాపై డాక్టర్ కె. ఎల్. రావు అధ్వర్యాన ఆంధ్ర ఇంజనీరులను కూడా తీసుకొని ప్లాను అంతా అమెరికాలో తయారు చేయించారు.

దీని విషయంలో ఆంధ్రులు ఆనాడెంతో ఆశతో వున్నారు. శ్రీ కొంతి రామమూర్తిగారు, ఆనాటి గవర్నర్ జనరల్ వేవెల్‌కు చెప్పారని అందుకు వారు స్కీము అంతా విని అంగీకరించి పని చేయవలసిందిగా కోరారని, అయితే ఈ ప్రాజెక్టు ఆనాటి మద్రాసు రాష్ట్రం, హైద్రాబాద్ సంస్థానం, మధ్యప్రదేశ్‌లకు సంబంధించి వున్నదని, అపుడు మద్రాసు మంత్రిగా భక్తవత్సలం, హైద్రాబాద్, దీవానుగా శ్రీ మిర్జాఇస్మాయిల్ గారు అంగీకరించి సంతకాలు చేశారు కూడా. ఇంతలో భారత దేశ రాజకీయంలో కాంగ్రెస్, ముస్లింలీగ్‌లు కేంద్ర ప్రభుత్వ మంత్రి వర్గాలలో చేరాయి. ఆ సమయంలో పండిట్ నెహ్రూ అంగీకరించడం కూడా జరిగింది.

అయితే రామపాదసాగర్ చూడడానికి వచ్చిన డాక్టర్ సావేజీని కృష్ణా, పెన్నా ప్రాజెక్టు పరిశీలన కూడాచేయవలసినదిగా ఆనాటి నీటిపారుదల మంత్రి భక్తవత్సలం కోరడం-ఆయన అభిప్రాయం మేరకు కృష్ణ, పెన్న ప్రాజెక్టు ముందుకునెట్టి రామ పాదసాగర్ యెడ విముఖం ప్రదర్శించడం,మద్రాసు ప్రభుత్వం దీన్ని రికార్డులలోనికి నెట్టివేయడం అదే సమయంలో పండిట్ నెహ్రూ ఈ ప్రాజెక్టు పరిశీలన చేయవలసిందిగా ఒక ఉపసంఘాన్ని వేయడం, అందులో శ్రీ గోపాలస్వామి అయ్యంగారుండడం-వారు

ఈ ప్రాజెక్టుకు మద్రాసు ప్రభుత్వం తమ అంగీకారం తెలుప లేదని వై ముఖ్యంగా వుండి అనడంతో ఇది మూలపడిపోయింది. హైదరాబాద్ నవాబు, ఈ రామపాదసాగర్ క్రింద మునిగే నైజాం సంస్థాన భూభాగానికి బదులు స్థలం యివ్వవలసిందిగా అడగడం–అందుకై ఆనాటి మద్రాసు ప్రధాన మంత్రి శ్రీకుమారస్వామిరాజా భద్రాచల ప్రాంతం సందర్శించడం నూగూరు తాలూకాను నైజాంకు యివ్వడానికి దాదాపు అంగీకారం యివ్వడం జరిగింది. ఈ స్థాయిలో ఈ పనులు జరుగుతుంటే ప్రభుత్వస్థాయిలో మరో విధంగా జరిగాయి. మంత్రులు–పండిట్ నెహ్రూయే అంగీకరిస్తే, శ్రీ గోపాలస్వామి అయ్యంగారు అభ్యంతరాలు చూపారు ఆ విధంగా రామపాదసాగర్ ఆంధ్రులకు ఆశలోనే వుండి పోయింది.

హైదరాబాద్ నవాబు గోదావరిలోయ స్కీము తయారు చేసి ఆధునిక మాంచెస్టరు నిర్మించాలెనని, పోచంపాడు, కడెం ప్రాజెక్టుల స్కీములు వేశారు. ఇచ్చంపల్లి వద్ద డామ్ కటవలెనని అంటే మధ్య రాష్ట్రాలు మా ప్రాంతం మునిగ పోతుందికావున వద్దని అభ్యంతరం చెప్పాయి.

## ఖోస్లా కమిషన్

ఖోస్లా కమిషను వచ్చినపుడు మరి పలువురు పెద్దలు ఈ రామపాదసాగర్ విషయం విన్నవించారు. వారు శబరి–రామపాద సాగర్ ప్రాజెక్టును పరిశీలనచేశారు. రామపాదసాగర్ వస్తే శబరి ప్రయోజనం లేదుగావున దానిని వదలి వేశారు. రామపాదసాగర్ విషయం విచారిస్తూ డాము స్థలం రాతిపునాది ఇసుక క్రింద లభిస్తున్నదని, నది నిరంతరం ప్రవహించుచుండని. అందులో ఇసుక చాలా గంభీరగా వుంటుందని, నీరు తోడడం, పునాదులు త్రవ్వడం కాంక్రీటు వేయడం అనేక అసాధారణ సమస్యలు ఎదుర్కోవలసి వుందని; కాఫర్ డాము పద్ధతులు నిర్మాణానికి అవసరమగు పరికరాలు చాలా కష్టభాజనమైనవని అందుచే నిర్మాతలు విదేశాలనుండి ముఖ్యంగా అమెరికా నుండి ఎంతో విశిష్టమైన అనుభవం గలవారిని తీసికొని రావలెనని తలంచారని, నదీ గర్భంలో చాలాలోతు పునాదులు తీయవలసిరావడం రెండవ పంటకు కావలసిన జలాలు ప్రాజెక్టు నిర్మించిన కొన్ని దినాలకేనిల్వకుండాపోతుందనిఅన్నారు.

వీరి ముందు శ్రీ శాంతి రామమూర్తిగారు కృష్ణ గోదావరి లోయ ప్రాజెక్టులు ప్రారంభించడం మంచిదని, అందుకు గోదావరి లోయలో ప్రారంభించి ఆహార సమస్య పరిష్కరించవలెనన్నారు.

ఒకనాటి మద్రాసు ప్రధాని శ్రీ ఓమండూరి రామస్వామి రెడ్డి ఖోస్లా కమిటీముందు గోదావరిపై రామపాద సాగర్ ప్రాజెక్టు నిర్మించరాదని పెన్ గంగా, ఇంద్రావతి మున్నగు గోదావరి ఉన్నత ప్రాంతాల్లో నీటిపారుదల స్కీములు తలపెట్టవలెనని, అక్కడినుండి హైదరాబాదు సంస్థానంలోగుండా తీసుకునివచ్చి కృష్ణలో కలిపి సాగుకు ఉపయోగించవలెనని కోరారు. అందుపై ఖోస్లా కమిటీ: గోదావరి జలాలను కృష్ణ ఆయకట్టుకు తీసుక పోవడం వ్యయ భారమని రామపాదసాగర్ డాం నిర్మింపని సందర్భంలో గోదావరి మీదగాని దాని ఉపనదుల మీదగాని పై భాగంలో ఒక రిజర్వాయరును రామపాదసాగర్ బరాజ్ కట్టవలెనని తలంచినచోట (పోలవరం) నిర్మించినచో నీటి పరిస్థితిలో ఏమంత తేడా వుండదన్నారు. 142.25 వే కో.ఘ. అడుగుల నీరు కృష్ణకు గోదావరి యివ్వగలుగుతుందని అన్నారు.

## గుల్హాతి కమిషన్

అటుపై వచ్చిన గుల్హాతి కమిషను కృష్ణ నదీజలాలు శ్రీశైలంతో ముగియవలెనని, నాగార్జునసాగర్ ప్రాజెక్టు అట్టే విజయవాడవద్దగల ప్రకాశం బరాజి క్రిందవున్న ఆయకట్టుకు గోదావరి జలాలు అందించవలెనని, అందుకు ఈనాటి పోచంపాడు ప్రాజెక్టుకు దిగువగా కాలవ ప్రారంభించి సరాసరి నాగార్జున సాగర్‌కు ఆ జలాలను అందించవలెనని, మరొక డాం ఇచ్చంపల్లి వద్ద నిర్మించి అక్కడినుండి కాల్వలు ఖమ్మంజిల్లాలోనుండి త్రవ్వుకొని వచ్చి పులిచింతల ప్రాజెక్టు ప్రాంతంలో కలుపవలెనని, పోలవరంవద్ద అంతకు ముందు తలంచిన పద్ధతిని డాముకట్టి విజయవాడవద్ద కృష్ణాలో కలిపి ఈనాటి కృష్ణ ఆయకట్టుకు నీరు అందించవలెనని ఈలోగా కృష్ణ గోదావరి జలాలు ఎంత ప్రవాహం వున్నదీ పరిశీలన చేయటానికి పది సంవత్సరాలు అంకెలు తీయించవలెనని సూచించారు.

ఇచ్చంపల్లివద్ద గోదావరికి ఆనకట్ట కట్టితే ముఖ్యంగా జల విద్యుత్ప్రాజెక్టు ప్రముఖమైనది ఏర్పడవచ్చు. పోలవరంవద్ద బరాజ్ కట్టుకోవచ్చు. కాని బస్తరు ప్రాంతాలు మునుగుతవనే వాదనతో మధ్య ప్రదేశ్ ప్రభుత్వం ఇందుకు అడ్డుతగులుతున్నది.

1963లో అఫీజ్ అహమ్మద్ ఇబ్రహీం (కేంద్ర జల విద్యుచ్ఛక్తి మంత్రి) గుల్హాతీ కమిటీ సిఫారసులపై సూచన చేస్తూ గోదావరి జలాలు కృష్ణ కలిసే ఆలోచన చెప్పారేగాని రామపాద సాగర్ ప్రాజెక్టుకు అనువగు విధానం సూచననే చేయలేము. వీటి విషయంగా గోదావరికి సమస్య వుండజాలదని తలంపబడుతున్నది. గోదావరి జలాలు కృష్ణ జలాలలో కలుపవలెననే బృహత్పథకం బహుశః 300–400 కోట్లతో కూడుకున్నది. అది రాష్ట్ర ప్రభుత్వాలకు సాధ్యమయ్యేదికాదు. అవసరంకూడా లేదు. అందుచే కేంద్ర ప్రభుత్వం ధనం యివ్వడం, తగు నిర్మాణాలు సాగించడం వారే చేయువలసివుంది. గోదావరి ఆనకట్ట ప్రమాదంలో వుందని దానికి నివారణోపాయం ఆలోచించ గలందులకు నియమింపబడిన మిత్రాకమిటీ గోదావరికి బరాజ్ ధవళేశ్వరం వద్దనే నిర్మించవలెనని సూచన చేయడంతో పోలవరం బరాజ్ ప్రాధాన్యత పోయింది.

శ్రీ బి. ఎల్. సత్యనారాయణశాస్త్రి, గోదావరి అభివృద్ధిలోయ ప్రణాళిక అంటూ పరిశీలనా గ్రంథం వ్రాసి పోలవరం బరాజ్ అవసరమని, అందుకు 40 కోట్లు ఖర్చు అవుతుందని వ్రాశారు.

ఆంధ్రులకు అడియాసలు కలిగించిన విశాఖపట్నంలో నెలకొల్ప వలెనని తలంచిన అయిదవ ఉక్కు ఫ్యాక్టరీ సందర్భంగా అందుకు అవసరమగు జలం కావలసి వచ్చిన దున ప్రస్తుతం విశాఖ పట్టణానికి మంచినీటి సౌకర్యం కలిగించుతున్న తాతపూడి తాండవ రిజర్వాయరు, శారద రిజర్వాయరుల నిర్మాణం సంకల్పంతో విశాఖకు గోదావరి నీరు అందించ బడుతుందని పోలవరంవద్ద మొదట్లో తలంచినది కాకపోయినా ఒక బ్యారేజి నిర్మాణం చేయవలెనని సూచనలు, అంచనాలు, ఎస్టిమేటులు వేయడం జరిగింది. ఉక్కు ఫ్యాక్టరీకి రోజుకు కావలసిన 6 (ఆరు) కోట్ల గాలనుల నీరు తాత్కాలికంగా తాతపూడి నుండి 110 లక్షలు, చంపావతిపై మరొక రిజర్వాయరు నుండి 85 లక్షలు, శారద నదిమీద 230 లక్షలు, మేఘాద్రి గడ్డ వరదనిరోధక పథకంద్వారా మరో 70 లక్షల గాలను, తాండవనది రిజర్వాయరునుండి మొత్తం 6 కోట్లు అందించ లేకపోయినా శాశ్వతంగా పోలవరం బారేజి నిర్మించి దానినుండి నీరు పల్లంలోకి ప్రవహించే (గ్రావిటేషన్) కాల్వద్వారా పంపింగులేకుండా తేవచ్చునని ఉద్దేశించారు ఈ పోలవరం బరాజ్ కాలవలు మొత్తం 20 కోట్లలోగా తయారవుత వని అశించారు. ఈ కాలవ రవాణా సౌకర్యానికి కూడా కలిసి వస్తుంది. ఉక్కు ఫ్యాక్టరీయేకాక దాని ఆశకూడా తుక్కు తుక్కులు అయిపోయింది.

ఈ యేడు, నిరుడు వచ్చిన నీటి—ఆహార కొరతలవల్ల విశాఖజిల్లా ప్రజలకు రామపాదసాగర్ ప్రాజెక్టుకన్నా మరోమార్గం లేదని తేలిపోయింది. ప్రజానీకం తీవ్రాందోళన సాగించింది

## ముఖ్యమంత్రి ప్రకటన

ఈ సంవత్సరం కరువుప్రాంతాల సందర్శనకు బయలు దేరిన సందర్భంగా విశాఖలో ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డి "300 కోట్ల రూపాయల వ్యయంతో దాదాపు 40 లక్షల ఎకరాలకు నీటి పారుదల సౌకర్యాలు లభింపచేసే పెద్ద ఇరిగేషను ప్రాజెక్టు ఎప్పుడోప్పుడు చేపట్ట దలచినట్లు" ప్రకటించారు. రైతులు కూడా అందుకు సహాయపడవలెనని అన్నారు

అటుపై డాక్టరు కె యల్. రావుగారు విశాఖపట్నం సందర్శించి నపుడు 70 కోట్లతో పోలవరం నుండి బరాజ్‌ద్వారా విశాఖపట్నం నీరు తేవచ్చునని సూచించడం జరిగింది. వారికి గోదావరి నదీజలాల ఉపయోగం యెడలగల విశ్వాసాన్ని మరింత బలపరిచింది.

## బెటర్ మెంట్ పన్ను

ఈ సంవత్సరం కృష్ణా గోదావరి డెల్టాలక్రింద మురుగు నివారణ పథకాల విషయంలో తీవ్ర ప్రచారం జరిగింది. ప్రభుత్వం గోదావరికి ధవళేశ్వరం వద్ద నిర్మించ దలంచిన బరాజ్‌కి రైతాంగం బెటర్ మెంటు పన్ను ముందుగా చెల్లించితే తప్పకుండా నిర్మిస్తామని అనడమేగాక అందుకు తగిన శాసనాన్ని కూడా రూపొందించారు. ఇంతకు ముందున్న బెటర్‌మెంటు పన్ను విధింపు శాసనాన్ని సవరించి అడ్వాన్సుగా చెల్లించుటకు తగు సవరణలు చేశారు. అటులే కృష్ణా గోదావరి డెల్టాలక్రింద వున్న తూర్పు గోదావరి, పశ్చిమ గోదావరి, కృష్ణా, గుంటూరు జిల్లాలలోని మురుగు నివారణ పథకాలకు దాదాపు 30 కోట్ల వరకు అవుతవని ప్రజలు ముందుగా పన్ను చెల్లించితే దానిని ప్రత్యేక నిధిక్రింద వుంచి ఆ నిధి నిర్వహణకొక బోర్డు నియమించి దానిద్వారా మిత్రా సూచించిన స్కీములు, అవేకాకుండా మరీ అత్యవసరంగా వున్న స్కీములు కలిపి మురుగు నివారణ పథకాలు ఆరు సంవత్సరాల వసూళ్లతో పూర్తి చేస్తామన్నారు దీనికి ప్రతిఘటన అక్కడక్కడా కనుపించుతూనే వున్నది

అందు ముఖ్యంగా అసలు ప్రాతిపదికను వ్యతిరేకించడం ఇదికూడా సబబే. కృష్ణా గోదావరి ప్రాజెక్టుల నిర్మాణానికి అయిన పెట్టుబడి ఖాతాక్రిందికి ఇదివరకే ధనం అంతా వచ్చివేసింది అనేది మురుగు కాల్వల సమస్య మురుగు నివారణ సమస్య ప్రభుత్వ బాధ్యతే కాని రైతులు అదనంగా చెల్లించుకోవలసిన పని లేదనేది ప్రాతిపదిక అభ్యంతరాలు.

అదికాక గోదావరి బరాజ్ స్కీముక్రింద వున్నవారు మురుగుకాల్వల స్కీములో వున్నవారు అంటే తూర్పు—పశ్చిమ గోదావరి రైతాంగం రెండు స్కీములకు అదనపు—అడ్వాన్సు బెటర్‌మెంటు చెల్లించవలసి రావడం భారంఅవుతు దని బాధపడు తున్నారు. దీనిలో నిజం చాలావుంది. రెంటికి చెల్లించవలసింది ఆ భూమి మీద రాబడినుండే కదా. అది ఒక వంద, ఇది ఒక వంద చెల్లించడం కష్టంగా వుండక తప్పదుకదా. దీనితోబాటు మరో సమస్య వచ్చింది. అంటే చిన్న రైతాంగాన్ని ఈ అడ్వాన్సు చెల్లింపునుండి మినహాయించక పోవడం—కనీసం 3 ఎకరాల పల్లం—5 ఎకరాల మెట్ట రైతును ఈ అడ్వాన్సు చెల్లింపునుండి మినహాయించవలసి వుంది. అది జరగలేదు.

ఇది ఇటులుండగా అసలువిషయం గోదావరి బరాజ్, మురుగు నివారణ పథకం పోలవరం బరాజ్‌స్కీము ఈ మూడింటిని కలిపి సమగ్ర పథకంక్రింద ఆలోచించి నిర్మాణం ప్రారంభించితే అసలు సర్కారులోవున్న విశాఖలో కరువు, గోదావరిడెల్టా ఆనకట్ట ప్రమాదం, కృష్ణా గోదావరి డెల్టాలలో యేర్పడ్డ మురుగు ప్రమాదం ఒక సమగ్ర పథకంగా రైతాంగం నూతనోత్సాహంతో

అందోళన ప్రారంభించి రూపురేఖలు దిద్దటం ఎంతైనా ఉపయోగ కారి అవుతుంది. ఈమూడు చాలా ముఖ్యమైనవే. ఇందుకు సంబంధించిన ప్రతి రైతు రెండుమూడు బాధలకు గురియై బయట పడలేక వుంటున్నాడు. గోదావరి బరాజ్ విషయం ఆలోచించినపుడు మిత్రా కమిటీ—మురుగు సమస్య ఆలోచించలేదు. మురుగు సమస్య నాలోచించినపుడు బరరా సమస్యను ఆలోచించలేదు. ఈ రెంటిని గురించి ఆలోచించినపుడు కరువు—ఆహార సమస్యల తీవ్ర పరిణామాలు ఆలోచించలేదు. ఈనాడు రాష్ట్రప్రభుత్వాన్ని ఈ మూడుసమస్యలు ఎదుర్కొన్నవి. ఇపుడైనా ఈమూడు సమస్యలను దేనికది కాకుండా సమగ్ర పథకంగా—సమిష్టి అవసరంగా ప్రభుత్వం భావించడం అత్యవసరం. అప్పుడు ఖర్చులు కూడా ఈ మూడింటికి విడివిడిగా అయినంత కాజాలదు. సాంకేతిక నైపుణ్యంగూడా సమగ్రంగా ఆలోచించటానికి వీలవుతుంది. ఇపుడున్న ఆయకట్టు సాగుమాత్రమే కాక అదనంగా సాగుకు వచ్చే భూమి యేర్పడుతుంది. అన్నిపథకాలు యింకా వేటికవి ప్రారంభించడం జరగలేదు. అందుపై సాంకేతిక నిపుణులను, రైతాంగాన్ని, ప్రభుత్వాన్ని ఈ మూడు పథకాలను కలిపి ఆలోచించి—అమలు జరిపి శాశ్వత పరిష్కారానికి నాయకత్వం వహించవలసిందిగా కోరుచున్నాను.

---

# పత్రికాప్రపంచం

## అయిదవ ఫైనాన్స్ కమిషన్ సిఫారసులపై పత్రికల అభిప్రాయాలు

### ఆంధ్రప్రభ

రాష్ట్రానికి లభించే కేంద్రసహాయం పట్ల ఫైనాన్స్ కమిషన్ గావించిన తీర్పు తీవ్ర ఆశాభంగాన్ని కలిగిస్తున్నదని సంపాదకీయం ద్వారా ఈ పత్రిక తన అసంతృప్తిని వెల్లడించింది. కేంద్ర సహాయంలో రు 3.4 కోట్లు పెంచగానే రాష్ట్రావసరాలు తీరిపోగలవా అనికూడా ప్రశ్నించింది. రు 62 కోట్ల కేంద్ర సహాయాన్ని రాష్ట్ర ప్రభుత్వం అర్థించడం సమంజసమనీ, సహేతుకమనీ ఈ పత్రిక సమర్థించింది. కమిషన్ తీర్పువల్ల రాష్ట్రానికి న్యాయం చేకూరలేదని కూడా ఈ పత్రిక అభిప్రాయ పడింది.

### ఆంధ్రజనత

ఆంధ్రప్రదేశ్‌కు ఆర్థిక సహాయం విషయంలో ఐదవ ఫైనాన్స్ కమిషన్ చేసిన నిర్ణయాలు చాలా అసంతృప్తిని కలిగించేవిగా వున్నవనే అభిప్రాయాన్ని ఈ పత్రిక తన సంపాద కీయంలో వెల్లడించింది. ప్రస్తుతం ఫైనాన్స్ కమిషన్ చేసిన నిర్ణయం ప్రకారం మన రాష్ట్రానికి రు 3.4 కోట్ల రూపాయల మేరకు మాత్రమే అదనపు సహాయం లభిస్తుంది. అయితే రాష్ట్రానికి పెరిగిన ఖర్చుతో పోల్చి చూచినపుడు ఈ సహాయం ఎంతస్వల్పమో వేరుగా చెప్పనవసరంలేదు. అని ఈ పత్రిక వ్యక్తం చేస్తున్నది. కేంద్ర సహాయం అందజేసే విషయంలో అవసరాల్లోవున్న రాష్ట్రాలకు అత్యధిక ప్రాముఖ్యం యివ్వవలసి వున్నదనికూడా ఈ పత్రిక అభిప్రాయ పడుతున్నది.

### ఆంధ్రపత్రిక

ఆంధ్రప్రదేశ్‌రాష్ట్రం పట్ల కేంద్ర ప్రభుత్వం వ్యవహరించే పద్ధతి విచిత్రంగా కనుపిస్తుంది అంటూ ఈ పత్రిక సంపాదకీయంలో తన విచారాన్ని వ్యక్త పరచింది. రాష్ట్రం ఎదుర్కొంటున్న ప్రత్యేక సమస్యలను దృష్టిలో వుంచుకొనే కేంద్రం ఆంధ్రప్రదేశ్ విషయంలో తన సహాయ పద్ధతిని నిర్ణయించుకోవలసి వుంటుందని కూడా ఈ పత్రిక కోరుతున్నది.

### ఆంధ్రజ్యోతి

కేంద్ర సహాయం విషయంలో ఫైనాన్స్‌కమిషన్ చేసిన సిఫారసుల పట్ల అసంతృప్తిని సంపాదకీయం ముఖంగా ఈ పత్రిక వెల్లడిస్తున్నది. ఆంధ్రప్రదేశ్ కేంద్రానికి బాకీపడిన ఋణాలు చెల్లింపు గడువు విషయమై రాష్ట్ర రెవెన్యూ మంత్రి, కేంద్ర ఆర్థిక మంత్రుల మధ్యజరిగిన సంభాషణలను ప్రస్తావిస్తూ, ఈ సందర్భంలో రాష్ట్రంచేసిన విజ్ఞప్తి కేంద్రం మన్నించగలదనే ఆశాభావాన్ని వ్యక్త పరచింది. ఆర్థికరంగంలో చిక్కులను అధిగమించేందుకు గాను, అటు కేంద్ర ప్రభుత్వం, యిటు రాష్ట్ర ప్రభుత్వం ఖర్చులను తగ్గించుకోవలసి వస్తుందని కూడా ఈ పత్రిక సూచించింది.

### ఆంధ్రభూమి

కేంద్ర ప్రభుత్వం ద్రవ్య, ఆర్థిక విధానాలలో కూలంకష మైన మార్పులు రావలసిన అవసరాన్ని తన సంపాదకీయంలో ఈ పత్రిక నొక్కి చెప్పింది.



## భారత జనతా దాస్య విమోచన మూర్తి

# అమరజీవి బాపూజీ

ఆర్. యస్. విద్యార్థి

పందొమ్మిదివందల నలభై ఎనిమిదో సంవత్సరం జనవరి ముప్పై ఒకటి సాయంకాలం సూర్యుడస్తమిస్తున్నాడు. పొగ లేకుండా మంటలు ఆకాశానికి ఎగబ్రాకుతుంటే, జేవురించిన ముఖంతో పడమటిదిక్కాంత ఒంటినిండా ఎర్రరంగు పులుముకుంటోంది. యమునాతీరంలో రాజఘాట్ మీది చితిమంటల ముఖంగా గాంధీజీ భౌతికావశేషాలు పంచభూతాల్లో లీనమైపోతున్నాయి. గ్రుడ్ల నీరు గ్రుక్కుకుంటూ, పెదవులుదాటీదాటలేని ఒకటీరెండుమాటల్తో అక్కడకు చేరుకొన్న జనసందోహం క్రమేపీ విడిపోతున్నది. అదేగుంపులో—తలమీద ఎఱ్ఱటి టోపీతో, తెల్లధోవతి, జుబ్బాధరించిన ఓ పొడగరి వ్యక్తి తనలోతానేదో ఆలోచించుకుంటూ నడచివెళ్ళుతున్నాడు. ఆయనెవరో నేను పోల్చుకొన్నాను. ఇంకెవరు? శ్రీజయప్రకాష్ నారాయణ్. నిశ్శబ్దాన్ని బద్దలుజేస్తూ "గాంధీగారు పోయారు" అన్నమాటల్తో ఆయన్ను పలకరించాను. "ఏకాంత పథికుడు ఏకంగా అమర పథంలోకి అడుగు పెట్టాడు" అని ఆయన అన్నారు. తిరిగ్గా మౌనంగా ఒంటరిగా కూర్చున్నవేళల్లో యిప్పటికీ అవేమాటలు నా చెవుల్లో పదేపదే మ్రోగుతుంటాయి.

సబర్మతి ఆశ్రమ మహర్షి, కోట్లాదిప్రజల మహానాయకుడైన మహాత్ముడు, దీనుల దిక్కు, దేవునిసృష్టిలో అధమాధమశ్రేణి ప్రాణికోటి పరిచర్యలో పరమానందాన్ని పొందే త్యాగదీక్షాపరుడు, నౌకాలి మొదలు న్యూఢిల్లీవరకు— హింసాద్వేషాలు విజృంభించి విలయ తాండవం చేస్తున్న ఘట్టాల్లో అహింసా మంత్రాన్ని జపిస్తూ, ఒంటిగాముందుకు సాగిపోయిన మహనీయ మూర్తి అయిన గాంధీజీ కార్యరంగంనుండి కనుమరుగైనపుడు— అనుచరుల దృష్టిపథంనుండి అదృశ్యమై పోయినపుడు — యిక మిగిలిందేమిటి? ఆయన భౌతికకాయం మంటల్లోకలిసిపోవడంతో జీవితాంతం ఆయన ఊహించుకొన్న, ఆయన పెంచుకొన్న ఆశయాలూ సిద్ధాంతాలు మంటలకర్పితమై తనతో కలిసిమెలిసి జీవించిన వారి బాధామయ హృదయాల్లో ఆదోలాంటి భావనను మాత్రం మిగిలించి పోయాయి. గాంధీజీ కాల్చిచంపబడ్డారనే వార్త వినడం తడవుగా జవహర్ లాల్ నెహ్రూ బిర్లాభవనానికి పరుగెత్తారు. తనకంటేముందు సర్దార్ పటేల్ అక్కడికి చేరుకొని వున్నారు. గాంధీజీవలువల్లో ముఖందాచుకొని, పసిపిల్లవానిలా నెహ్రూ విలపిస్తుంటే వెన్నుతట్టి ఓదార్చారు సర్దార్ పటేల్. కన్నీళ్ళతో తగ్గే బాధకాదు ఆ వుక్కుమనిషిది. ఆయనమాటల్లోనే చెపితే "అది ఆయనమెదడును పిండి పిప్పిచేసింది".

ముమ్ముందు జరగబొయ్యే సంఘటనలు ముందుగానే సూచింపబడతాయి అంటారు. తనకు మరణమాసన్నమైనదన్న విషయం మహాత్మునికి తెలుస్తూనేవుంది. అందుకాయన సన్నద్ధుడౌతూనేవున్నారు. జనవరి 24న—అంటే తనకడపటి నిరాహార దీక్ష విరమించిన రెండు రోజుల తర్వాత (హిందువులు, ముస్లిములు అన్నదమ్ముల్లా కలిసి మెలిసి వుండాలి అన్నభావం ప్రజలో కలిగించేందుకే గాంధీజీ ఈ నిరాహార దీక్ష వహించారు) గాంధీజీ ఆసీనుడై వున్న ప్రదేశానికి సుమారు 50 గజాల దూరంలో నాటు బాంబు ఒకటి ప్రేలడంతో నాటి ప్రార్థనా సభకు భంగం వాటిల్లింది. ఈ నేరానికి పశ్చిమ పంజాబుకు చెందిన మదన్ లాల్ ఆనే హిందూ కాందిశీకుడు అరెస్టు గావించబడ్డాడు. అతనిజేబులో చేతితో విసిరే గ్రెనేడ్ ఒకటి దొరికింది.

ఈ సంఘటన అందరినీ కలచివేసింది ఒక్క గాంధీజీని తప్ప. చావుకు భయపడని గాంధీజీ అప్పుడిలా అన్నారు " దురావేశ

పూరితుడైన వ్యక్తి చేతిలోని తుపాకి గుండుకు నేను ఒకవేళ బలి కావలసివుంటే విధినెవరు తప్పించ గలరు? ఆనందంగా ప్రాణాలొదేందుకు నేను సిద్ధపడాలి. నాలో కోపతాపాలకు తావుండకూడదు. నాహృదయంలోనూ, పెదవుల మీదనూ దైవాన్ని ప్రతిష్ఠించుకోవాలి.

నాటిసాయంకాలం తాను తుపాకి గుండుకు గురి అవుతారనగా ఆరోజు వుదయంపూట వాహ్యాళి కార్యక్రమాన్ని నిర్వర్తించేందుకు గాంధీజీకి పాలుబోలేదు. మనుమరాలు 'మను' మాత్రం, రాత్రివేళ గాంధీజీ ఉపయోగించుకోవలసిన ఖాళీ ఐపోయిన భస్మాన్ని తయారు చేసేందుకు సన్నద్ధురాలౌతున్నది. ఎప్పుడో ఏదోజరుగబోతుందని యిప్పటి ఆమెవిధి నిర్వహణకు అడ్డు పలకడం యిష్టం లేక పోయినా గాంధీజీ తన మనుమరాలితో "చీకటి పడేలోపల ఏంజరుగ బోతున్నదీ ఎవరికి తెలుసుంది. నేను బ్రతికి వుంటాననేది కూడా ఎవరు చెప్పగలరు? ఒకవేళ రాత్రికి నేనే జీవించివుంటే భస్మాన్ని అప్పుడు తయారు చేద్దువుగానిలే" అని అన్నారు.

సాయంకాలం 4 గంటల నుండి ప్రార్థనసమయం వరకూ గాంధీజీ సర్దార్ పటేల్‌తో సంభాషణలో మునిగిపోయారు. ప్రార్థన స్థలానికి వెళ్ళేందుకులేస్తూ పటేల్‌తో 'నేనిక దూసుకపోవాలి' అని గాంధీగారన్నారు. దరిలో ఒకపరిచారకుడు కతియవాడ్ నుంచి ఇద్దరు కార్యకర్తలు వచ్చి వున్నారనీ, గాంధీజీని కలుసుకొనేందుకు తరుణం కోరుతున్నారనీ చెప్పినపుడు ప్రార్థన ముగిసిన తర్వాత రమ్మను బ్రతికి వుంటే వాళ్ళనప్పుడు చూస్తాను అని అన్నారు. ఆయన కోరుకున్నట్లే, ఆయన ఊహించినట్లే నాటిసాయంకాలమే గాంధీజీ జీవితాన్ని చాలించ వలసివచ్చింది. వరుసగా పేల్చబడిన మూడుతుపాకి గుండ్లకు ఆయన బలి అయ్యారు. స్నేహభావంతో జోడించబడిన ఆయన చేతులు పట్టు దప్పిపోయాయి. మోకాళ్ళు వంగిపోయాయి! "హేరామ్" అంటూ ఆయన నేలకు ఒరిగి పోయారు. ఆవిధంగా ఏకాంత పథికుడు అమర పథంలోకి అడగు పెట్టాడు. నేనూవెంట వస్తాను ఆగండి-అనిచెప్పగలిగే సాహసం ఎవరికీ లేక పోయింది.

"మనకున్న పెన్నిధిని మనం కాపాడుకోలేక పోయాం" అంటూ గాంధీజీ సరసన-కూర్చొని నెహ్రూ పసిపిల్లవానిలా వెక్కి-వెక్కి ఏడుస్తుంటే కన్నీరు మున్నీరై ప్రవహించింది.

ఆవిధంగా ప్రపంచాన్ని దుఃఖ సముద్రంలో ముంచి గాంధీజీ గుండు దెబ్బకు బలియై పోయారు. రాజ్-కోటలో లేచిన జ్యోతి ఎదురైన తుఫాను గాలులను తట్టుకుంటూ, ప్రేమ, సేవ, త్యాగం అనే కాంతిపుంజాలను నలుదిక్కులా వెదజల్లు తుంటూ అఖండంగా మండి, ఉజ్వలంగా వెలుగొంది తుదకది రాజ్‌ఘాట్ మంటల్లో లీనమై పోయింది తుదకు ఒక హిందూ యువకుని చేతుల్లో గాంధీజీ ప్రాణాలు కోల్పోయారు తాను తన ఆశయాలనూ, సిద్ధాంతాలనూ అనుసరిస్తూ ఆత్మీయులయిన వారి చేతుల్లో ఆయన ప్రాణాలు వదిలారు. ప్రార్థనకు వెళ్ళేముందు పటేల్‌తో ఆయన ఆఖరుసారి అన్న మాటలు నిజమయ్యాయి. "నేనికదూసుక పోవాలి" అని అన్నారు. అలాగనే గాంధీజీ మననుండి దూసుక వెళ్ళారు ఆయన మరణానికి అందరూ విలపించారు ఫలితంలేక పోయింది. గాంధీజీ తిరిగి రాలేదు ఆయనతో పాటు ఆయన సిద్ధాంతాలు, సదాశయాలు కొంత కాలంపాటు కను మరుగయి పోయినవి.

తన జీవితాంతం గాంధీజీ అహింసోద్యమాన్ని సాగించారు. ఈ ఉద్యమంద్వారానే తను ముఖ్యమని భావించిన రెండు లక్ష్యాలను సాధింపగలిగారు. ప్రత్యక్షంగా భారతదేశానికి స్వేచ్ఛా సమైక్యతను, పరోక్షంగా యావత్ప్రపంచానికీ ఏ తరహా దేశాన్ని ప్రదానం చేయడం ఆయన ద్వంద్వ లక్ష్యాలు. తన జీవితకాలంలో భారతదేశానికి స్వేచ్ఛను సంపాదించారు. తాను మరణించి అహింసా తత్వంతో దేశంలో శాంతి సమైక్యతా సౌమనస్యాలను నెలకొల్పారు. గాంధీజీని హత్యచేయడంద్వారా హంతకుడు తన జీవిత లక్ష్యాన్ని సాధించాడు కాని గాంధీజీ అతని యెడ కృతజ్ఞతా భావాన్ని ప్రకటించి, అతని లక్ష్యాన్ని మెచ్చుకొని అతన్ని మన్నించారు ఆయన చనిపోతూ నేలకొరిగేటప్పుడు పైకెత్తిన రెండు చేతులూ హంతకునియెడ కృతజ్ఞతనూ, క్షమాగుణాన్నీ వెల్లడిచేశాయి.

జీవితంలోని అనేక మార్గాలలో అనూయక కళాకారుడైన గాంధీజీ తాను మరణించే క్షణంలో ఉత్తమోత్తమ కళాకారునిగా రాణించారు. ఆఖరు క్షణంలో ఆయన వర్షించిన ప్రేమామృతం అందరికీ సాధ్యం కానిది. స్వార్థరహిత, త్యాగ పరైక జీవిత ఫలమే గాంధీజీకి ఆ శక్తిని ప్రసాదించింది.

'సత్యాగ్రహం' అనే మాటను ప్రపంచంలో మొట్టమొదటిసారిగా వుపయోగించినవారు గాంధీజీ 'సత్యం' 'అహింస' అనే రెండు పదాల భావార్థ సరస సమ్మేళనమే ఈ 'సత్యాగ్రహం' అనే మాట రెండు ప్రపంచ యుద్ధాలతో చిన్నాభిన్నమైన యావత్ప్రపంచానికి ఈ మాట అమృత తుల్యమైనది. శరవేగంతో యిది ఖండ ఖండాంతరాల్లోకి దూసుకపోయింది. అన్నదమ్ముల మధ్య రక్తపాతం జరగడం తగని పని అని నిరంతరం మనలను హెచ్చరిక చేస్తూంటుంది గాంధీజీ జీవితం.

"రక్త మాంసాలతో యిటువంటి వ్యక్తి భూతలం మీద ఒకప్పుడు పుట్టి పెరిగి సంచరించాడా అనే సందేహం భావితరాల వారికి కలగవచ్చు" అనిఐన్‌స్టీన్ గాంధీజీకి శ్రద్ధాంజలిని ఘటిస్తూ అన్నమాటలు ఆలోచించేకొద్దీ ఎంతగానో నిజమనిపిస్తాయి.

మహాత్ములు కారణ జన్ములు, ఒక ప్రత్యేక ధర్మ సంస్థాపనార్థం వారు భూతలానికి అవతరిస్తుంటారు. అనైక్యతా ద్వేషభావాలతో అల్లకల్లోలమైపోయిన ప్రపంచానికి గాంధీజీ తనహుతాత్మమరణంతో అమోఘమైన సమైక్యతా భావ సందేశాన్ని అందించ కలిగారు.

# మహాభారతము

తెంపెగంటుల లక్ష్మణశాస్త్రి

ద్రౌపదిని ఉద్దేశించి యుధిష్ఠిరుడు ఇట్లనెను—

"ఎంత సంపద లభించినను బుద్ధిహీనులు తృప్తి చెందరు. దానికి కారణము వారికి ధర్మశ్రద్ధ లేకుండుటయే. భామినీ! 'వేదోక్త సత్కర్మల యొక్క పుణ్యఫలము, దుష్కర్మల యొక్క పాపఫలము, ఉత్పత్తి, వినాశము—ఇవన్నియు 'దేవ గుహ్యము' లనబడును. అనగా దేవతలకు మాత్రమే తెలియునని భావము. ఇవి తెలుసుకొనని మూర్ఖులు కల్పసహస్రము లైనను శ్రేయస్సును పొందజాలరు. ఈ విషయములను దేవతలు రహస్యముగా నుంచెదరు. వారి మాయ మనకు తెలియదు. ఈ రహస్యములను, సాత్వికాహారమును తినుచు, ఆశలు వీడి, తపస్సు చేయుచు, ప్రసన్నమైన మనస్సు గలవారు మాత్రమే తెలిసికొనగలరు. ఫలము త్వరగా లభించలేదని దేవతలను సందేహించ గూడదు. కర్తవ్య బుద్ధితో ధర్మకర్మాచరణము చేయుచుండినచో దేవతలు తప్పక ప్రసన్నులై తత్ఫలమును అందించెదరు ఇది బ్రహ్మనిర్ణయము. కనుక ద్రౌపదీ! నీకు గల ధర్మసంశయము ఇప్పుడు మంచువలె నశించిపోవుగాక. నాస్తిక భావమును ఇక విడువుము. ప్రపంచ రక్షకుడగు ఈశ్వరుని ఏ మాత్రము ఆక్షేపించకుము. శాస్త్రములు, గురువులు ఉపదేశించిన విధముగా ఈశ్వరుని తెలిసికొనుటకు ప్రయత్నించుము. అతనికే నమస్కారము చేయుము. ఈనాడు నీవు గనబరచిన బుద్ధి నీకు ఎప్పుడు గూడ ఉండకుండుగాక. ఎవ్వని కృపచేత మర్త్యుడు అమరుడై శాశ్వతానందము ననుభవించునో అట్టి పరమేశ్వరుని నీవు ఎప్పుడు గూడ ఆక్షేపించి అవహేళన చేయకుము." అని యుధిష్ఠిరుడు చేసిన ధర్మోపదేశమును విని ద్రౌపది యిట్లు బదులు చెప్పెను:—

"రాజా! నేను ధర్మమునుగాని యీశ్వరునిగాని అవమానించుట లేదు. నిందించుట లేదు. ఆర్తురాలనై దిక్కుతోచక వదరుచున్నాను. ఇంకను విలపించెదను. ఎంతటికిని నా సంకటము తీరదు.

"జ్ఞాని యైనవాడు కర్మాచరణము చేయవలెను గదా! కర్మలు చేయని సముద్రపర్వతాది స్థావరములు గూడ జీవించుచున్నవి. తల్లి పాలు త్రాగి నీడలో దూడలు సుఖముగా శయనించుచున్నవి. జీవన నిర్వహణమునకై జంతువులు ఆయాకర్మలను చేయుచున్నవి. జంతువులలో మానవుడొక్కడే కర్మల ద్వారా ఇహపర సౌఖ్యము నంద గోరుచున్నాడు. త్రిమూర్తులు సృష్టి స్థితి లయ కర్మల నాచరించుచునేయున్నారు. కర్మలు చేయని ప్రాణులకు జీవికా నిర్వహణము సాధ్యముగాదు. కనుక ఎప్పుడు గూడ కర్మను విడువకుండ ఆచరించుచుండవలెను. అందువలన స్వకర్మను చేయుట శ్రమయనుకొనగూడదు. కర్మాచరణమును గూర్చి తెలిసికొన్నమానవుడు వేయి మందిలో ఒకడు దొరుకుట కష్టము. ధనముసంపాదించి దానిని పెంచవలెను. దానిని వ్యయము చేయుచు, సంపాదించకుండినచో హిమాలయమంత ధనము గూడ క్రమముగా నశించును. కనుక కర్మ చేయనిచో నరులు నశింతురు. వ్యర్థముగానైనను కర్మములను చేయువారిని నేనెరుగుదును.

"కర్మను చేయక అదృష్టముపైననే ఆధారపడియున్నవారును, పూర్వకర్మానుసారముగా ఫలము తనంతట చేకూరునని హఠవాదముతోనున్నవారును మూర్ఖులే. ఎవడు కర్మ చేయునో వాడే ప్రశంసాపాత్రుడు. కర్మ చేయని మూర్ఖుడు జలములోని పచ్చికుండవలె శిథిలుడై నశించును. అదృష్టముపైన ఆధారపడియుండు మూర్ఖులు గూడ అనాథుని వలె చాలకాలము బ్రతుకజాలడు. అకస్మాత్తుగా దొరికిన ధనమును జూచి అది తన హఠయోగము చేతనే లభించిన దనుకొనును. కొద్దిగా దైవారాధన చేసి లభించిన ధనము 'దైవము' అనబడును. స్వకర్మ చేత పొందిన ధనము 'పౌరుషము' అనబడును. స్వాభావికమగు కర్మాచరణము వలన ప్రాప్తించిన ధనము 'స్వాభావికము' అనబడును. ఈ విధముగా పొందిన ధనము పూర్వకర్మ ఫలముగా లభించినదని భావించవలెను. దైవము మానవులకు వారి వారి కర్మలను అనుసరించి ఫలము నిచ్చుచుండును. కాని, పురుషుడు తొలుత మనస్సులో తన అభీష్ట వస్తువును పొందుటకు నిశ్చయించుకొని తిరిగి కర్మ ద్వారా దానిని పొందగలడు. అందువలన దైవికముగా వచ్చు ఫలమునకు గూడ పురుషుడే కారణమనవలెను.

"రాజా! కోరికలు అసంఖ్యాకములు. ధనధాన్యగృహ సంపదలు పురుష కారము చేతనే సంపాదించవలెను. నువ్వులలో నూనె, గోవులో పాలు, కొయ్యలో అగ్ని ఉన్నవి. వాటిని పురుష కారము చేతనే వెలికి తీయవలెను. ప్రాణులందరును అట్టి కర్మ జనిత సిద్ధికై పాటుపడెదరు. కర్త సమర్థుడై పని చేసినచో కార్యము సిద్ధించును. కర్తలే లేనిచో యజ్ఞాది కార్యములు సిద్ధించవు. 'ఒకడు గురువు మరియొకడు శిష్యుడు' అను నంతరమే లేకుండును. కర్తృత్వమునకు ప్రాధాన్యమే

చేకుండినచో, కార్యము సిద్ధించినప్పుడు కర్తను ప్రశంసించుట, అది సిద్ధించనపుడు అతనిని అవహేళన చేయుట యనునవి లోకములో నుండనే యుండవు. కొందరు పనులన్నియు హఠయోగము చేతనే సిద్ధించుననియు, మరి కొందరు దైవికముగా కలుగుననియు, నితరులు కొందరు పురుష ప్రయత్నము చేతనే కర్మసిద్ధి యేర్పడుననియు మూడు విధములుగ చెప్పుచుందురు. మనువు "మానవుడు కర్మ చేయవలెను. నిశ్చేష్టుడై యుండినచో పరిభవము పొందును" అని చెప్పెను. కనుక మహారాజా! "కర్మ చేయువానికి ఫలసిద్ధి కలుగును. సోమరికి ఎప్పుడు గూడ అది నెరవేరదు." అని నా మతము. పని చేసినను సిద్ధి కలుగనిచో, అది చేయు విధానములో దోషము ఉన్నదని భావించి దానిని నిర్మూలించవలెను. అలసునకు దరిద్ర్యము తప్పదు. కనుక ఇప్పుడు మన రాజ్యమును పరులు అపహరించిరి. మీరు శ్రద్ధతో కర్మ చేసినచో ఆ యాపద తొలగి రాజ్య ప్రాప్తి మనకు కలుగును. కార్యము సిద్ధించినచో అది యెదుగురికి గౌరవప్రదము. అప్పుడు మన కర్మ ఫలించినదని తృప్తిపడవచ్చును. భూమి దున్ని విత్తనములు నాటిన తరువాత గూడ వర్షము కురియనిచో భూమి ఫలించదు. అప్పుడు కర్త తన దోషము లేదని తృప్తి పడును. పని చేసినను ఫలము కొరక లేదని కర్త దపడగూడదు. ఎందుకనగా ఫలసిద్ధికి పురుష కార్యమొకటే కారణము కాదు. దానికి అదృష్టము, ఈశ్వర కృప గూడ కావలెను. అవిలేనప్పుడు ఫలసిద్ధి కలుగదుకదా! కనుక, పౌరుషము, అదృష్టము, దేవుని దయ ఈ మూడును కర్మ ఫలసిద్ధికి హేతువులు. సిద్ధించునో లేదో యను సందేహము చేత కర్మను విడువగూడదు. అట్లైనచో కించిత్ఫలము గూడి కర్తకు గోచరించదు. ఇదిగాక కర్త యొక్క శౌర్యాది గుణములు గూడ ప్రకటితములు గావు. కనుక బుద్ధిమంతుడు దేశకాలములు నెరిగి సామదానాద్యుపాయములను ప్రయోగించవలెను. కార్యసిద్ధికి పరాక్రమమే అన్నిటికన్న శ్రేష్ఠమైన సాధనము. తనకన్న శత్రువు మిక్కిలి గుణవంతుడైనచో అప్పుడు సామోపాయముచేత సంధిచేసుకొనుట ఆవశ్యకము. శత్రువును దూరము చేయవలెను. అతని ఛిద్రములను కనుగొనుటకు సదా ప్రయత్నించుచుండవలెను. తనను తాను అగౌరవపరచుకొన గూడదు. అట్టివానికి ఐశ్వర్యము ప్రాప్తించదు. కార్యసిద్ధికి ఇదియే ఉపాయము.

"రాజా! ఈనీతియంతయు నేను పూర్వము మాతండ్రి ఒడిలో కూర్చుండి, ఒకమహాత్ముడైన బ్రాహ్మణుడుచెప్పగా వినియున్నాను. ఆయనచెప్పిన నీతివాక్యములు నాకునచ్చినవి కనుక మీకు చెప్పుచున్నాను'' అని ద్రౌపది చెప్పిన మాటలను విని భీమసేనుడు అత్యంత క్రోధము చేత మండుచువచ్చి నిట్టూర్పులు విడుచుచు వగర్చుచు ధర్మరాజుతో నిట్లనెను.

"రాజా! పురుషార్థములకు దూరమైన వనవాసము మనకు తగదు. ధర్మానుసారముగా రాజ్యమును పొందుట యుక్తము. దానిని మన శత్రువులు అధర్మముగా జూదములో అపహరించిరి. సింహముల ఉచ్ఛిష్టమును నక్కలు తిన్నట్లు వారు మన చేత విడువ బడిన రాజ్యమును అనుభవించుచున్నారు. ధర్మకామములను సంపాదింపజేయు ధనమును, రాజ్యమును పోగొట్టుకొని కొంది ధర్మమును మాత్రమే ఆశ్రయించి యెదుల కిట్లు కష్టపడుచున్నావు? ఇంద్రునకు గూడ అర్జునుని చేతినుండి అపహరించుటకు సాధ్యముగాని రాజ్యమును నీ యజాగ్రత్త వలన మన కన్నుల యెదుటనే శత్రువులు, మొండి చేతుల వానినుండి పండును వలె, కుంటివానినుండి గోవును వలె అపహరించిరి. నీ ముఖము చూచి ఆ యన్యాయమును మేము కన్నులు నేలకు చేసుకొని చూచుచుంటిమి. నీ మనస్సు నొప్పించగూడదని ఇది యంతయు మేము సహించియుంటిమి. నీ యాజ్ఞా బద్ధులమై మిత్రులను కష్టపెట్టి శత్రువులను ఆనందపరచుచున్నాము. ఆనాడే ధార్తరాష్ట్రులను హతమార్చక మనమీ దుఃఖమునకు పాలైతిమి. దుర్బలుల వలె మన మీ వనములో మృగచర్య నాశ్రయించవలసిన దుర్గతికి లోనైతిమి. దీనిని మనవారెవరును అభినందించుట లేదు. ఎల్లప్పుడు ధర్మము-ధర్మము అని నీవు నపుంసకునివలె వైరాగ్య జీవనము గడుపుచున్నావు. రాజ్యమును పోగొట్టుకొన్నవారు దుర్బలులై యున్నప్పుడే వైరాగ్యము నాశ్రయించి అడవుల పాలగుదురు. ఈ విధముగా నున్న మనలను శత్రువులు దుర్బలులనుగా తలచుచున్నారు. అట్టి వారిని యుద్ధములో నెదుర్కొని చచ్చినను మనకు ఉత్తమ లోకములు లభించును. అథవా వారిని చంపియైనను సమస్త భూమండలమును ఏలుకొన వచ్చును. ఇహపర దూరమైన ఈ వనవాసము నాకు నచ్చలేదు. ప్రతిక్రియచేసి స్వధర్మము నాశ్రయించియుండుట మనకిప్పుడు ముఖ్యకర్తవ్యము. తన శ్రేయస్సు కొరకు పోరాడినవాడు లోకములో ప్రశంసాపాత్రుడగును. రాజా! తనను తనవారిని బాధపెట్టు ధర్మము సంకటమే యగును అది ధర్మముగాదు కుధర్మమనిపించుకొనును. శవమునకు సుఖదుఃఖములు అంటనట్లు సర్వదా ధర్మానుష్ఠానముచేత దుర్బలులైనవారు ధర్మార్థములు రెంటికిని దూరమగుదురు. గ్రుడ్డిగా ధర్మము నాచరించువానికి, అంధునకు సూర్య తేజస్సు కనపడనట్లు ధర్మ ప్రయోజనము తెలియదు. అట్టివాడు కేవలము ధర్మము పేరుతో క్లేశమును అనుభవించు వాడగును.

"ధనము కొరకే ధనమును సంపాదించి రక్షించువాడు దానిని ఇతరులకొరకు యాదవుడు గోవులను కాచినట్లు కాపాడుచుండును. ధన సంపాదనయందే యెక్కువ యిచ్ఛగలిగి ధర్మకామములను అనుష్ఠించనివాడు బ్రహ్మహత్య చేసినవానితో సమానుడు. అతడు అందరికిని వధ్యుడగును. ఎల్లప్పుడు కామమునే యాశ్రయించిన వాడుగూడ ధర్మార్థములకుదూరుడై మిత్రులచేత విడువబడును. నాడు జలనాశముచేత చేప నశించినట్లు, కామము నశించినప్పుడు హీన గతిలో నశించును. 'అరణి' అగ్నియుత్పత్తికి మూలమైనట్లు కామోత్పత్తికి ధర్మార్థములు మూలములు. కనుక వాటిని వీడి కేవలము కామమును మాత్రమే ఆశ్రయించినవాడు నశించును. ధనము ధర్మ మూలము. ధర్మము అర్థము చేతనే సిద్ధించును. కనుక ఆ రెండును, సముద్రమేఘములవలె ఒండొంటిని ఆశ్రయించి యుండును. సముద్రమునుండి తీసికొన్న నీటినే కదా మేఘము తిరిగి సముద్ర పుష్టికిగాను కురియును. శ్రీచందనాదుల స్పర్శచేతను

సువర్ణాదిధన లాభము చేతను ఆనందము కలుగును గనుక వాని కొరకు మనస్సులో కలుగు సంకల్పమే కామమనబడును. ఆ కామమునకు ఆకారముండదు. కనుక దానికి 'అనంగ' నామము కలదు. పురుషుడు ధర్మము వలన ధనమును, ధనము వలన కామమును కోరునుగాని కామము వలన మరి దేనినిగూడ కోరడు. ఎట్లనగా, కొయ్య కాలుట వలన భస్మము పుట్టునుగాని ఆ బూడిద వలన మరియేక వస్తువేదియు కలుగదు గదా! ఫలోపభోగము చేత కృతార్థుడైన వానికి దానినుండి మరియొక ఫలము ఉత్పన్నము కాదు. అట్లే కామమునుండి యెట్టి యితర వస్తువు గూడ పుట్టదు. దానిని వాడు కోరడు గూడ. ఎందుకనగా అది యితరములు పుట్టుటకు సాధనము కాదు. అది ఫలమే యగును. వ్యాధుడు పక్షులను అకారణముగా చంపును. అట్టివాడు హింసకు పాత్రుడైనట్లే దుర్బుద్ధి చేత కామలోభములకు వశుడై ధర్మస్వరూపమును తెలుసుకొనజాలనివాడు ఇహపరలోకములలో వధ్యుడగును. రాజా! ధనము నుండియే సమస్త వస్తువులు లభించుననియు, ధన సంపాదనకు ధర్మమే కారణమనియు నీకుబాగుగా తెలియును. ధనాభావము చేతకాని, ధననాశముచేతగాని స్త్రీ మొదలగు ఇష్ట జనులు జరాజీర్ణులై మృత్యువాతబడినప్పుడుగాని కలుగు దుర్దశనే అందరును అనర్థముగా భావించెదరు. అట్టి అనర్థమే యిప్పుడు మనకు మూడినది. పంచేంద్రియములు, మనస్సు తత్తద్విషయములైన శబ్ద-స్పర్శ-రూప-రస-గంధాదుల యందు ఆసక్తములగుటకే కామమని పేరు. అదియే కర్మల వలన గలుగు ఉత్తమ ఫలముగా నేను భావించెదను. ఈ విధముగానే ధర్మార్థ కామములను వేరు వేరుగా భావించి కేవలము ఒకదానినే ఆశ్రయించక, వాటికి పరస్పరము సంఘర్షము రాకుండగ, పగలు పూర్వభాగమునందు ధర్మమును, మధ్య భాగమునందు అర్థమును, చివరి భాగమునందు కామమును సేవించవలయును. ఈ విధముగానే వయస్సుయొక్క యవావస్థలో కామమును, ప్రౌఢావస్థలో అర్థమును, వృద్ధావస్థలో ధర్మమును సేవించవలెను. ఇట్లు వివేకము చేత ఆ మూటిని మానవుడు ఆశ్రయించవలెను. శాశ్వత సుఖేచ్ఛగలవారు ముముక్షువులై మోక్షమును సాధించుదురు. కనుక మహారాజా! భక్తిజ్ఞానములను ఆశ్రయించి మోక్షమునైనా సాధించుము. లేదా, పూర్వము నేను జెప్పిన విధముగా ధర్మార్థ కామములను ఆశ్రయించి లౌకిక సుఖమునైన పొందుము. ఈ రెంటికిని దూరమై నీవు ఆర్తినందుట వివేక లక్షణము గాదు.

"రాజా! నీవెప్పుడును ధర్మము నాచరించుచుందువని నాకు తెలియని విషయముకాదు. అయినను, నీ హితమునుకోరు బంధువర్గమైన మేము ధర్మయుక్తమైన కర్మనుచేసి పురుశార్థములను సాధించమని ప్రేరణ చేయుచున్నాము. యజ్ఞదానాదులు, వేదాధ్యయనాదులు ఇహపర సౌఖ్యమును కలిగించు ధర్మములు. రాజా! యజ్ఞాదులు చేయుటకుగాను మనుష్యునకు ఇతర సద్గుణములెన్ని యున్నను ధనములేనిచో అతడు వాటిని సాధించజాలడు. అట్టి ధనము, బిచ్చమెత్తికాని, దైన్యముచేతకాని, కేవలము ధర్మపరత్వముతోనే సర్వదా వ్యవహరించుటచేతకాని లభించదు. యాచించి ధనమును సంపాదించుట బ్రాహ్మణధర్మము. అది నీకు, క్షత్రియుడవు కనుక, నిషిద్ధము. అందువలన నీవు పరాక్రమము ద్వారా మాత్రమే ధనసంపాదన చేయవలెను. క్షత్రియునకు భిక్షమెత్తుట గాని, వైశ్య, శూద్ర కర్మలను ఆచరించుటగాని తగదు. స్వాభావికమైన బలమే అతనికి సాధనము. కనుక స్వధర్మము నాశ్రయించి మా సహాయముతో శత్రుసంహారము చేయుము. నీవు కఠినమైన శూరకర్మచేయు క్షత్రియకులములో జన్మించినావు. అందరు నిన్నుజూచి భయపడునట్లుగా స్వకర్తవ్యమును నిర్వహించుము. ప్రజాపాలనము చేయుట నీకు అనింద్యమైన కర్తవ్యము. దానిని వీడినచో లోకులు నిన్ను పరిహసింతురు. స్వధర్మమును వీడుట ప్రశంసాపాత్రముకాదు. హృదయమును క్షత్రియ తేజోయుతముచేసి ఈ శైథిల్యమునువీడి పౌరుషముతో ధనస్సును చేతబట్టుకొనుము. కేవల ధర్మమును ఆశ్రయించి యెవడుగూడ పృథివిని జయించలేదు. అట్టి వానికి సంపదలు, రాజ్యలక్ష్మి లభించవు. క్షుద్రజంతువులకు చిన్న చిన్న ఆహార వస్తువుల ఆశచూపి కపటముచేత వాటిని పట్టుకొనునట్లే నీతిమంతుడగు రాజు కపట నీతి ద్వారా రాజ్యమును పొందవలెను. జ్యేష్ఠభ్రాతలని కూడ సంకోచించక రాక్షసులను దేవతలు కపట వృత్తితోనే జయించిరికదా! కనుక దుష్టులయెడ బాంధవ్యదృష్టి పనికిరాదు. ఇట్లు చేసిన బలవంతుడొక్కడే సర్వముపైనను అధికారము వహించగలడు. గనుక కపట నీతితోనే నీవుగూడ శత్రువులను సంహరించుము.

"రాజా! అర్జునునివంటి ధనుర్ధరుడు, నావంటి గదాధరుడు లేడుగదా! మేము నీకు బాసటగా నుండగా నీకు లోపమేమి. అయినను, ఎంత సహాయ సంపత్తిఉన్నను పురుషుడు ఆత్మబలముతోనే కార్యము సాధించగలడు. కనుక నీవు జాగ్రత్త వహించి ఉత్సాహముతో ఆత్మబలముపై ఆధారపడవలెను. మనుష్యునకు ఆత్మబలముతో సమానము మరియొకటిలేదు. తదితరములన్నియు మిధ్య. మంచుకాలములో వృక్షచ్ఛాయవలె ఇతర బలము సేవ్యము కాదు. కర్షకుడు విశేష ధాన్యమును సంపాదించుటకై భూమిలో అల్పధాన్యమును నాటినట్లు విశేష ధన సంపాదనకై స్వల్ప ధనమును వెచ్చించుట అవసరము. స్వల్ప ధనము పెట్టుబడి పెట్టి అధిక ధనమును సంపాదించనిచో ఆ పెట్టుబడి వ్యర్థము. అది, గార్ధభములు పరస్పరము రాచుకొన్నట్లు నిరర్థకము. అట్లే మనుష్యుడు స్వల్పముగా ధర్మమును వెచ్చించి అధిక ధర్మమును పొందును అదియే బుద్ధిమంతుని లక్షణము. మిత్రులతోగూడిన శత్రువునుజూచి, అతనికి వారితో భేదము గల్పించి, వారు దూరమైన పిదప ఆ శత్రువును వశపరచుకొన వలెను. ఇది రాజనీతి. ఆత్మబలసంపన్నుడగు రాజు ప్రజలను ప్రశంసించి వశపరచుకొనడు. దుర్బలులైనను ప్రజలు, తేనెటీగలు తేనెపట్టు వానిని ముసురుకొని చంపినట్లు సంఘబలముతో బలవంతుడగు రాజును చంపుదురు. అట్లు స్వశక్తితోనే సూర్యుడు తన కిరణములచేత భూమి జలమును పీల్చి, దానినే తిరిగి వర్షము ద్వారా కురిపి ప్రజలను కాపాడుచున్నాడుకదా! అట్లే నీవు కూడ చేయవలెను. ధర్మముతో రాజ్యపాలనమును మన పూర్వులు చేసిరి. అదియు తపస్సే. అట్టి తపస్సును నీవు గూడ పూర్వుల వలెనే ఆచరించవలెను.

క్షత్రియుడు యుద్ధము ద్వారా పొందు విజయ మరణముల వలన సంపాదించు పుణ్యఫలమును కేవలము ముక్కు మూసికొని చేయు తపస్సు వలన సంపాదించజాలడు. తేజోహీనమైన నీ యీ సంకటమును జూచి ప్రజలు సూర్యుని నుండి తేజస్సు, చంద్రుని నుండి చంద్రిక పోయినదని తలచుచున్నారు. ప్రజలు నిన్ను ప్రశంసించుచు, దుర్యోధనుని నిందించు చున్నారు. నీవు ఎట్టి లోభమోహాదులచేతగూడ అసత్యమునాడవని పెద్దలు చెప్పుచున్నారు. శత్రు హింస ద్వారా రాజు రాజ్యమును సంపాదించవలెను. హింసవలన గలిగిన పాపమును తరువాత యజ్ఞాదులలో దక్షిణదానము ద్వారా పోగొట్టుకొనును. బ్రాహ్మణులకు దక్షిణలిచ్చి రాజు చీకట్లనుండి చంద్రుడు విడివడినట్లు, పాపముల నుండి విడిపోవును. కుక్కతోలు సంచిలో గోక్షీరమువలె, అనర్హుని నోటిలో వేదవాక్యము వలె, చోరునియందు సత్యమువలె, స్త్రీయందు బలమువలె దుర్యోధనునియందుగల రాచరికము కూడా అనుచితమని పౌర జానపదాదులందరును ప్రతిదినము చెప్పుకొనుచున్నారు. నీవు అవలంబించిన యీ దుర్బల నీతి వలన ప్రజలందరును విపత్తికి పాల్పడిరి. కనుక రాజా! వెంటనే నీవు శస్త్రాస్త్రములనుబూని యుద్ధమునకు బయలు దేరుము. మేమందరము ఇంద్రునకు దేవతలు వలె, నీకు బాసటగా నుండగా నీవు శత్రు సంహారమునుచేసి రాజ్యలక్ష్మిని గైకొనుము. గాండీవ నిర్ముక్త బాణములను, క్రుద్ధుడనగు నా గదాదండపు దెబ్బను ఎంత బలవంతుడైనను సహించజాలడు. కనుక వెంటనే యుద్ధమునకు లెమ్ము" అని భీమసేనుడు వీరోచితముగా చెప్పిన పై మాటలను విని యుధిష్ఠిరుడిట్లు బదులు చెప్పెను:—

"భీమసేనా! వాగ్బాణములచేత నీవు నన్ను బాధపెట్టితివి, కాని నీవు అనిన మాటలన్నియు సత్యములే. నీ మాటలు నాకు ప్రతికూలములైనను నేను నిన్ను నిందించను. ఎందుకనగా, నేను చేసిన అన్యాయమువలననే మీకు ఈ విపత్తి ప్రాప్తించినది. ధార్తరాష్ట్రుల నుండి జూదములో రాజ్యమును జయించదలచియుంటిని. కాని వారికి సహాయముగా శకుని కపట ద్యూతమును ఆడినందున అది మనకు సిద్ధించలేదు. మాయతో నతడు నన్ను ఓడించెను. అతనికి అనుకూలముగా అతడనుకొనినట్లు పాచికలు పడుటను చూచియైనను జూదమును మానుకొనవలసి యుండెను. కాని, క్రోధావేశముచేత అట్లు చేయనైతిని. అది మనుష్యుని ధైర్యమును నష్టము చేయునుగదా! నాయనా! ఒక విషయమునందు ఆసక్తమైన మనస్సును, పౌరుషముచేత, అభిమానముచేత, పరాక్రమముచేత కాని ఆపుట కష్టము. నీ మాటలను నేను ఆక్షేపించుట లేదు. మన తలవ్రాత అట్లున్నది గనుక అది జరిగినది.

"దుర్యోధనుడు రాజ్యమును హరించి, మనను దాసులను చేసెను. ఆ సమయమునందు ద్రౌపది మనను కాపాడెను. అప్పుడు తిరిగి జూదమునకు మనను అతడు పిలిచెను. దైవప్రేరణచే పోయి తిరిగి ఓడితిని. ఆ పందెములో దుర్యోధనుడు కురుసభలో "వనవాసము, అజ్ఞాతవాసము సక్రమముగా నెరవేర్చి వచ్చినచో మీ యేలుబడిలోనుండిన 'పంచనద' ప్రాంతమంతయు తిరిగి మీరు ఏలుకొనవచ్చును. ఈపందెము మన యిరువురకు సమానమే" అని ప్రకటించెను. నేనును ఆ మాటకు 'తథాస్తు' అంటిని దానినిగూడ శకుని కపటము చేతనే మనము ఓడి యీ యడవులపాలైతిమి. దుర్యోధనుడు తనకు హితులను ఉన్నత పదవులలో నిలిపెను. కౌరవ సభలో మనము ఆనాడు ప్రతిజ్ఞచేసి అట్టి మాటను రాజ్యలోభము చేత ఇప్పుడు భంగపరచగలమా? ధర్మమును ఉల్లంఘించి, ఉత్తమ పురుషుడెవడుగూడ నడవజాలడు. అది మృత్యువుకన్న దుఃఖదాయకము. వీర భీమసేనా! జూదమాడునప్పుడే నీవు నా రెండు బాహువులను కాల్చివేయబూనితివి. కాని అప్పుడు అర్జునుడు అడ్డుపెట్టుటచేత ఆగితివి. శత్రువులను చంపుటకు గూడ నీ గదాయుధముపై చేయివైచితివి. ఒకవేళ అప్పుడే నీవు శత్రువులను చంపియుండినచో ఎంత అనర్థము మనకు మూడియుండును. నేను ప్రతిజ్ఞచేసి జూదమునకు పూనక పూర్వమే నీవు ఇటువంటి మాటలు ఏల నాతో ననకపోయితివి? అప్పుడు నీ పౌరుషము నిన్ను వీడకయే యుండెనుగదా! నా ప్రతిజ్ఞననుసరించి ఇప్పుడు వనమునకు వచ్చిన తరువాత నాతో ఇంత కఠినముగా నీవు మాట్లాడదగునా? ఇప్పుడు నీవు అనుచున్న మాటల వలన పూర్వము మన కన్నుల యెదుట ద్రౌపదికి అవమానము గలిగినప్పటి దుఃఖమువంటి దుఃఖమును అనుభవించుచున్నాను. ఇప్పుడు నేను ప్రతిజ్ఞకు భంగముగా వ్యవహరించను. భీజమును నాటిన కర్షకుడు అది పంటకు వచ్చువరకు ప్రతీక్షించునట్లే మన సుఖకాలమునకై వేచియుండుము తొలుత శత్రువులచేత మోసగించబడిన వీరపురుషుడు, శత్రువుయొక్క అభివృద్ధిని తెలిసికొని తన పౌరుషము ద్వారా అతనిని సమూలముగా నశింపజేయవలెను. అప్పుడే ఆ గొప్ప శత్రువు యొక్క పెద్ద వైభవమును అపహరించి యీ ప్రపంచములో సుఖమయమైన జీవితమును గడప గలుగును. అతనికి రాజ్యలక్ష్మి చేకూరి, శత్రువులందరు వినమ్రులైయుండెదరు. మిత్రులు, ఇంద్రుని దేవతలు చేరి కొలచినట్లు కొలుచుచుందురు నా ప్రతిజ్ఞ వినుము నేను జీవితముకన్నను అమరమైన మోక్షముకన్నను ధర్మమే శ్రేష్ఠమని తలచెదను రాజ్యము-పుత్రులు-కీర్తి-ధనము ఇవన్నియు సత్యధర్మములయొక్క పదునారవ వంతునకుగూడ సరిపోవు" అని యుధిష్ఠిరుడు చెప్పెను

( సశేషము )

# తెలంగాణాలో పొలాలకు కొత్త సేద్యపు నీటి సౌకర్యాలు

హైదరాబాదు — తెలంగాణ జిల్లాలలో మెట్ట భూములకు ఇప్పుడు కొత్తరకం సేద్యపు నీటిపారుదల సౌకర్యాలు లభిస్తున్నాయి. బావుల త్రవ్వకం, ఆనకట్టల నిర్మాణాల ద్వారా ఈ సౌకర్యాలు కల్పిస్తున్నారు.

ఈ సేద్యపు నీటిపారుదల సౌకర్యాలను రైతులు సమర్థంగా ఉపయోగించుకొనేలాగా చూడటానికి కూడా కృషి జరుగుతున్నది.

ఆంధ్రప్రదేశ్ వ్యవసాయశాఖ ఆధ్వర్యాన జరుగుతున్న ఈ కృషిలో ప్రముఖ భూమిక నిర్వహిస్తున్నవారిలో అమెరికన్ వ్యవసాయ ఇంజనీర్ రాబర్ట్ హెచ్. డ్యూబాయిస్ ఒకరు. అధికాహారోత్పత్తికి ప్రభుత్వం సాగిస్తున్న కృషిలో తోడ్పడుతున్న అయిదుగురు అమెరికన్ నిపుణులలో ఈయన ఒకరు.

సేద్యపు నీరు వృధాగా పోకుండా సద్వినియోగం కావటానికి ఈ అమెరికన్ నిపుణులు రైతులకు చెబుతున్న మార్గాలలో కాంటూర్ వ్యవసాయ పద్ధతి ఒకటి. సాధారణంగా మెట్టజొన్న వగైరా ధాన్యపు పంటలు, తోట పంటలు వేసే తెలంగాణ పొలాలకు ఈ పద్ధతి చాలా అనువైనది. భూసారాన్ని, నీటిని, పనివారి శ్రమను పెట్టుబడులను వృధా కాకుండా చేసుకొనటంలో ఈ పద్ధతి ఉపయోగం ఇప్పటికే కనుపించింది. భూములను కొత్తగా పల్లపు సాగులోకి మార్చటంలో ఈ భూములకు సహజంగా ఉన్న స్వల్ప ఏటవాలులను అట్లానే ఉండేలాగా చూస్తున్నారు. చాళ్లు తోలతారు. ఈ చాళ్లలోనుంచి సేద్యపు నీరు నిదానంగా ఏటవాలు వెంట ప్రవహిస్తుంది. ఇట్లా ప్రవహిస్తూ భూమిని బాగా నాన్చుతుంది.

ఒక విత్తనాల సప్లయి సంస్థ 450 ఎకరాల నేలను కొని ఈ కాంటూరు పద్ధతి వ్యవసాయం చేసినందువల్ల మంచి ఫలితం కలిగింది.

ఈ సంస్థ వ్యవసాయ శాస్త్ర సలహాదారు శ్రీ ఆర్. కె. డ్యూబాయిస్, తమ క్షేత్రంలో ఈ కాంటూర్ వ్యవసాయ పద్ధతివల్ల ట్రాక్టర్, బుల్‌డోజర్ల అవసరం చాలవరకు తగ్గించుకోగలిగినట్లు తెలిపారు. నేలను చదును చేయవలసిన అవసరం లేదుగనక, పెద్దపెద్ద రాతిగుండ్లు తీసివేసి, చాళ్లు తోలితేసరిపోతున్నది అని ఆయన చెప్పారు. ఇందువల్ల, ముఖ్యమైన పైపొర మన్ను చెదరకుండా ఉంటుంది. నేలను చదును చేయవలసిన అవసరం లేకపోవటమే ఇందుకు కారణం అని ఆయన వివరించారు.

కొత్త పద్ధతిలో సేద్యపు నీటిని వినియోగించుకొనటంలో ఈ నీరు ఏ మాత్రం వృధా కాకుండా ఉండేలాగా జాగ్రత్త పడుతున్నారు. బావులలోనుంచి పంపుల ద్వారా తోడిన నీటిని పొలంలో నాలుగు మూలలకు భూములలోపల ఉండే గొట్టాలద్వారా పారించి, అక్కడ నిల్వపెట్టి ప్లాస్టిక్ గొట్టాల గుండా ప్రవహింపచేసి, పొలంలో మెరక భాగాన ఉండే చిల్లుల గొట్టం ద్వారా చాళ్లలోకి వదులుతారు.

ఇట్లా చేయటం వల్ల చాళ్ల మధ్య నేలలోకి నీరు ఇంకిపోయి ఆవిధంగా వృధా కావటం అంటూ ఉండదు. అదీ కాక మామూలు పద్ధతిలో అయితే కాలువల కోసం కొంత నేల పోతుంది. ఈ గొట్టపు నీటిపారుదల పద్ధతిలో అటువంటి అవసరం లేదు గొట్టాల ఏర్పాటు లేని రైతుల పొలాలకు సైఫన్ గొట్టాల ద్వారా నీటిని చేరవేయవచ్చు.

కరీంనగర్ జిల్లాలో చాలమంది రైతులు ఈ కొత్త ఇరిగేషన్ పద్ధతి అనుసరిస్తున్నారు. మక్తా గ్రామంలో శ్రీ ఎం. నరసింహారెడ్డి, వారిలో ఒకరు. ఈయన తన 30 ఎకరాల పొలంలో ఈ పద్ధతిని అనుసరించినందువల్ల కలిగిన లాభమేమిటో చెప్పారు. 15 ఎకరాలలో సజ్జ, మరొక 15 ఎకరాలలో మిశ్రమ జాతి మొక్కజొన్న పంట వేశారు. ఈ పద్ధతివల్ల పొలంలో ఎక్కువ మొక్కలు పెంచవచ్చు గనుక పంట ఎక్కువ పండింది. నీరు వృధా కావటం తగ్గింది. తక్కువ మంది పనివారితో పని జరిగింది. సేద్యపు నీరు నాలుగోవంతు పొదుపు అయింది. ఊడ్పులకు కావలసిన పని వారి సంఖ్య 60 శాతం తగ్గింది

ఈ ప్రాంతంలో మిగతా రైతుల విషయంలోకూడ ఇటువంటి ఫలితాలే కలిగాయని శ్రీ డ్యూబాయిస్ ఇటీవల ఒక ఇంటర్వ్యూలో చెప్పారు.

శ్రీ డ్యూబాయిస్ ఆంధ్రప్రదేశ్‌లో సంవత్సరంనరం కాలం నుంచి పనిచేస్తున్నారు. ఇరిగేషన్ అధికారులకు, డెవలప్‌మెంట్ అధికారులకు ఈ పద్ధతులు తెలియచెప్పటం ద్వారానూ, పొలాలకు వెళ్లి [illegible] ద్వారానూ ఈయన ఈ పద్ధతి వ్యాప్తికి కృషి

చేస్తున్నారు. విస్తరణ కార్యక్రమాల ద్వారా దేవలప్‌మెంటు కార్యకర్తలు ఈ పద్ధతులను రైతులకు తెలియజెప్పుతారు.

కొన్ని రకాల నేలలకు, పంటలకు ఈ కాంటూర్ పద్ధతి శ్రేష్ఠమైనదిగా సిఫార్సు చేయబడుతున్నది. తగిన చోట, ఉపరితల సేద్యపు నీటిపారుదల పద్ధతి, నీరు చల్లకం ఇరిగేషన్ పద్ధతిని కూడా సిఫార్సు చేస్తున్నారు.

అయా రకాల ఇరిగేషన్ పద్ధతులను నిరూపించే నిమిత్తం శ్రీ డ్యూబాయిస్ ఆంధ్రప్రదేశ్ వ్యవసాయ విశ్వవిద్యాలయం ఆధ్వర్యాన మూడు ప్రత్యక్ష కార్యక్షేత్రాలను ఏర్పాటు చేస్తున్నారు. వీటిలో ఒకటి రాజేంద్ర నగర్‌లో, ఒకటి తిరుపతిలో, మరొకటి బాపట్లలో ఉండవచ్చుననుకొంటున్నారు.

ఈ కార్యక్రమాలలో శ్రీ డ్యూబాయిస్ ఆంధ్రప్రదేశ్ వ్యవసాయ శాఖలో డివిజనల్ సాయిల్ కన్సర్వేషన్ ఆఫీసర్ శ్రీ సి. సీతాపతిరావు, ఆంధ్రప్రదేశ్‌లో వ్యవసాయ విశ్వవిద్యాలయంలో అగ్రానమి అసోసియేట్ ప్రొఫెసర్ డాక్టర్ శ్రీ ఏ. వెంకటాచారిగార్లతో కలిసి పని చేస్తున్నారు.

శ్రీ డ్యూబాయిస్‌కి కేన్సస్ స్టేట్ యూనివర్సిటీ నుంచి అగ్రికల్చరల్ ఇంజనీరింగులో ఎం. ఎస్.సి. డిగ్రీ ఉన్నది. ఆ విశ్వవిద్యాలయ లో ఈయన మూడేళ్లు అధ్యాపకుడుగా పనిచేశారు అయితే, జీవితంలో హెచ్చుభాగం ఈయన పొలంలోనే గడిపారు. ఇండియాలో తన రెండేళ్ళ పని ముగియగానే తిరిగి తన పొలం పనికి వెళ్లాలనుకొంటున్నారు.

# నల్లజర్ల పంచాయతీ సమితిలో కొత్త పథకాలు

—బి. సూర్యనారాయణమూర్తి

నల్లజర్ల పంచాయతీ సమితి పశ్చిమ గోదావరి జిల్లాలోని తాడేపల్లి గూడెం తాలూకులో వుంది. దీనిలో 37 గ్రామాలు వున్నాయి. ఈ ముప్పయ్‌ఏడు గ్రామాలలోనూ 24 గ్రామాలు మెరక భూముల గ్రామాలు. ఈ ప్రాంతంలోని రైతులు పంటను పండించడానికి అనేక చిత్రమైన సమస్యలను ఎదుర్కోవలసి వస్తున్నది. వరి పంట యిక్కడ ప్రధానంగా పండించే పంట. మెట్టపంటలు, చెఱకు, కూరగాయలు, వేరుశనగ, మెట్టభూముల్లో పండే వరి – వీటిని సాధారణంగా మెరక గ్రామాల్లో పండిస్తుంటారు.

మెరక గ్రామాలో రైతులు ఏడాది పొడుగునా వ్యవసాయపు పనుల్లోనే మునిగివుంటారు. ఇక్కడి రైతులు కొత్త ధోరణులను, కొత్త వ్యవసాయ పద్ధతులను అనుసరించారు.

ఇటీవలే ఈ సమితిలో 'డాపాగ్ పద్ధతిన' వరి మళ్ళను పెంచే ఒక కొత్త ధోరణిని అనుసరించారు. చాలా కొద్ది కాలంలోనే దీనిని అనేక ప్రాంతాలకు విస్తృత పరిచారు.

## వరిమళ్ళను డాపాగ్ పద్ధతిలో పెంచడం

డాపాగ్ పద్ధతిన వరిమడిని 1968 జూలైలో నల్లజెర్ల గ్రామంలో వేశారు. ఇందుకుగాను పదును పెట్టిన సి.హెచ్_45 రకం విత్తనాలను 24 గంటలపాటు నీళ్ళలో నానవేశారు. గోనెసంచిలో అలా నానవేసిన విత్తనాలను తీసుకొనివెళ్ళి చీకటి గదిలో వుంచి దానిమీద కొద్దిపాటి బరువును పెట్టారు. పన్నెండు గంటల అనంతరం వాటికి మొలకలు రావడం ప్రారంభించాయి. అప్పటికవి నాటడానికి సిద్ధంగా వున్నాయి

20 అడుగుల పొడవు, 4 అడుగుల వెడల్పు, 1 అడుగు ఎత్తున నారుమడిని తయారు చేశారు. దానికి నాలుగువైపులా అడుగులోతు, అడుగు వెడల్పుగల కాలవల్ని త్రవ్వారు. ఆపైన సిద్ధం చేసిన ఎగుడు దిగుడులులేని మడిమీద పాలిథిన్ పేపర్‌ను పరిచారు. మొలకలు నేలను తాకకుండా వుండే విధంగా ఆ పాలిథిన్ పేపర్‌ను పరిచారు. అంతకుముందు నానవేసి చిన్న మొలకలు వచ్చిన విత్తనాలను తెచ్చి పాలిథిన్ పేపర్‌మీద పరచి, దానిని సిద్ధంచేసివుంచిన మడిమీదకు జరిపి అరంగుళం మందాన పరిచారు.

ఆపైన గోనె గుడ్డలను పరిచి రోజుకు రెండు మూడుసార్లు నీళ్ళను చల్లారు. హెచ్చు తగులుగా మొలకలు రాకుండా ఒకే ఎత్తులో వచ్చేందుకై గోనె గుడ్డమీద కొద్దిపాటి బరువును వుంచారు.

నాలుగో రోజున 1 అం. మొదలుకొని 1½ అం. పొడవు గల పచ్చని మొలకలు రావడంతోటే గోనె గుడ్డల్ని తీసివేశారు. మడిచుట్టూవున్న కాలువల్లోకి నీటిని యించు మించు మడి అంచు వరకు నీరు వచ్చేట్టు విడుదల చేశారు. ఇది పరిసరాలను చల్లగా వుంచడానికేగాని మొలకలకు నీటిని పెట్టేందుకు కాదు. పన్నెండు రోజులపాటు రోజుకు రెండు మూడు సార్లు ఈ మడిమీద నీటిని చల్లారు. అప్పటికి మొలకలు 8–9 అం: ఎత్తు వచ్చి తిరిగి వాటిని పొలంలో నాటడానికి సిద్ధంగా వున్నాయి.

పదహారో రోజున యీ మొలకల్ని పొలంలో నాటారు.

వర్షాలమీద ఆధారపడిన మెరక గ్రామాలలో యీ దిగువ కారణాలవల్ల డాపాగ్ పద్ధతిలో వరిమళ్ళను పెంచడం చాలా లాభదాయకమైనదిగా చెప్పవచ్చు:–

i) 12–14 రోజుల్లోనే అతి తక్కువ వ్యవధిలో నారును నాటవచ్చు.

ii) నారుమడికి ఎరువు వేయాల్సిన అవసరంలేదు.

iii) నారు మడికి చాలా తక్కువ స్థలం వుంచేవాలు. (అంటే ఎకరాకు కావలసిన నారుమడి 20 చ. గ. వుంచేవాలు)

iv) నారును తయారు చేయడానికి కూలి క్రింద అయ్యే ఖర్చు చాలా తక్కువ.

v) మోకాళ్లు నేలనుంచి పెకిలించే ప్రశ్నేలేదు గనక దీనిక్రింద ఖర్చుకూడా ఏమీలేదు.

vi) నారు నాటడంతోనే భూమిలో బాగా పాతుకుపోతాయి.

vii) ఈ పద్ధతిన ఏ రకం వరినారునైనా పెంచవచ్చు.



డాపోగ్ నారుమడి

నల్లజెర్లలో పెంచిన డాపాగ్ నారుమళ్ళను అనేకమంది అధికార్లు అనధికారులు వచ్చి సందర్శించి మెచ్చుకున్నారు. ప్రభుత్వ ప్రధాన కార్యదర్శి శ్రీ ఎం. టి రాజు, ఆదోనిలోని వ్యవసాయశాఖసంయుక్త డైరెక్టర్ మహమ్మద్ ఖాసిం, పంచాయతీరాజ్ కమీషనర్ శ్రీ ఐ. జె. నాయుడు, పశ్చిమ గోదావరి జిల్లా పరిషత్తు సభ్యులు, అధ్యక్షుడు; పార్లమెంటు సభ్యులు, శాసనసభ, శాసన మండలి సభ్యులు; ఇంకా పశ్చిమ గోదావరి జిల్లా కలెక్టరు, జిల్లా అధికారులు, ఆకాశ వాణి అధికారులు, వ్యవసాయ విస్తరణాధికార్లు, అమెరికా శాంతి దళం సభ్యులు యీ డాపాగ్ పద్ధతిని పరిశీలించేందుకు ఈ సమితిని సందర్శించారు.

## గ్రామీణ విద్యుదీకరణ పథకం

సేద్యానికి భూగర్భ జలాలను వెలికితీసే విషయంలో విద్యుచ్ఛక్తి ప్రధానపాత్ర వహిస్తుంది. నల్లజెర్ల బ్లాకులో మెరక ప్రాంతాలలో చాలా గ్రామాలకు విద్యుచ్ఛక్తి సౌకర్యం లేదు. గడచిన మూడు నాలుగు సంవత్సరాలుగా వరుసగా వర్షాలు సరిగా కురవక రైతులు అనేక యిబ్బందులను ఎదుర్కొనవలసి వస్తున్నది. బావుల్లోని నీటిని తోడడానికి ఆయిలు ఇంజన్లను నడిపేందుకు పెద్ద మొత్తాలను ఆయిలుకై బీదరైతులు వెచ్చించలేకపోతున్నారు. ఈ గ్రామాలలోని ప్రజలు మోటార్లను నడపడానికై విద్యుచ్ఛక్తిని పొందేందుకు గడచిన పదేళ్ళుగా ప్రయత్నిస్తూనే వున్నారు.

ఈ ఏడాది యిక్కడి శాసన సభ్యులు శ్రీ అల్లూరి కృష్ణారావు యీ విషయంలో కృషిచేశారు తమ గ్రామాలకు విద్యుచ్ఛక్తి సౌకర్యాన్ని కల్పించుకోవాలంటే ప్రతి వ్యవసాయ లోడ్‌కు రూ. 2,500 చొప్పున భూమి తనఖా బ్యాంకు ద్వారా రాష్ట్ర విద్యుచ్ఛక్తి మండలికి ఋణాలను మదుపు పెట్టడానికి రైతులచేత ఆయన అంగీకరింపజేశారు. బావులు, గొట్టపు బావులు ఎక్కువగా వున్న 17 గ్రామాలలోని రైతులు ముందుకు వచ్చారు. ఈ రైతులు తాడేపల్లిగూడెంలో భూమి తనఖా బ్యాంకులో తమ పొలాల్ని తనఖా పెట్టారు. ఇందుకుగాను భూమి తనఖా బ్యాంకు రూ. 13,60,000 లను 567 ఎలక్ట్రిక్ మోటారులకు కనెక్షన్లను యివ్వడానికై ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర విద్యుచ్ఛక్తి మండలికి ఋణాన్ని యిచ్చింది దీనికితోడు 17 గ్రామాలో విద్యుచ్ఛక్తి సౌకర్యాన్ని —గృహావసరాలకు, వీధులలో దీపాలను ఏర్పాటు చేయడానికి— కల్పించడం జరిగింది. విద్యుచ్ఛక్తి వల్ల అదనంగా 6,000 ఎకరాలను సేద్యానికి తీసుకురావచ్చు.

ఎర్నగూడెంలో ఒక సబ్ స్టేషను నిర్మాణానికి రాష్ట్ర ప్రధాన కార్యదర్శి శంకుస్థాపన చేశారు. గ్రామాలకు విద్యుదీకరణ కార్యక్రమం పురోగతిలో వుంది. మూడు గ్రామాలలో యీ పని పూర్తిగా యించుమించు పూర్తికావచ్చింది. 1968 అక్టోబరు మాసాంతానికి 4 గ్రామాలకు విద్యుత్ సరఫరా లభించింది. మెరక భూముల రైతులకు యిదొక వరప్రసాదం వంటిది.

## నల్లజెర్ల సమితిలో రిగ్గులు

ఈ బ్లాకులోని ప్రకాశరావుపాలెం, కొత్తగూడెం, అయ్యవరం వంటి గ్రామాలలో పశువులకు, మనుషులకు కూడా త్రాగడానికి నీరు దొరకడం కష్టంగా వుంటున్నది ఈ గ్రామాలలో గొట్టపు బావుల్ని త్రవ్వే ప్రయత్నాలు చాలా వరకు నిరాశనే కలిగించాయి. బయటి వూళ్ళనుంచి యీ గ్రామాలకు నీటిని తెచ్చిన సందర్భాలు కూడా చాలా వున్నాయి.

ఈ గ్రామాలలో మంచినీటి సరఫరా సమస్యను పరిష్కరించేందుకు, కొంతవరకు సేద్యపు నీటి సమస్యను పరిష్కరించేందుకు కలెక్టరు శ్రీ కె. సుబ్రహ్మణ్యం అధ్యక్షతన జిల్లా అభివృద్ధి మండలి గొట్టపు బావుల త్రవ్వకానికై రిగ్గులను ఏర్పాటు చేసింది. ప్రస్తుతం భారత భూగర్భసర్వేవారి రిగ్గు ఒకటి ప్రకాశరావుపాలెం గ్రామంలో త్రవ్వకం పని జరుపుతున్నది. త్వరలోనే అయ్యవరం గ్రామంలో మరొక రిగ్గు పనిచేయబోతున్నది. 



నాగార్జునసాగర్ ఆయకట్టు ప్రాంతంలో తీవ్రతర ప్రచార ఉద్యమానికి కేంద్ర మంత్రి శ్రీ కె. కె. షా జనవరి 2న ప్రారంభోత్సవం చేసినప్పటి చిత్రం

# నాగార్జున సాగరు ఆయకట్టు క్రింద వరిసేద్యంలో సాధించిన విజయం

నాగార్జునసాగర్ ఆయకట్టు ప్రాంతంలో ఆరుతడిభూముల్లో వరిపంట విజయవంతంగా సేద్యం చేయడం జరిగింది. ఈ కొత్త పద్ధతి సేద్యంవల్ల యిక్కడ ఏడాదికి, సాంప్రదాయంగా ఒకటో రెండో పంటల్ని పండించే బదులు మూడు పంటల్ని పండించే అవకాశం ఏర్పడింది.

పంట దిగుబడికూడా చాలా సంతృప్తికరంగా వుంది. ఎకరాకు సాంప్రదాయకమైన రకం—అక్కుళ్ళ జి. బి-24 రకం అయితే 22 బస్తాలు పంట దిగుబడి వస్తున్నది. ఉత్పత్తి ఖర్చుకూడా తక్కువే. సాంప్రదాయక పద్ధతిలో లోగడ ఎంత ఖర్చయ్యేదో దానిలో మూడోవంతు మాత్రమే యిప్పుడు ఖర్చు అవుతున్నది. ఆరుతడి సేద్యంవల్ల లాభం ఏమిటంటే నీటిని నిలువచేయడం; నారుమడిని పెంచడం, నాట్లువేయడం వంటి ఖర్చుతోకూడిన పనుల అవసరం వుండదు. వర్షాధార భూముల్లో వేసే పంటమాదిరి గానే యీ పద్ధతిలో కూడా విత్తనాలను ముందుగా జూలై మొదటి వారంలో నైఋతి పవనాలు వీచడం ప్రారంభం కాగానే చల్లుతారు. మొక్కలమధ్య దూరాన్ని తగ్గించడంవంటి చర్యలవల్ల దిగుబడిని మరింత హెచ్చించవచ్చు. వరుసగా ఒకేపంటను వేయకుండా మార్పు చేయడంవల్ల భూసారాన్ని కాపాడుకోవచ్చు. వేరుశనగ, ప్రత్తి, మిర్చి, పప్పుధాన్యాలను యీ విధంగా ప్రత్యామ్నాయ పంటగా పండించవచ్చు.

ఒక్క గుంటూరు జిల్లాలోనే వరిని ఈ ఆరుతడి సేద్యం క్రింద సుమారు 40 000 ఎకరాలలో పండిస్తున్నారు.

## కాకరవాని ప్రాజెక్టు

ముఖ్యమంత్రి శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డి జనవరి 15 వ తేదీన కాకరవాని ప్రాజెక్టుకు శంకుస్థాపన చేశారు. రూ. 17



కాకరవాని ప్రాజెక్టుకు జనవరి 15న ముఖ్యమంత్రి శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డి శంకుస్థాపన చేస్తున్న దృశ్యం

లక్షల వ్యయంతో నిర్మింపనున్న యీ ప్రాజెక్టుకు శంకుస్థాపన జరగడంతో మహబూబ్‌నగర్ జిల్లాలో నీటి పారుదల అభివృద్ధి విషయంలో నూతనశకం ప్రారంభమైంది. మహబూబ్‌నగర్ జిల్లా స్వరూపాన్నే యిది మార్చివేయగలదు. రానున్న భవిష్యత్తులో



కోళ్ళ పెంపకానికి సంబంధించిన దక్షిణ ప్రాంతీయ సమావేశానికి డిశంబరు 14న హైదరాబాదులోని జూబ్లీ హాలులో వ్యవసాయ, పశుగణాభివృద్ధి శాఖా మంత్రి శ్రీ పి. తిమ్మారెడ్డి ప్రారంభోత్సవం జరిపారు

ఈ ప్రాజెక్టుక్రింద 1,780 ఎకరాల ఆయకట్టు ఏర్పడబో తున్నది.

కృష్ణానది పెద్ద పరీవాహక ప్రాంతంలో భీమానదికి ఉప నదిగా వున్న కాకర వాని వాగుమీద యీ పథకం క్రింద ఆన కట్ట కట్టడం జరుగుతుంది. కొడంగల్ తాలూకాలోని ఎరుప్మెల్లా గ్రామానికి యీశాన్య దిశగా ఒక మైలు దూరంలో రిజర్వాయరు వుంటుంది. దీనిక్రింద 1,780 ఎకరాలకు సేద్యపు నీరు లభిస్తుం దని అంచనా. ఈ ప్రాజెక్టుకు రూ. 16.77 లక్షలు ఖర్చవుతుంది. కాకరవాని వాగు కాగ్నానదికి ఉపనది. ఈ కాగ్నానది భీమానది నుంచి పుట్టినది. ప్రస్తుతం దీని నీటిని అంతగా సేద్యానికి వినియో గించడంలేదు.

గరిష్ఠ మొత్తం నీటి విడుదల 16,711 క్యూసెక్కులు వుంటుందని నిర్ణయించారు. ఈ ప్రాజెక్టు ఎడమ పార్శ్వపు కాలువకింద 1,780 ఎకరాల ఆయకట్టు ఏర్పడుతుంది. ప్రస్తుతం వున్న బొమరాసపేట చెరువుక్రిందగల ఆయకట్టును కూడా అలానే వుంచుతారు. ఈ ప్రాజెక్టు పూర్తయితే ఇక్కడి 1,780 ఎకరాల పట్టా మెరక భూములను పల్లపు భూములుగా మార్చుచేస్తారు.

ఎడమ పార్శ్వంనుండి వెళ్ళే కాలువ మహబూబ్‌నగర్ జిల్లాలో ఎరుప్‌మెల్లా, నమదాల్‌పూర్, తుంకిమెట్ల గ్రామాలకు; హైదరాబాదు జిల్లాలో చౌదర్‌పల్లి గ్రామానికి సేద్యపునీటిని సరఫరా చేస్తుంది.

## శాంతినగ

మహబూబ్‌నగర్ జిల్లాలోని ఓ గ్రామమైనశాంతి నగర్ కథ ఇది.

పందొమ్మిది వందల యాభై వరకు ఎర్రని ఎండలో కాలి బీటలుదేరి పచ్చని మొలకన్నాలేని నేలప్రాంతం యిదంతా. ఈనాడు ఎనిమిదేళ్ళ తర్వాత యీ గ్రామం ఒక కొత్త ఆకృతిని దాల్చి ఎటుచూసినా పచ్చని పొలాలతో కళ కళ లాడిపోతోంది. ఇంత విప్లవాత్మకమైన మార్పు యిక్కడ వచ్చిందంటే యిందుకు కారకులు సాహసవంతులైన సుమారు ఓ వంద రైతు కుటుంబాల వారు. వీరు కృష్ణా, గుంటూరు జిల్లాలనుంచి 1959 లో వలస వచ్చి యిక్కడ స్థిరపడి యీ గ్రామానికి నూతన స్వరూపాన్ని ఇచ్చారు. వీరు రసాయనిక ఎరువులువేసి, కంపోస్టు తదితర సాంప్రదాయక ఎరువులు వేసి భూమికి కొత్త సతువ కలిగించారు. తుంగభద్ర సేద్యపు నీటి ప్రాజెక్టు జలాలతో తమ భూముల్ని తడుపుకున్నారు. ఎన్ని కష్టాలొచ్చినా వారు వెనుకంజ వేయలేదు. ఎన్ని అవాంతరాలొచ్చినా నిరుత్సాహం చెందలేదు. స్థిర సంక ల్పంతో, మొక్కవోని దీక్షతో, నవ చైతన్యంతో నిరంతరంగా



జహీరాబాదు తాలూకాలోని గడ్డరపల్లివద్ద పెద్దవాగు ప్రాజెక్టుకు ప్రారంభోత్సవం చేస్తున్న సేద్యపు నీటి విషయాల మంత్రి శ్రీ శీలం సిద్ధారెడ్డి

కృషిచేసి నాలుగో యేటనుంచే శ్రమకు తగ్గ చక్కటి ఫలితాలను పొందడం ప్రారంభించారు.

ఈనాడు శాంతినగర్ యితర గ్రామాలకు ఆదర్శప్రాయమైన గ్రామమైంది. ఇక్కడ పాఠశాల వుంది. కొంతమంది రైతులే ఒక కమిటీగా ఏర్పడి దీనిని నడుపుతున్నారు. ఒక ధాన్యపు మిల్లు వుంది. అవసరమైన రైతులకు ఋణాలు యివ్వడానికి ఒక సహకార సంఘం కూడా వుంది. క్రమక్రమంగా తాటాకు పాకలస్థానే ఇక్కడ యిటికల యిళ్ళు తలెత్తుతున్నాయి.

ఇక్కడి ఈ మార్పుగూర్చి కృష్ణా జిల్లానుంచి వచ్చిన శ్రీ తలసిల వెంకట్రామయ్య అనే రైతు యిలా అన్నారు.

"నేను మధ్య తరగతిలో దిగువ స్థాయికి చెందిన రైతు కుటుంబీకుడ్ని. నాకు దినం గడవడం కొంచెం కష్టంగానే వుండేది. పై పెచ్చు కాలక్షేపానికి రాజకీయాల్లో పడి కాలాన్ని వ్యర్థపుస్తూ నా భవిష్యత్తు గురించిగానీ, నా కుటుంబం భవిష్యత్తు గురించి కానీ ఆలోచించేవాడిని కాను. తుంగభద్ర ప్రాజెక్టు పూర్తయి అలంపురం తాలూకాలోని భూముల్ని ఆయకట్టులో చేర్చడంతో నేను శాంతినగర్‌లో స్థిరపడదామని నిశ్చయించుకున్నాను. తదనుగుణంగా 1959 లో 6 వేల రూపాయలకు ఓ పదిహేను ఎకరాల భూమిని కొన్నాను. ఇది సేద్య యోగ్యంగా వుండేదికాదు. అలాంటి దానిని బాగా కృషిచేసి బాగుచేశాను. ఎరువులు వేసి సారవంతమైన పంట పొలంగా చేసుకున్నాను. ఈనాడు యిది ఒక్క ఖరీఫ్ పంట కాలంలోనే ఎకరాకు 25 బస్తాల ధాన్యాన్ని యిస్తున్నది. ఈ మధ్యకాలంలో కొంత డబ్బు కూడబెట్టుకుని వూళ్ళో సేద్యపు నీటి సౌకర్యం గల పల్లపు భూమి ఓ యిరవై ఎకరాలను కొనుక్కున్నాను. ఈ భూముల నుండి ఏటా నికరంగా రూ. 6_10 వేల మధ్య లాభం వస్తున్నది. నేను నా పొలంలో ఐ ఆర్_8 తైచుంగ్ నేటివ్‌ను, అక్కుళ్ళను, జి. బి._24 ను, సంకరజాతి జొన్న, మొక్కజొన్న, సజ్జను వేస్తున్నాను. ఈనాడు ఆర్థికంగా నేను బాగా స్థిరపడ్డాననే చెప్పొచ్చు"

శ్రీ వెంకట్రామయ్య వయసు 40 సంవత్సరాలు. ఆయన ఎనిమిదో తరగతివరకు మాత్రమే చదువుకున్నారు. అయితే రోజూ ఆయన వార్తాపత్రికల్ని చదువుతుంటారు. దానివల్లే అనేక ఆధునిక వ్యవసాయ పద్ధతులను తెలుసుకోగలిగానని ఆయన చెప్పుకుంటుంటారు. వ్యవసాయానికి, కుటుంబ నియంత్రణకు సంబంధించిన రేడియో ప్రసారాలవల్ల ఎంతో ప్రయోజనం వున్నదని, వాటివల్ల ఎన్నో వింత విషయాలు తెలుసుకోవడం జరుగుతున్నదని ఆయన అన్నారు. ముఖ్యంగా రైతులకు ఎంతగానో దీని వుపయోగం వున్నదని ఆయన చెప్పారు.

తన అనుభవాల్ని గూర్చి చెప్తూ పొలానికి రసాయనిక ఎరువులే కాక కంపోస్టు, గొర్రెలదొడ్డు కూడా చాలా అవసరమని అన్నారు. కొత్తగా సేద్యానికి వినియోగించే భూములకు పశువుల పేడ ఎంతో ఉపయోగకారి అని పేర్కొన్నారు. ఐ ఆర్_8 చాలా చక్కటి రకం వంగడమనీ, రెండెకరాల చెక్కనుంచి యీ ఏడాది ఎనభై బస్తాల ధాన్యం దిగుబడి కావచ్చని ఆశిస్తున్నాననీ అన్నారు. వివిధ పరపతి సంస్థలు యిచ్చే ఋణాలను గూర్చి చెప్తూ, యీ ఋణాలు రైతులకు ఎంతో ప్రయోజనకరంగా వున్నాయన్నారు. వెంకట్రామయ్య గారికి ముగ్గురు పిల్లలున్నారు. వారికి కుటుంబ నియంత్రణ మీద పూర్తి విశ్వాసం వుంది. దేశం అభివృద్ధి చెందాలంటే కుటుంబ నియంత్రణ తప్పనిసరి అని ఆయన అభిప్రాయం.

# వ్యవసాయ రంగంలో ఆంధ్రప్రదేశ్

—ఎస్. ఎస్. రావు

ఆంధ్రప్రదేశ్ అన్నపూర్ణగా పేరుపొందిన రాష్ట్రం. మన రాష్ట్రంలో ప్రవహించే జీవ నదులైన గోదావరి, కృష్ణా నదులు, యింకా ఉపనదులు మన భూములను సారవంతములు చేస్తున్నవి. ఎన్నికాటకాలు సంభవించినా మన రాష్ట్రంలో తిండిగింజలకు కొదవలేదు. ఇక్కడ సమృద్ధిగా ఆహారధాన్యాల ఉత్పత్తితో బాటు వాణిజ్య పంటలను కూడా బాగా పండిస్తున్నాం. ఆంధ్రప్రదేశ్‌లో పండే పంటలో 78½ శాతం ఆహార ధాన్యాలు, 21½ శాతం చెరుకు పొగాకు, ప్రత్తి, వేరుశనగ, పసుపు, మిర్చి మొదలగు వాణిజ్యపంటలు ముఖ్యమైనవి. వర్జీనియా పొగాకు ఉత్పత్తిలో మన రాష్ట్రం ప్రముఖపాత్ర వహిస్తున్నది. ఈ పొగాకువల్ల ఏటా 25 కోట్ల రూపాయల విలువగల విదేశీ మారక ద్రవ్యాన్ని మన దేశానికి సంపాదించి పెడుతున్నాం.

ప్రధానంగా మనది వ్యవసాయ రాష్ట్రం గనుక, వ్యవసాయ ఉత్పత్తికి అధిక ప్రాముఖ్యత యివ్వడం జరిగింది. 1955_56 సం॥ లో 55.33 లక్షల టన్నుల ఆహార ధాన్యాలు ఉత్పత్తి కాగా 1965_66 లో 89.86 లక్షల టన్నులు ఉత్పత్తి అయ్యాయి నూనెగింజలు, ప్రత్తి, చెరుకు పంటల ఉత్పత్తిని పెంచుటకు ప్రయత్నాలు జరుగుతున్నాయి. అంతే గాకుండా మన రాష్ట్ర ప్రభుత్వం 1960 సం॥ లో పేకేజి కార్యక్రమాన్ని ప్రారంభించింది. తీవ్రతర వ్యవసాయ కార్యక్రమాన్ని చేపట్టింది. ప్రత్యేకంగా కొన్ని ప్రాంతాలను ఎన్నుకొని నీటిసౌకర్యాన్ని కల్పిస్తూ ఆ యా ప్రాంతాలలో ఖరీఫ్, రాబీపంటలను రెండింటిని రెట్టింపు భూమి సాగు క్రిందకు తీసికొని రాబడినది. నాల్గవ ప్రణాళిక యింకా నిర్ధరంగా తేలక పోయినా, ఆ ప్రణాళికా కాలంలో అదనంగా 30 లక్షల ఎకరాలు సాగులోనికి తీసుకొని రావలయునని ఆలోచనలు సాగుతున్నవి. నాల్గవ ప్రణాళిక ముగింపు నాటికి మొత్తం ఒక కోటి 31 లక్షల ఎకరాల భూమిని సాగులోకి తెస్తారు. నాల్గవ ప్రణాళికలో వ్యవసాయ కార్యక్రమాలకు 101 కోట్ల 38 లక్షల రూపాయలు కేటాయించ వలసినదిగా మన రాష్ట్ర ప్రభుత్వం సూచిస్తున్నట్లు తెలుస్తున్నది. 1970_71 నాటికి ఆహార ధాన్యాల ఉత్పత్తి ఒక కోటి 12 లక్షల 23 వేల టన్నులకూ, నూనెగింజలు 13 లక్షల 75 వేల టన్నులకూ, ప్రత్తి 2 లక్షల 92 వేలకూ పెంచవచ్చునని అంచనా వేయబడుతున్నది. ఇటీవల జరుపుతున్న తీవ్రతరపరిశోధనల వల్ల వరి, జొన్న, కాయధాన్యాలలో ఎక్కువ దిగుబడి రకాలను రూపొందించి ఆంధ్రప్రదేశ్‌లో వ్యాప్తిలోనికి తీసికొని రావడం జరుగుతున్నది. తృతీయ ప్రణాళిక ముగింపు నాటికి వరి పంట క్రింద గల భూమిలో 95 శాతం మేలురకం వరి వంగడాల క్రిందకు తీసికొని రావడం జరిగింది. తత్ఫలితంగా మన రాష్ట్రంలో 10 లక్షల టన్నుల ఆహార ధాన్యాలు అదనంగా పండుటకు అవకాశము ఏర్పడినది.

అభివృద్ధి కార్యక్రమాలు నిర్విఘ్నంగా కొనసాగాలంటే ప్రజలు ప్రభుత్వానికి సంపూర్ణ సహకారాన్నివ్వాలి. ప్రతిగ్రామానికి ఒక ఉత్పత్తి ప్రణాళిక వుండాలి. ఉన్న నీటి పారుదల వసతులను పూర్తిగా వినియోగించడానికి కావలసిన ముఖ్యమైన విత్తనాలను గ్రామస్థాయిలో అధికంగా పండించుకునేందుకు, రసాయనిక ఎరువులను, పచ్చి ఎరువులను గ్రామంలో ఉత్పత్తిచేసి పంపిణీచేసేందుకు, తక్కువ కాలపు పరపతి లభించేటట్లు గ్రామపంచాయితీ సహకార సంఘాలు చూడాలి. రైతులకవసరమైన సప్లయిలను, వసతులను, సాంకేతిక సహాయాన్ని సమర్థవంతంగా సమాజ వికాస సంస్థలు ఏర్పాటు చేయాలి. అధికారులు, అనధికారులు గ్రామసౌభాగ్యం కోసం పాటుపడాలి.

## నీటి పారుదల పథకాలు

గత దశాబ్దంలో మనరాష్ట్రం ప్రకాశం బేరేజి, రాంపేరు• రాళ్లపాడు ప్రాజెక్టు, ఎగువ పెన్నానది ప్రాజెక్టు, భైరవతిప్ప ప్రాజెక్టుల వంటి భారీ ప్రాజెక్టులు, నారాయణపురం ఆనకట్ట, వేగవతి ఆనకట్ట, సీతానగరం ఆనకట్ట, పెద్దిగం ప్రాజెక్టు, నక్కలగండి ప్రాజెక్టు, పాలేరు_బిట్రగుంట కాలువ, దిగువ సీలేరు ప్రాజెక్టు, కోయిల్ సాగర్ ప్రాజెక్టు మొదలగు మధ్యతరహా ప్రాజెక్టుల నిర్మాణం చేపట్టడం జరిగింది. ఇంకా పోచంపాడు, వంశధార, రాజోలి బండ మళ్ళింపు పథకం వంటి భారీ ప్రాజెక్టులు వివిధనిర్మాణ దశల్లో వున్నాయి.

బృహత్తరమైన నాగార్జునసాగర్ ప్రాజెక్టు ఆంధ్రప్రదేశ్‌కి ఆశాజ్యోతి. 1955 డిసెంబరు 10న స్వర్గీయ ప్రధానమంత్రి శ్రీ జవహర్‌లాల్ నెహూరు యీ ప్రాజెక్టు నిర్మాణానికి పునాది రాయి వేస్తూ "దీనిని నేనొక పవిత్ర కార్యంగా భావిస్తున్నాను.

( తరువాయి 38వ పుటలో )





## బంగారము వంటి పంటలు పండించుకొంటె
## అవి మీ సిరిసంపదలకు శ్రీరామ రక్ష
## మీ పంట భూములు పచ్చగా ఉన్నాయంటే
## అది కూపర్ డీసెల్ పంపుసెట్టు పెట్టిన భిక్ష



# కూపర్
## డీసెల్ పంపుసెట్టు




పంటలు సమృద్ధిగా పండుతే, మీ చేతినిండా డబ్బు ఉంటుంది. మీ భూములకు కూపర్ డీసెల్ పంపుసెట్టుతో నీరు పెట్టుకొంటే మీ యిలు నిత్య కళ్యాణము పచ్చ తోరణముగా ఉంటుంది.

ప్రత్యేక లాభములు ● పొదుపు—తక్కువ నూనె ఖర్చు ● హెచ్చు పని—నిమిషమునకు హెచ్చు గాలనుల నీరు ● తేలికైనది—తీసుకొని పోవుట సులభము ● పెట్టుబడి తక్కువ—మామూలు డీసెల్ పంపుసెట్ల కన్న తక్కువ ఖర్చు.

**కూపర్ ఇంజినీరింగ్ లిమిటెడ్**

Shilpi-CE-17/68 Tel

# బలవర్ధకమైన పశుగ్రాసంతో అధిక పాల దిగుబడి

ఆంధ్రప్రదేశ్‌లో రెండుకోట్లకు పైగా పశువులు వున్నప్పటికీ తలసరి మనిషి పాలవాడకం రోజుకు 5 ఔన్సులు మాత్రమే వుంది. ఇది చాలా విచారకరమైన విషయం. మన పశువులకు బలవర్ధకమైన పశుగ్రాసాన్ని మనం యివ్వక పోవడంవల్లా, పాలిచ్చే పశువుల ఎడ మనం అశ్రద్ధ చేయడంవల్లా మనరాష్ట్రంలో పాల దిగుబడి చాలా తక్కువగా వుంటున్నది.

మన దేశంలో ఆవు సగటు పాల దిగుబడి 173 కిలో గ్రాములు, గేదె సగటు పాల దిగుబడి 491 కిలోగ్రాములువుంది. డెన్మార్కులోని ఆవు మన ఆవులకన్న పదిరెట్లూ;అమెరికా, ఆస్ట్రేలియాలోని ఆవులు అయిదురెట్లూ ఎక్కువ పాలను యిస్తాయి. మంచి ఆహారాన్ని యివ్వడంద్వారా మన ఆవుల పాలదిగుబడిని 60 శాతం పెంచవచ్చనీ, మేలురక్తం సంకరజాతి ఆవులవల్ల నాలుగు, లేక అయిదురెట్లు ఎక్కువగా పాలదిగుబడిని సాధించవచ్చనీ తేలింది. అయితే మన పశువులనుండి అధిక పాల దిగుబడిని సాధించడానికి మనం ఏ ఆహారాన్ని యివ్వాలి ?

ఒకవిధంగా ఆవు ప్రాణ సదృశమైన యంత్రం వంటిది. దాని కడుపులో మనం కొన్ని పదార్థాలను చేరవేస్తే, అవి దానిని పాలగా మార్చి తిరిగి మనకు యిస్తుంది. అందువల్ల దానికి మనం పెట్టే ఆహారంలో కొన్ని ప్రాథమికమైన అత్యవసర పదార్థాలు తగు పాళ్ళలో వుండాలి. అప్పుడే యీ ప్రాణంగల యంత్రం, వాటిని వెనువెంటనే పాలుగా మార్చడానికి వీలుంటుంది.

అయితే యీ ఆహారంలో కొంత భాగం తన శరీరాన్ని తాను పోషించుకోడానికి పశువుకు వుపయోగ పడుతుంది. అందువల్ల దాని పోషణకు, పాలదిగుబడికి-యీ రెండింటికి కూడా తగు పాళ్ళలో ఆహారం దానికి అవసరమౌతుంది.

సుమారుగా 363 కిలోగ్రాముల బరువుగల పశువుకు 25 కిలోగ్రాముల హైబ్రిడ్ నేపియర్‌గడ్డి, 2 కిలోగ్రాముల ఎండుగడ్డి కలగలిపియిస్తే పైన పేర్కొన్న విధంగా పశువుకు శరీర పోషణకూ, పాల దిగుబడికీ సరిపోతుంది. చలికాలంలో 8 నుంచి 12 కిలోగ్రాముల బర్సీమ్‌ను గాని, లేదా లూసర్న్‌నుగాని 4 కిలో గ్రాముల గడ్డిని కలిపియిస్తే చాలు. పచ్చిగడ్డి లేనపుడు 1.3 కి.ల. సాంద్రమిశ్రమాహారం ఎండుగడ్డితో కలిపి యివ్వవచ్చు. దీనికి తోడు ప్రతిరోజూ 20 గ్రాముల ఖనిజ మిశ్రమం పొడిని, 35 గ్రాముల ఉప్పును అందజేయాలి.

పశువులకు పెట్టే ఆహారాన్ని ప్రధానంగా మూడు రకాలుగా విభజించవచ్చు :

## 1. కసవు పదార్థాలు

పచ్చిరొట్ట, ఎండుగడ్డి, పాతరవేసిన గడ్డి-వీటిని కసవు పదార్థాలుగా పేర్కొంటారు. కాయధాన్యాలకు సంబంధించిన కలలములు చాలా చక్కటి కసవు పదార్థంగా భావిస్తారు. వీటిలో ఎక్కువ పరిమాణంలో మాంసకృత్తులు, ఖనిజ పదార్థాలు, విటమిన్లు వుంటాయి. అలసంద, లూసర్న్, పిల్లిపెసర, బర్సీమ్, జనుము-ఇవి సాధారణంగా కాయధాన్యాలకు సంబంధిన ఆహార పదార్థాలలో కొన్నిరకాలు. మంచిరకం లూసర్న్‌నుగాని, బర్సీమ్‌ను గాని ఆవుకు ఆహారంగా యివ్వడం వల్ల సమగ్ర ఆహారాన్ని అధికంగా పెట్టకుండానే 10 కిలోల వరకు పాలను యిస్తుంది. 30 నుంచి 40 కిలోల పారాగడ్డినిగాని, గునియాగడ్డినిగాని ఆహారంగా పెడితే, ఆవు శరీరపోషణకు తగినంతగా ఆ ఆహారం వుపయోగింపబడి పైపెచ్చు 5 కిలోల పాలను యివ్వడానికికూడా సరిపోంది.

## 2. సమగ్ర ఆహారం

తృణ ధాన్యాలు, నూనెపిట్టులు, యింకా చేప పొట్టు, వెన్నతీసినపాలు-యివి సమగ్ర ఆహారంలోకొన్ని. మొక్కజొన్న గింజలు, జొన్న, గోధుమ ధాన్యం, పప్పుధాన్యాలు, చెరకు మడ్డి-యివి మంచిశక్తిని కలిగించే ఆహారం. మొక్కజొన్న వీటన్నిటిలో శ్రేష్టమైనది. అయితే నాలుగైదు రకాల కాయ ధాన్యాలను కలిపి పెడితే చాలా మంచిది. కొబ్బరిపిట్టు, ప్రత్తి గింజలపిట్టు, వేరుశనగ పిట్టు, పప్పుధాన్యాలు, బఠాణీ మొదలైనవి సర్వ సాధారణమైన ఆహార పదార్థాలు. పిండిమిల్లులో, బియ్యపుమిల్లుల్లో తవుడు,చిట్టు మొదలగునవికూడా సమగ్ర ఆహారంగా పేర్కొంటారు.

## ఖనిజ మిశ్రమాలు

ఈ మిశ్రమాలలో ఉప్పు, కాల్షియం, ఫోస్పరస్ ప్రధానంగా వుంటాయి. ఇవి ఎముకలు, శరీరం బాగా ఎదగడానికి తోడ్పడతాయి. పశువులకు ఒక డజను వివిధ ఖనిజాలు అవసరముంటుంది. పశువులకు కావలసిన ముఖ్యమైన ఖనిజాలు-కాల్షియం,

ఫోస్ఫరస్, మెగ్నీషియం, ఐరన్, కాపర్, సోడియం. కాయ ధాన్య సంబంధమైన ఆకులలములలో కాల్షియం, ఐరన్, కాపర్ పుష్కలంగా వుంటాయి.

## విటమినులు

కసవు, పచ్చిరొట్ట తినే పశువులకు విటమినులు విడిగా అక్కరలేదు. అయితే కొన్నిపరిస్థితులలో పాలిచ్చే వాటికి 'ఎ' 'డి' విటమినులుగల ఆహారాన్ని యివ్వవలసి వుంటుంది.

## ఆహారపు నిష్పత్తులు

363 కి.గ్రా. బరువుగలిగి రోజుకు 7.25 కి.గ్రా. పాలను యిచ్చే ఆవుకు ఈ క్రింది ప్రకారం ఏ ఒక్క నిష్పత్తిలోనైన ఆహారాన్ని యివ్వవలసి వుంటుంది.

| | | |
|---|---|---|
| 1. | పచ్చి మొక్కజొన్న | 29.5 |
| | అలసంద | 11.5 |
| 2. | పచ్చిజొన్న | 27.0 |
| | అలసంద | 13.6 |
| | బూసా | 0.9 |
| 3. | పారాగడ్డి | 36.3 |
| | బూసా | 1.8 |
| 4. | హైబ్రిడ్ నేపియర్ | 41.00 |
| | వేరుశనగ పిట్టు | 0.45 |
| | బూసా | 2.20 |
| 5. | గుయినాగడ్డి | 36.03 |
| | కొబ్బరిపిట్టు | 1.03 |
| 6. | జొన్న సైలేజి | 13.06 |
| | ఎండుగడ్డి | 4.01 |
| | వేరుశెనగపిట్టు | 1.03 |

(35వ పుటనుండి)

## వ్యవసాయరంగంలో ఆంధ్రప్రదేశ్

ఇది భారత మానవతా దేవాలయానికి పునాదిరాయివేయడం వంటిది. భారత దేశం అంతటా మనం నిర్మించుకొనే నూతన దేవాలయాలకు యిది చిహ్నం" అని అన్నారు. "బాలచంద్రుని కదన కౌశలము కథల్ల శ్రీనాథ కవిరాజు చంద్రవంకకు జెప్ప ఎద కరిగి ప్రవహించెరా పలనాట ఎత్తిపోతల దూకెరా" అనాటి యుద్ధ వీరుల శౌర్యం ఎత్తిపోతల ప్రతిరూపమైతే ఈనాటి ప్రజానాయకుల దృఢ సంకల్పానికి, ఇంజనీర్ల ప్రతిభకూ ప్రత్యక్ష సాక్ష్యం నాగార్జునసాగర్. ఆనాటి సైనికుల రక్తం ఎత్తిపోతల జలపాతమైతే ఈనాటి కర్షక కార్మికుల స్వేద బిందువులు నాగార్జునసాగర్. దేశం ఆహార రంగములో స్వయం సమృద్ధిని సాధించేందుకు చేసే పోరాటంలో ఈ ఆనకట్ట ప్రధానపాత్ర వహిస్తుంది. ఈ ఆనకట్ట నుండి సాగు నీటిని విడుదల చేయటం కూడా జరిగింది. ఈ ప్రాజెక్టు పనిని త్వరిత గతిని పూర్తి చేయుటకు మన రాష్ట్ర ప్రభుత్వం ఎనలేని కృషి సాగిస్తున్నది. కాని ఆర్థిక యిబ్బందుల వల్ల వేగంగా నడప లేకపోతున్నది. ఇందుకు బాధ్యత కేంద్ర ప్రభుత్వానిదే. కేంద్రం నుంచి మంత్రులు హైద్రాబాద్ వచ్చినప్పుడల్లా నాగార్జునసాగర్‌ను దర్శిస్తారు. బ్రహ్మాండమైన ప్రాజెక్టుగా వర్ణనలు చేస్తారు. వర ప్రసాదంగా భావిస్తారు. ఎంతగానో శ్లాఘిస్తారన్నమాటేగాని రాష్ట్ర ప్రభుత్వానికి తగిన ఆర్థిక స్తోమత కలిగించుటకు ప్రయత్నిస్తున్నట్లు తోచదు. ఇది శోచనీయం. ఈ ప్రాజెక్టు పూర్తి అయితే 35 లక్షల ఎకరాలకు సేద్యపు నీరు లభిస్తుంది. సాలుకు 15 లక్షల టన్నుల ఆహార ధాన్యాలు, 50,000 టన్నుల పంచదార అదనంగా ఉత్పత్తి అవుతాయి. 4,00,000 కిలోవాట్ల విద్యుచ్ఛక్తి ఉత్పత్తిఅవుతుంది. ఇట్టి అద్భుతావహమైన చరిత్ర గలిగిన ప్రాజెక్టును వేగంగా పూర్తి చేయుటకు కేంద్ర ప్రభుత్వం సహాయపడితే దేశం "సుఫలాం, సుజలాం, సస్యశ్యామలంగా" వుంటుంది. ఆంధ్ర రైతాంగం పుష్కలంగా ఆహార ధాన్యాలు పండించి దేశానికంతకూ సప్లయి చేస్తారు

### రైతులకు ప్రభుత్వ బహుమతులు

వ్యవసాయ ఉత్పత్తులు పెరగడానికి రైతుల స్థితిగతులను అభివృద్ధి పరచవలసిన ఆవశ్యకత కలదని రాష్ట్ర వ్యవసాయ మంత్రి శ్రీ పెద్దిరెడ్డి తిమ్మారెడ్డి అభిప్రాయ పడ్డారు. ఆయన ఫిబ్రవరి 2న పారిశ్రామిక ప్రదర్శనలో అధిక దిగుబడిని సాధించిన రైతులకు ప్రభుత్వ బహుమతులను పంచారు. ఈ కార్యక్రమానికి ఆయన అధ్యక్షత వహించారు.

వరిపంటలో కర్నూలుజిల్లా ఎమ్మిగనూరు తాలూకారైతు శ్రీ ఆర్. పురుషోత్తమరెడికి, చెరుకుపంటలో పశ్చిమ గోదావరిజిల్లా తాడిపర్రురైతు శ్రీ జి. ఎస్. రామారావుకు బహుమతులు లభించాయి. గోకులపాడుకు చెందిన శ్రీ ఎం. రాముడు అనేరైతు వేరుశనగపంటకు, జీడిమెట్ల రైతు శ్రీ పెద్ది సోమరాజు ద్రాక్షపంటకు, శ్రీ శివరాజు నివహన (ఆదిలాబాద్ జిల్లా) జొన్నపంటకు ప్రభుత్వ బహుమతులు లభించాయి.

# కుటుంబ నియంత్రణ :

# జనాభా పెరుగుదల నివారణకు అపూర్వ కార్యక్రమం

### తనకుతానే వేసక్టమి శస్త్రచికిత్స జరుపుకున్న డాక్టరు

చిత్తూరు జిల్లా వైద్య శస్త్ర చికిత్సా విభాగానికిచెందిన డా॥ వి. ఎస్. మారుతిరాయలు యిటీవల యితరుల సహాయం లేకుండా తనకు తనే వేసక్టమీ శస్త్రచికిత్సను జరుపుకున్నారు.

శ్రీ మారుతిరాయలు ఓ కుర్చీలో కూర్చుని, అవసరమైన శస్త్రపరికరాలనన్నీ ఎదురుగా పెట్టుకుని, చాలాసునాయాసంగా యిరువైఏషలా శస్త్రచికిత్సను జరుపుకున్నారు దీనికి యిరవై నిమిషాలు పట్టింది. వీరికి నలుగుపిల్లలు వున్నారు. వీరు గత మూడేళ్ళుగా చిత్తూరు జిల్లాలో వేసెక్టమీ శస్త్రచికిత్సలను జరుపుతున్నారు. ఇంతవరకు సుమారుగా వీరు 3000 వేసక్టమీ శస్త్ర చికిత్సలను జరిపారు.

ఈ దేశంలో కుటుంబ నియంత్రణ కార్యక్రమ మంతటి విస్తృత కార్యక్రమం ప్రపంచ చరిత్రలో ఇంతకు ముందెన్నడూ ప్రారంభించబడలేదు. వైద్య సర్వీసులు, ఆరోగ్య సర్వీసులు, సంక్షేమ సర్వీసుల చరిత్రలోనే ఇది అపూర్వమైనది.

మన సాంప్రదాయం ప్రకారం వ్యక్తియొక్క వ్యక్తిగత నడవడిని గురించి బహిరంగంగా చర్చించటం నిషేధించబడింది. అయితే ఇప్పుడు దీనిలో మార్పు రావటం గమనార్హమైన విషయం. వ్యక్తిగత నడవడిని స్వచ్ఛందంగా మార్చుకోడానికి చర్యలు తీసుకోటాన్ని ఆహ్వానించటం, అందువలన సాంఘికంగా కలిగే ఫలితాలు గుర్తించటం ఇప్పుడు జరుగుతున్నది

## ప్రజోత్సాహం

కుటుంబ నియంత్రణ కార్యక్రమాలలో ప్రజలు ప్రదర్శిస్తున్న ఉత్సాహం ఆశ్చర్యాన్ని కలిగిస్తున్నది. ఈ కార్యక్రమాలలో ప్రజలు ఎంత ఉత్సాహం ప్రదర్శిస్తున్నదీ పత్రికలూ, సమావేశాలలో చర్చలూ, ప్రచార సాధనాలద్వారా విశదమౌతున్నది. మన సంఘంలో ప్రముఖ సాంఘిక మార్పుకు ఇది నాంది అని దీనినిబట్టి తెలియగలదు. ఆర్థిక బాధలవలననూ, పరిమిత సంతానం వలన కుటుంబం ఎంతగా సుఖపడేదీ, ఎంతగా క్షేమంగా వుండేదీ నచ్చచెప్పటం వలననూ పరిమిత కుటుంబం యొక్క ప్రయోజనాలను ప్రజలు ఎక్కువగా గ్రహిస్తున్నారు.

సుమారు పది కోట్ల నుండి దంపతుల వ్యక్తిగత ప్రవర్తనకు సంబంధించిన కార్యక్రమ విధానం, సామాన్యంగా ప్రజలందరికీ సంబంధించిన కార్యక్రమ విధానం వేర్వేరుగా వుండక తప్పదు. రోగులే సర్వీసులకొరకు వెతుక్కోవాలనే వైద్య కార్యకర్తలు, ప్రజారోగ్య కార్యకర్తల సాంప్రదాయ సిద్ధమైన దృక్పథానికి వ్యతిరేకంగా ఇది వుంటుంది. ప్రజలు సర్వీసుల కొరకు వెతుక్కోకుండా కుటుంబ నియంత్రణ సిబ్బందే సర్వీసులు అవసరమైన వ్యక్తులను వెతికి పట్టుకొని ఆ సర్వీసులు సమ్మతించేటుగా వారిలో ఆ ఉత్సాహం కలిగించడమే కొత్త విధానం.

## బ్రహ్మాండమైన సమస్య

ప్రణాళికా బద్ధమైన అభివృద్ధి ప్రారంభమైనప్పటినుంచి ఈ దేశంలో జాతీయ ఆదాయం నూటికి 64 వంతులు పెరగా తలసరి ఆదాయం నూటికి 21 వంతులు మాత్రమే పెరిగిందన్న దాన్ని బట్టి జనాభా పెరుగుదల సమస్య ఎంత బ్రహ్మాండమైందో గ్రహించవచ్చును. అదేవిధంగా విద్యా సౌకర్యాలు నూటికి 300 వంతులు అభివృద్ధి జెందగా 6 కోట్ల 39 లక్షల మంది బాలలకు ఇంకా పాఠశాల సౌకర్యం లేకుండావుంది. సుమారు 3 కోట్ల 13 లక్షలు ఉద్యోగాలు అదనంగా సృష్టించబడినాయి. అయినప్పటికీ సుమారు ఒక కోటి మందికి ఉద్యోగం లేకుండా వుంది. ఇటువంటి పరిస్థితిలో జనాభా పెరుగుదలను అరికట్టటానికి తీవ్ర చర్యలు తీసుకోనక తప్పదు.

## పెద్ద సవాలు

కుటుంబ నియంత్రణ కార్యక్రమాన్ని దేశ వ్యాప్తంగా అమలుపరచవలసి వున్నందున ఇవి ముఖ్యంగా, సర్వీసులు సమకూర్చే విషయంలో పెద్ద సవాలును యెదుర్కోవలసి వుంటుంది. గ్రామీణ ప్రాంతాలన్నిటిలోను వైద్య సహాయంలేదు. 45 గ్రామాలకు, లేదా 27 వేల మంది గ్రామస్తులకు ఒక అల్లోపథిక్ డాక్టరు; 26 గ్రామాలకు, లేదా 21 వేల గ్రామస్తులకు ఒక హోమియోపథిక్ ప్రాక్టీషనరు, 21 గ్రామాలకు, లేదా 12,699 మంది గ్రామస్థులకు ఒక ఆయుర్వేదిక్ ప్రాక్టీషనర్ వున్నారన్న దాన్నిబట్టి ఈ విషయం విశదమౌతుంది. అందువలన దేశీయ వైద్య విధానాలను, అధునాతన వైద్య విధానాన్ని అనుసరించే వైద్యులందరినీ దీనిలో పాల్గొనేట్టు చేయటానికి కృషిచేయవలసి వుంది. వారికి ప్రజలతో సంబంధముంటుంది కాబట్టే ప్రజలకు వారిమీద నమ్మకం వుంది. కాబట్టి, కుటుంబ నియంత్రణ పాటించేట్టు ప్రజలలో ఉత్సాహం కలిగించటానికి వారు ఇతోధికంగా తోడ్పడగలరు. అందుకే అధునాతన వైద్య విధానం అనుసరించే వైద్యులు, హోమియోపతి వైద్యులు, దేశీయ వైద్య విధానం అనుసరించే వైద్యులు—వీరి తాలూకు సంఘాల ప్రతినిధులకు ఈ కార్యక్రమంతో సంబంధం యేర్పాటు చేయబడింది. దేశంలో 96 వేల మంది వైద్యులకు శిక్షణ యిచ్చే బాధ్యత ఇండియన్ మెడికల్ అసోసియేషన్ స్వీకరించింది.

## స్వచ్ఛంద సంస్థలు

దేశంలో పాతుకుపోయిన వృత్తి సంబంధంకాని సంస్థలకు ఈ కార్యక్రమంతో సంబంధం యేర్పాటు చేయబడింది. సంఘ క్షేమానికి పాటుబడాలనే ప్రజల ఉత్సాహం వలననే స్వచ్ఛంద సంస్థలు ఉద్భవిస్తాయి. అటువంటి సంస్థలన్నింటినీ ఈ కార్యక్రమంలో పాల్గొనేట్టు చేస్తున్నారు. ఈ విషయంలో ఇప్పటి కప్పుడే అనేక చర్యలు తీసుకోబడినాయి. రెడ్‌క్రాస్, రోటరీక్లబ్బు, లైన్స్ క్లబ్బు వాణిజ్య మండలులు, జూనియర్ మండలులు మొదలైనవాటిని ఈ కార్యక్రమ కార్యకలాపాలను చేపట్టేటుగా ప్రోత్సహిస్తున్నారు.

## శిబిరాలు

ఈ సమస్య ఆవశ్యకతను గుర్తించి ఈ కార్యక్రమం కింద, ప్రజలు సులభంగా చేరుకోటానికి వీలైన కేంద్ర ప్రదేశాలలో ఈ సౌకర్యాలు లభ్యమయ్యేట్టు చేయడానికి కృషి జరుగుతున్నది. అందుకే శిబిరాలు యేర్పాటు చేసే విధానం, లేదా సంచార శకటాలు యేర్పాటుచేసే విధానం రూపొందించబడింది. ఈ సౌకర్యాలను వినియోగించుకునే ప్రజలు ప్రయాణ ఖర్చులను భరించవలసివుంది. జీతం నష్టపోవలసి వుండటంతో ఈ కార్యక్రమం క్రింద హారికి చిల్లర ఖర్చుల కింద కొంత మొత్తం ముట్టచెప్పబడుతుంది. అయితే, ఈ సర్వీసులు విస్తృతి చెంది, చుట్టు ప్రక్కల ప్రాంతాలకుకూడా వాటిని విస్తరింప చేయబడిన పుడు, అటువంటి ఖర్చులకు డబ్బు యివ్వవలసిన అవసరం క్రమక్రమంగా తగ్గగలదు.

## కుటుంబ నియంత్రణ కార్యక్రమాలు

జనాభా విపరీతంగా పెరిగిపోవడం వల్ల అనేక దుష్ఫలితాలు కలుగుతాయి. ఇందువల్ల మనలో ప్రతి ఒక్కరూ ఇబ్బందులు ఎదుర్కోవలసి వస్తుంది. ప్రపంచం విస్తీర్ణంలో మనదేశ విస్తీర్ణం 2.4శాతం మాత్రమే. కాని ప్రపంచం మొత్తం జనాభాలో 14 శాతంప్రజలు భారత దేశంలోనే ఉన్నారు. మరోలా చెప్పాలంటే ప్రపంచ జనాభాలో ప్రతి ఏడుగురిలోనూ ఒకడు భారతీయుడు. మనదేశ జనాభా 52 కోట్లకు మించింది. ప్రపంచంలో చైనా తర్వాత ఇంత ఎక్కువ జనాభాగల దేశం భారతదేశం.

దేశంలో రోజుకు జననాల సంఖ్య 55,000. అంటే ప్రతి ఒకటిన్నర సెకండ్లకు ఒకరు చొప్పున పిల్లలసంఖ్య పెరుగుతున్నది. మన దేశంలో జననాల సంఖ్య ఇలా పెరగడం కారణంగా ప్రపంచ జనాభా ఏటా 130 లక్షలు పెరుగుతున్నది. ఇది బృహత్తరమైన సమస్య. ఈ సమస్యా పరిష్కారానికి పెద్ద ఎత్తున కృషి జరగవలసి ఉన్నది. ఇందువల్లనే ప్రభుత్వం జాతీయ స్థాయిలో కుటుంబ నియంత్రణ కార్యక్రమాలను శీఘ్రంగా అమలుపరచడానికి పూనుకొన్నది. కుటుంబాన్ని పరిమితం చేసుకోవలసిన అవసరం గురించి ప్రజలకు నచ్చచెప్పడంలోను, కుటుంబ నియంత్రణ పద్ధతులు అవలంబించడానికి ప్రజలను ప్రోత్సహించడంలోనూ స్వచ్ఛంద సంస్థలు, ఇతర వ్యక్తులు సహకరిస్తే జనాభా విపరీతంగా పెరిగిపోకుండా నివారించేందుకు కట్టుదిట్టమైన చర్యలు తీసుకోడానికి వీలు అవుతుంది. స్వచ్ఛంద సంస్థలు—అందులోనూ ముఖ్యంగా వైద్యరంగంలో కృషి చేస్తున్న సంస్థలు—తమంతట తాముగా ముందుకు వచ్చి చేయూతనిస్తే కుటుంబ నియంత్రణ కార్యక్రమాలు అతి శీఘ్రంగా అమలుపరచడానికి అవకాశం కలుగుతుంది. జాతీయ స్థాయిలో జరుగుతున్న భారత క్రైస్తవ వైద్య సంఘం ప్రముఖపాత్ర వహిస్తుంది ఈ సంఘానికి ప్రధాన కార్యస్థలం బెంగుళూరు.

దేశంలో కుటుంబ నియంత్రణ కార్యక్రమాలు అమలు పరచడానికి తోడ్పడేందుకు తమ అజ్మాయిషీ క్రింద ఉన్న ప్రొటెస్టెంట్ క్రైస్తవ వైద్యాలయాలకు ప్రోత్సాహంకల్పించేందుకు ఈ సంఘం ప్రత్యేక పథకం ఒకటి రూపొందించింది. ఈ పథకం 1966 లో ప్రారంభమైన నాటినుంచి ఈ సంఘం అజ్మాయిషీ క్రింద గల 400 వైద్యాలయాలలోనూ 200కు పైగా వైద్యా

లయాలలో కుటుంబ నియంత్రణ కార్యక్రమాలు అమలుపరచ డానికి కృషి జరుగుతున్నది. ఈ పథకం క్రింద శస్త్రచికిత్స చేయడానికి అవసరమైన వైద్యపరికరాలు ఇతర సాధన సామగ్రిలు, లూప్‌లు, గర్భనిరోధం నిమిత్తం వాడే ఔషధాలు, కుటుంబ నియంత్రణకు సంబంధించిన వివిధ విషయాలు తెలియ చేసే చిన్న పుస్తకాలు, కరపత్రాలు మొదలైనవన్నీ వైద్యాలయాలకు సరఫరా అవుతున్నాయి. ఈ వైద్యాలయాలలో ప్రజలకు అవసరమైన సౌకర్యాలు కలిగించడం జరుగుతున్నది. ఈ వైద్యాలయాలలో పురుడుపోసుకొన్న వారికీ, ఆరు సంవత్సరాలలోపు వయసుకల పిల్లలకూ పుష్టికరమైన ఆహారం కూడా సరఫరా చేస్తున్నారు.

ఈ సంఘం తాలూకు వైద్యాలయాలలోనూ, ఇతర వైద్యాలయాలలోనూ పనిచేస్తున్న ఉద్యోగులకు కుటుంబ నియంత్రణకు సంబంధించిన వివిధ విషయాలు తెలియ చేయడానికి, ఈ రంగంలో శిక్షణ ఇవ్వడానికిగాను, ఢిల్లీ, గౌహతి, బొంబాయి, ఇండోర్, భువనేశ్వర్, హైదరాబాద్, కొట్టాయమ్, బెంగుళూరులలో ఎనిమిది సంచార కేంద్రాలు ఏర్పాటు అయాయి. వీటిలో ఒక్కొక్క కేంద్రం తాలూకు సిబ్బంది రెండు మూడు రాష్ట్రాలలో పనిచేయడం జరుగుతున్నది.

ఈ సంఘంతాలూకు వైద్యాలయాలలో జరిగిన కృషిఫలితంగా లూపులు ధరించడం, సంతాన నిరోధం నిమిత్తం స్త్రీ పురుషులు శస్త్రచికిత్స చేయించుకోవడం వల్ల అయితేనేమి దాదాపు 60 వేల మంది కుటుంబ నియంత్రణ పద్ధతులు అవలంబిస్తున్నారు, ఈ సంఘం తలపెట్టిన పథకం అమలుపర్చడానికి రూ 26 లక్షలకు పైగా ఖర్చు అయింది. ఈ ఖర్చు భరించడానికి ప్రపంచంలో వివిధ ప్రాంతాలనుండి ఆర్థిక సహాయం అందింది. దేశంలో ప్రొటెస్టెంట్ క్రైస్తవ వైద్యాలయాలలో మొత్తం 43,000పైగా పడకలున్నాయి. ఈ వైద్యాలయాలద్వారా ఏటా నాలుగు కోట్ల మందికి పైగా వైద్యసహాయం అందజేయబడుతున్నది.

కుటుంబ నియంత్రణ రంగంలో పనిచేస్తున్న ఉద్యోగులు అందరికీ శిక్షణ ఇవ్వడానికి ఈ పథకం ద్వారా ఇతోధికావకాశాలు కల్పించారు.

ఇలాగే ఇంకా అధిక సంఖ్యలో స్వచ్ఛంద సంఘాలు, సంస్థలు ముందుకు వచ్చి కుటుంబ నియంత్రణ కార్యక్రమాలను గురించి ప్రజలకు అన్ని విషయాలూ తెలియ చేయడానికీ, కుటుంబ నియంత్రణ పద్ధతులు అవలంబించేందుకు ప్రోత్సాహం కల్పించ డానికీ కృషి చేస్తే మనం పెటుకొన్న లక్ష్యాలు సాధించడం సులభతరం అవుతుంది.

## ఆంధ్రప్రదేశ్ సాధించిన విజయం

ప్రస్తుతం జరుగుతున్న సంవత్సరంలో ఏప్రిల్ నుంచి జూన్ వరకు, ఆ మూడు నెలలలోనూ 164.4 శాతం విజయం సాధించి ఆంధ్రప్రదేశ్‌లోని కర్నూలుజిల్లా సంతాననిరోధానికి శస్త్ర చికిత్సజరిపే కార్యక్రమం అమలుజరపడంలో ప్రథమస్థానం పొందింది.

అనంతపురంజిల్లా 121 శాతం, తూర్పు గోదావరిజిల్లా 90.3 శాతం విజయం సాధించి వరుసగా ద్వితీయ, తృతీయ స్థానాలు పొందాయి.

ఈ మూడు నెలల కాలంలోనూ తూర్పు గోదావరిజిల్లాలో సుమారు 10,270పైగా సంతాన నిరోధానికి శస్త్ర చికిత్సలు జరిగాయి.

లూప్ అమర్చే కార్యక్రమం అమలుజరిపే విషయంలో కరీంనగర్ జిల్లా పై సమీక్షాకాలంతో 169.7 శాతం విజయం సాధించి ప్రథమస్థానం గడించింది.

ఈ కాలంలో ఈ జిల్లాలో 1188 మందికి లూప్‌లు అమర్చబడినాయి. అనంతపురం జిల్లాకు ద్వితీయస్థానం, వరంగల్ జిల్లాకు తృతీయస్థానం లభించాయి.

సంతాన నిరోధానికి శస్త్ర చికిత్స జరిపే కార్యక్రమం ప్రారంభించినప్పటినుంచి 1968 సెప్టెంబరు ఆఖరువరకు మొత్తం 61,871 మందికి శస్త్ర చికిత్సలు జరపబడినాయి. ఈ కాలంలో లూప్‌లు అమర్చబడిన వారిసంఖ్య 1,10,753.

## రాష్ట్రంలో జరుగుతున్న కృషి

రాష్ట్రంలో జనాభా విపరీతంగా పెరిగిపోకుండా నివారించేందుకు కృషి జరుగుతున్నది. జననాలసంఖ్య వెయ్యింట సుమారు 37 నుంచి 25 కు తగ్గించడంద్వారా ఈ లక్ష్యం సాధించాలని ఉద్దేశిస్తున్నారు. దేశంలో ఇది నాల్గవ పెద్ద రాష్ట్రం. 1937 సంవత్సరాంతానికి ఈ రాష్ట్ర జనాభా 4 కోట్లు మించింది. 1961లో రాష్ట్ర జనాభా 3 కోట్ల 60 లక్షలు. 1981 నాటికి రాష్ట్ర జనాభా 5 కోట్ల 28 లక్షలకు చేరగలదని అంచనా. అందువల్ల రాష్ట్రంలో అన్ని ప్రాంతాలలోనూ కుటుంబ నియంత్రణ కార్యక్రమాలను అమలు జరపడం జరుగుతున్నది. కుటుంబ నియంత్రణ వ్యవహారాల జిల్లా కార్యాలయాలు ఏర్పాటు అయాయి. వైద్యులు, వైద్యశాఖ తాలూకు ఇతర ఉద్యోగులు 1968-69లో సాధించవలసిన లక్ష్యాలనుకూడా నిర్ణయించడం జరిగింది. 1968-69లో మొత్తం అయిదు లక్షల

మందికి సంతాన నిరోధం నిమిత్తం శస్త్రచికిత్స చేయించడం లక్ష్యంగా పెట్టుకొన్నారు.

1965_66లో రాష్ట్రప్రభుత్వం గ్రామ, పట్టణప్రాంతాలలో కుటుంబ నియంత్రణ కార్యక్రమాలను పునర్వ్యవస్థీకరించ వలసిందిగా ఆదేశించింది. కుటుంబ నియంత్రణ కార్యక్రమాలు అమలుపరచడానికి అదనపు సిబ్బందిని నియమించడం జరిగింది. పట్టణ ప్రాంతాలలో ప్రతి 50 వేలమందికి ఒకటి చొప్పున, గ్రామ ప్రాంతాలలో ప్రతి 80 వేల మందికి ఒకటి చొప్పున కుటుంబ నియంత్రణ, సంక్షేమ కేంద్రాలు నెలకొల్పాలని ఉద్దేశింపబడింది. గ్రామీణ కుటుంబనియంత్రణ కేంద్రానికి అనుబంధంగా ప్రతి 20 వేల మందికి ఒకటి చొప్పున మూడు ఉపకేంద్రాలు ఏర్పాటు అయ్యాయి. ఈ రంగంలో ప్రచారంచేయడానికి ప్రచారకులను, ఆరోగ్యశాఖ పర్యవేక్షకులను, ఆరోగ్యశాఖ తనఖీ అధికారులను, సంఘసేవకులను నియమించడం జరిగింది.

ద్వితీయ పంచవర్షప్రణాళిక ఆఖరునాటికి గ్రామప్రాంతాలలో 170 కుటుంబ నియంత్రణ సంక్షేమకేంద్రాలు ఏర్పాటు అయ్యాయి. తృతీయ ప్రణాళికా కాలంలో ఇటువంటి మరో 136 కేంద్రాలు నెలకొల్పబడ్డాయి.

ఈ రంగంలో పనిచేసేవారికి శిక్షణ విషయమైకూడా రాష్ట్రప్రభుత్వం తగిన శ్రద్ధవహించింది. 1966_67లో కేంద్ర ప్రభుత్వ సలహాపై ప్రధాన వైద్యాలయాలకు అనుబంధంగా ఉన్న నాలుగు శిక్షణ కేంద్రాలస్థాయిని పెంచడం జరిగింది. కుటుంబ నియంత్రణ కార్యక్రమాలను అమలు పరచడానికి ఉద్దేశించిన ఉద్యోగులలో ఏటా 90 మందికి చొప్పున ఈ కేంద్రాలలో శిక్షణ ఇస్తున్నారు. ఇప్పటివరకు దాదాపు 2400 మంది ఇటువంటి శిక్షణ పొందారు. రాష్ట్రస్థాయిలో ఏర్పాటైన కుటుంబనియంత్రణ వ్యవహారాల కార్యాలయం కుటుంబ నియంత్రణ అవలంబించ డానికి ఉపయుక్తమయ్యే సాధనాలనూ, ఔషధాలనూ జిల్లా కార్యాలయాలకు సరఫరా చేస్తున్నది. ఈ కార్యాలయాలనుంచి అవసరాల మేరకు వివిధ పట్టణాలు, గ్రామాలలోని కుటుంబ నియంత్రణ కేంద్రాలకూ, ఇతర స్వచ్ఛంద సంస్థలకూ వీటిని సరఫరాచేయడం జరుగుతున్నది. వీటిని గ్రామీణులకు సరఫరా చెయ్యడానికి ఇతర ఏర్పాటుకూడా జరిగాయి. ఇంతేకాక ఇంపీరియల్ పొగాకు కంపెనీ, వజీర్‌సుల్తాన్ పొగాకు కంపెనీలవంటి పొగాకు కంపెనీల సహకారంతో రాష్ట్రంలో అన్ని కిళ్లీదుకాణాల ద్వారా తొడుగులు పంపిణీ అయ్యేందుకు రాష్ట్ర ప్రభుత్వం ఏర్పాటు చేసింది.

## హైదరాబాదులో

కుటుంబ నియంత్రణ కార్యక్రమాలను అమలు జరపడంలో హైదరాబాద్ నగర పాలక సంస్థ గణనీయమైన కృషి జరిపింది. 1968 ఏప్రిల్_ డిసెంబర్ నెలల మధ్య కాలంలో ఈ సంస్థ ఆధ్వర్యాన, సంతాన నిరోధానికి గాను 9,832 మంది పురుషులకూ, 1699 మంది స్త్రీలకూ శస్త్రచికిత్స జరిగింది. 1196 మంది స్త్రీలు లూప్‌లు వేయించుకున్నారు. ఒక్క బేగంబజార్ కుటుంబ నియంత్రణ కేంద్రంలోనే, 2,733 మంది పురుషులకు శస్త్రచికిత్స జరిగింది. ఈ విషయంలో, అనుకున్న లక్ష్యానికి మూడు రెట్ల పని ఈ కేంద్రంలో జరిగినట్లయింది.

నగరం మొత్తం మీద కుటుంబ నియంత్రణ కేంద్రాలు 25 పని చేస్తున్నాయి. నగర పాలక సంస్థ, రాష్ట్ర ప్రభుత్వమూ, ఆంధ్రప్రదేశ్ కుటుంబనియంత్రణ వ్యవహారాల సంస్థ, రెడ్‌క్రాస్ సంఘం వంటి స్వచ్ఛంద సంస్థలూ, ఈ కేంద్రాలను నెలకొల్పి నడుపుతున్నాయి. ఈ కేంద్రాలద్వారా జరిగిన కృషిఫలితంగా 1967 లో అసలీ కార్యక్రమం ఆరంభమయినప్పటి నుంచీ 25,000 మందికి పైగా ప్రజలు సంతాన నిరోధానికై కుటుంబనియంత్రణ విధానాలలో తమకు ఇష్టం వచ్చిన వాటిని అనుసరించడానికి పూనుకున్నారు.

# సుఖసంతోషాలకు నిలయం పరిమిత కుటుంబం

# విశ్వ విద్యాలయాలు : రాజకీయాలు

—వి. వి. గిరి

నేటి విద్యార్థి సమాజాన్ని, ముఖ్యంగా ఉన్నత విద్యా సంస్థలకు చెందిన విద్యార్థి లోకాన్ని – అవిధేయతా లక్షణం పట్టి పీడిస్తున్నట్లు బయటనుండి గమనించే వారికి కనిపించవచ్చు. కాని, తీవ్ర ఆశావాదిని కావడంతో, యూనివర్శిటీ విద్యార్థుల, అధ్యాపకుల సహజసిద్ధమైన ప్రతిభాగుణసంపత్తిలో నాకున్న మొండి నమ్మకము మాత్రం చెక్కు చెదరలేదు. సరికదా దినదినానికి పెరుగుతునే వుంది. తగిన సదుపాయాలూ, చక్కటి విద్యాలయ వాతావరణం మున్నగు వాటిని సృష్టించి యివ్వ కలిగిననాడు మన విద్యార్థులు, అధ్యాపకుల సహకారంతో ఉన్నత శిఖరాలనందుకోగలరనీ, జాతికి తరగని అమూల్య సంపదగా తయారు కాగలరనీ నా దృఢ విశ్వాసం.

‘అల్లరి పిల్ల మూక’ నీ, “అశాంతి తరమ” నీ పేర్లు బెట్టి తరచూ ఈ నాటి యువతరాన్ని అనేక రకాలుగా చిత్రిస్తూ వున్నాం. సమకాలీన తరంవారికి ఆదర్శదాయకమైన ఆశయాలనేవి లేవనీ, జీవితంలో నిర్దుష్టమైన లక్ష్యాలనేవి అసలే లేవనీ, పలుమారు చెప్పడం జరుగుతూనే వుంది. ఆధునిక యువజనులు ఏ విషయాన్ని అంతగా పట్టించుకొనరనీ, తప్పు దోవలు త్రొక్కి ప్రయోజనంలేని ఫలితాలకై వెంటబడడంలో తమ అమూల్యమైన శక్తి యుక్తులను వృథా చేస్తున్నారు అనే అభిప్రాయాలుకూడా లేకపోలేదు. ఈ విమర్శల్లో కొంతవరకూ నిజం వుండవచ్చు. కాని అంత మాత్రానికి యువజనాన్ని పూర్తిగా గర్హించడం అనేది న్యాయ సమ్మతం కాదు, సబబూకాదు. కాగా ఈ రకమైన ధోరణులు ప్రపంచంలో అన్ని మూలలా గోచరిస్తున్నాయి. మార్పుజెందే విలువలూ, ఈ దశాబ్దిలో సంభవిస్తున్న విపరీత పరిణామ పరిస్థితులు పై ధోరణులకు చాలవరకు ముఖ్య కారణం కావచ్చు. విద్యావేత్త ఒకరన్నట్లు ప్రాచీనత అంతరించిపోతున్నది. ఆధునికతకు యింతవరకూ ఒక నిర్ణీత ఆకృతి ఏర్పడలేదు. ఈ సంధి సమయంలో అయోమయ పరిస్థితీ, భయాందోళనలూ వెన్నంటి మేమున్నామంటున్నవి.

కారణాలేవైనా కావచ్చు గాని, విద్యార్థులు మాత్రం, ఎంత తెలివి తేటలున్నప్పటికీ, ఎన్నో అవకాశాలను భవిష్యత్తు ప్రసాదించగలదనే నమ్మకం వున్నప్పటికీ, చదువు సంధ్యల విషయంలోనూ, నిర్మాణాత్మక కార్యకలాపాల విషయంలోనూ, వారు తగినంత శ్రద్ధాసక్తులను కనపరచడం లేదు. అనేక పరిస్థితులు దీనికి కారణం కావచ్చు. కొందరన్నట్లు, యింటివద్ద విద్యార్థి ఎదుర్కొనే ఆర్థిక యిబ్బందులూ, భవిష్యత్తు తనకు సంపూర్ణావకాశాలను ప్రసాదించలేదేమోనన్న సంశయమూ నేడు దిగజారిపోతున్న పరిస్థితికి కారణం కావచ్చు. విచక్షణారాహిత్యంగా అందరికీ సమానావకాశాలు కలిగించే ప్రజాస్వామ్య పద్ధతినికూడా తూలనాడే వారు లేకపోలేదు. పాశ్చాత్య సంస్కృతీ, నాగరికతా తెచ్చిపెట్టిన దుష్ప్రభావాల ఫలితమే నేటిపరిస్థితికి కారణమని కొంతమంది పండితుల అభిప్రాయం. సమాజ వ్యవస్థలో ఏర్పడిన స్వరూపాత్మకమైన మార్పే దీనికి కారణమని మరికొంతమంది అంటారు. సంఘంలో వివిధ శ్రేణులలో సంభవించిన పరిణామాలూ, పారిశ్రామికీకరణ ఫలితంగా పల్లెసీమల నుండి పట్టణాలకు తండోపతండాలుగా ఎగబడి వచ్చిన యువజన సమూహం – సాంప్రదాయ విలువల తిరస్కృతికి దారి తీశాయని కొందరు భావిస్తున్నారు. ఆధునిక విలువలు యింతవరకూ ఒక పరమావధినీ, లక్ష్యాన్నీ రూపొందించుకోలేక పోవడంతో సందిగ్ధ పరిస్థితు లేర్పడ్డాయి. వీటన్నిటి దృష్ట్యా చూచినపుడు నేటి పరిస్థితి ఒక విధంగా విశిష్ట సాంఘిక పరిణామమేకాని ఏదో ఒక వ్యక్తి మూలంగానో, ఒక తరగతికి చెందిన వారి మూలంగానో సంభవించిన విపరీత పరిణామంకాదని, దీనికి ఎవరినీ నిందించి ప్రయోజనం లేదని తేలుతుంది.

## పవిత్ర ఆలయాలు

ఇదంతా చెప్పడంలో నా అభిప్రాయమేమిటంటే–యువజనులను ప్రత్యేకంగా వేలెత్తి చూపవలసిన పనిలేదనీ, వారి కార్యకలాపాలకు లేనిపోని రంగులు పూసి గోరంతలు కొండంతలుగా వర్ణించే పని లేదనీ, క్రమ శిక్షణా రాహిత్యం అన్నది భారత దేశానికి వింతైన సంఘటనేమీ కాదని వివరించి చెప్పడమే.

అయితే ఈ సందర్భంలో ఒక విషయాన్ని మాత్రం నొక్కి చెప్పవలసి వస్తుంది. ఎవరైనాసరే విశ్వవిద్యాలయాలను స్వార్థ ప్రయోజనాలకూ, సొంత లాభాలకూ బేరసారాలు సాగించే బజారు స్థలంగా మాత్రం పరిగణించారంటే అది ముమ్మాటికీ పొరపటు భావనే అని చెప్పక తప్పదు. ఈ విద్యాలయాలు మనకు విజ్ఞానాన్ని ప్రసాదించే దేవాలయాలు. ప్రతి ఒక విద్యా సంస్థ పవిత్రమైన గర్భగుడి లాంటిది. భక్తి ప్రపత్తులతో, గౌరవ మర్యాదలతో, వినమ్రతా భావంతో ఆ సంస్థలను మనం ఆశ్రయించాలి. అంతరంగిక ముఠాతత్వాలతో గానీ, రాజకీయ కక్షలతో గానీ ఈ పవిత్ర విద్యాలయాలను కలుషితం చేయరాదు.

ఈ విషయంలో ముఖ్యంగా ఉపాధ్యాయులే జాగ్రత్త తీసుకోవాలి. వారి వారి సర్వీసు పరిస్థితులను మెరుగుపరుచుకొనే హక్కు వారికుంది. కానీ ఆ ప్రయోజనాలను సాధించుకొనేందుకు చట్టసమ్మతమైన పద్ధతులను మాత్రమే అవలంబించవలసి వుంటుంది. ఇకపోతే విద్యార్థుల సాంఘిక, వైజ్ఞానిక జీవిత రంగాన్ని తీర్చిదిద్దడమనేది ఉపాధ్యాయుల ప్రథమ కర్తవ్యం. విద్య అన్నది ఒక పవిత్ర కార్యక్రమం. దీన్ని సాధించేందుకు అటు ఉపాధ్యాయులూ, యిటు విద్యార్థులూ ఉమ్మడిగా కృషి చేయవలసిన బాధ్యతవుంది. యిందులో యిది ఏ ఒక్కరి బాధ్యతో అని చెప్పేందుకు వీలుపడదు. పరిణతినొందిన భాగస్వాములు కావడంతో, వీరిలో ఉపాధ్యాయులే విద్యాభ్యాసానికి అవసరమైన వాతావరణాన్ని, సరియైన మానసిక వాతావరణాన్ని విద్యార్థుల్లో కలిగించడం వారి విధి.

## స్వీయ నిర్ణయం

నిజమే. తన కిష్టం వచ్చిన ఆశయాన్ని మత సంప్రదాయాన్ని ఎంపిక చేసుకొనేందుకూ, రాజకీయాలకు సంబంధించి వ్యక్తిగత అభిప్రాయాలు కలిగి వుండేందుకూ ప్రతి పౌరునికి వారసత్వపు హక్కు వుంది. అయితే ఉపాధ్యాయులు మాత్రం వారు నిర్వర్తించవలసిన బాధ్యతల స్వభావం దృష్ట్యా రాజకీయాల్లో తల దూర్చరాదు. విశ్వవిద్యాలయ జీవితంలోకి వివాదాస్పదమైన రాజకీయాలు ప్రవేశించకుండా అరికట్టేందుకు వీరు కృషిచేయాలి. ఇంతగా చెప్పేందుకు కారణమేమిటంటే ఉపాధ్యాయుల వర్గాలు విద్యార్థులకు ప్రోత్సాహకరమైనవి. వారు అనుసరించి అవలంబించే మార్గాలను, బాగోగులు గమనించకుండానే పాటించేందుకు సహజంగా విద్యార్థులు పూనుకుంటారు. సక్రమమార్గంలో విద్య గరపినట్లయితే ఏ విద్యార్థి అయినా విద్యాభ్యాసం ముగించుకొని జీవిత ప్రాంగణంలోకి అడుగుపెట్టేనాడు తాను ఏ రకమైన రాజకీయ సిద్ధాంతాలను ఎన్నుకొని అనుసరించవలసిందీ తనకుతానై నిర్ణయించుకో కలుగుతాడు. తానెలా నడుచుకోవలసిందీ కూడా తానే నిర్ణయించుకుంటాడు. భవిష్యత్తును నిర్ణయించుకొనేందుకు విద్యార్థికి అదునైన తరుణమది. ఆ నిర్ణయాన్ని తానే తీసుకోవాలి. ఆసమయంలోనే విద్యార్థికి, గతంలో ఉపాధ్యాయులు అందజేసిన శిక్షణ ఒక పెన్నిధిగా తోడ్పడుతుంది.

విశ్వవిద్యాలయాల జీవన స్థాయిని మనం పెంచాలి. ఈ బాధ్యత విద్యాలయాధినేతలమీద, అధ్యాపక వర్గంమీద, విద్యార్థి సమాజంమీద వుంది. విద్యార్థుల, అధ్యాపకుల పరస్పర సహకార భావంమీద, సమైక్యకృషి మీద ఫలితాలు ఆధారపడి వుంటాయి. నా అభిప్రాయంలో విశ్వవిద్యాలయాలు స్వతంత్ర ప్రతిపత్తిని కలిగిన సంస్థలుగా వుండాలి. అలా వాటినివుంచేందుకు విశ్వవిద్యాలయాలనుండి, పైచెప్పబడిన లోపాలను సత్వరమే తొలగించి వెయ్యాలి.

## ఏక కుటుంబం

ఉపాధ్యాయులు, విద్యార్థులు కలిసి ఒక కుటుంబంవలె వుండాలి. వీరిది పవిత్ర ప్రేమైక బంధంతో ముడిపడ్డ బాంధవ్యం. ఉపాధ్యాయ వృత్తికి మనం ఎన్నిక చేసుకొనే స్త్రీ పురుషుల మీదనే, విద్యార్థుల కందజేయబడే విద్యా ప్రమాణం ఆధారపడి వుంటుంది.

## ఒక జ్యోతితో వందజ్యోతులు

విద్యార్థులకు ఉన్నత విలువలను సంక్రమింప జేయడం అధ్యాపకుల బాధ్యత. ఈ విలువలను సంరక్షించవలసిన వారు ఉపాధ్యాయులే. అట్టి సత్సంప్రదాయాన్ని పరిరక్షించడంలో ఉపాధ్యాయుల ప్రవృత్తి, వ్యక్తిత్వం, దృక్పథం–యివి ఎంతగానో లెక్కించ బడతాయి. ఉపాధ్యాయుడనే వానికి నైతిక బలం వుండాలి. ఉత్సాహశీలం, విషయ పరిజ్ఞానం, అప్రమత్తతా లక్షణం, విచక్షణాత్మకమైన శక్తి, అన్నింటికీ మించి విద్యగరపడం ద్వారా విద్యార్థులను ఉత్సాహపరచగలిగిన శక్తి సామర్థ్యాలు ఉపాధ్యాయులకు తప్పనిసరియైన లక్షణాలు. దయార్ద్రహృదయులై వారు ప్రేమామృతాన్ని జాలువార్చ కలిగి వుండాలి. విద్యార్థులకు అత్యంత సన్నిహితంగానూ, అందుబాటులోనూ వుండాలి. కేవలం పాండిత్య ప్రకర్షతోనేకాక, తమ శీలసంపదచే ఉపాధ్యాయులు విద్యార్థులలో విశ్వాసాన్ని రేకెత్తించి, వారి గౌరవ మర్యాదలకు పాత్రులు కావాలి. వృత్తిదృష్ట్యా ఉపాధ్యాయునికి కనీసావసర వసతుల నేర్పరచి, అతని జీవితం సుగమం చేయడం సమాజం బాధ్యత. కాగా నిరాడంబరమైన జీవితం సాగించి, ఉన్నతాశయాలతో కృషిచేయడం ఉపాధ్యాయుని విధి. అన్ని ఉన్నత కార్యక్రమాలూ సేవాతత్వంతో సాధించ బడినవే. విశ్వకవి సెలవిచ్చినట్లు "ఉపాధ్యాయుడు వెలిగించబడిన ఒక జ్యోతి. ఈజ్యోతి అనేక యితరజ్యోతులను వెలిగించగలుగుతుంది" ఈ సందర్భంలో మేము చదువుకొన్న రోజుల్లోని ఒక సంఘటను గుర్తుచేస్తాను. నాటి మా గురువులు, బడివేళలు ముగిసిన తర్వాత తమ విద్యార్థులు తీరికసమయాలను ఎలా గడుపుతున్నారో గమనించేందుకు నగరంలో పర్యటించేవారు. మా సంరక్షకులుగా వారు భావించుకొని సక్రమమైన, సరియైన మార్గాలను అవలంబించడంలో మాకు వారు సర్వదా తోడ్పడే వారు.

ప్రాచీన కాలంలోని ఆచార్యుల వలె, ఉపాధ్యాయులు శాస్త్రీయమైన మనస్తత్వంవైపు, స్వేచ్ఛా భావనవైపు తమ దృష్టి సారించాలి. రాజకీయాలకు వారు అతీతులుగా వుండాలి. నిజమే. ఉపాధ్యాయుడు తానున్న నాలుగుగోడల మధ్య బంధించబడి వుండరాదు. రాజకీయవేత్తలు కూడా విశ్వవిద్యాలయల్లోకి తమ రాజకీయాలను చొప్పించ కుండా తమరాజకీయ చదరంగపు ఆటకు అవి అతీతమైన సంస్థలుగా భావించి వాటి స్వతంత్ర ప్రతిపత్తిని కాపాడడం తమ పవిత్రధర్మంగా భావించాలి. ఈ రాజకీయ చదరంగంలో ఉపయోగించే పావుగామాత్రం విద్యార్థిని పరిగణించకూడదు. విద్యార్థుల విషయంలో నాఅభిప్రాయాన్ని అనేకమార్లు ప్రకటించి వున్నాను. అదేమిటంటే విద్యాలయాలకు సంబంధించిన వివిధ రాజకీయభావాలను అనుసరించడంలో వారికి హక్కువున్నా అసలు రాజకీయాలలో వారు చురుగ్గా పాల్గొనడం మాత్రం తగనిపని.

# ప్రజాకవి గాలిబ్

—మాలిక్ రామ్

అసాదుల్లాఖాన్ గాలిబ్, ఆగ్రాలో 1797 డిసెంబర్ 27న జన్మించారు. పద్దెనిమిదవ శతాబ్ది మధ్యకాలంలో ఆయన కుటుంబీకులు మధ్య ఆసియా ప్రాంతం నుంచి మనదేశం వచ్చి స్థిరపడారు. ఆయన పూర్వీకులు చాలా మంది సైన్యంలో పనిచేశారు. గాలిబ్ తాతగారు అదృష్టదేవతను వెతుక్కుంటూ స్వదేశంనుంచి భారత దేశానికి వచ్చి చేరారు లాహోర్ పాలకుడైన మొయిన్-ఉల్-ముల్క్ దగ్గర కొలువులో చేరారు దరిమిలా ఢిల్లీ తరలివెళ్లారు. అక్కడ రెండవ షా ఆలం దర్బారులో చేరారు. కొంతకాలానికి తమ మకాం ఆగ్రాకు తరలించారు. అక్కడ ఆయన ప్రథమ పుత్రుడైన అబ్దుల్లా బేగ్ ఖాన్‌కు తొలి సంతానంగా అసాదుల్లాఖాన్ జన్మించాడు.

అప్పట్లో పర్షియన్‌భాష పండితభాష కావటంచేత విద్యాబోధన ఆ భాషలోనే జరిగేది. కవిత్వం కూడా ఆ భాషలోనే వెలువడుతూ ఉండేది. గాలిబ్ కూడా పాఠశాలలో పర్షియన్ కావ్యాలనే క్షుణ్ణంగా చదివాడు. తన పన్నెండవ ఏట ఆయన ఇరాన్ నుంచి యాత్రికుడుగా ఆగ్రా వచ్చిన అబ్దుల్ సమద్ అనే విద్వాంసుని దగ్గర పర్షియన్, అరబిక్ భాషలను అభ్యసించాడు. ఈ అధ్యయనం రెండు సంవత్సరాల పాటు సాగింది. గాలిబ్ తన జీవితం మొత్తం మీద శ్రద్ధగా క్షుణ్ణంగా విద్యాభ్యాసంగావించింది ఈ తరుణంలోనే.

లోహార్ సంస్థానాధీశుని కుటుంబానికి చెందిన ఒక బాలికను ఢిల్లీలో వివాహం చేసుకున్నాడు. రాజధానీ నగరం గాలిబ్‌ను బాగా ఆకర్షించింది. 1812 సంవత్సర ప్రాంతంలో ఆయన తన మకాం ఆగ్రానుంచి ఢిల్లీకి మార్చారు. ఆమరణాంతం ఆ నగరాన్ని విడిచి పెట్టలేదు.

## ఆస్థాన కవిగా గాలిబ్

ఆయన మామగారు ఇలాహి బక్ష్ ఖాన్ కవిగా పేరందిన వారు. ఢిల్లీ సాహితీ వేత్తలలో ఒక ప్రముఖుడుగా చెలామణి అవుతూండేవాడు. ఆయన ద్వారానూ, లోహార్ సంస్థానాధిపతి ద్వారానూ గాలిబ్ ఢిల్లీ చక్రవర్తి దర్బారులో ప్రవేశం సంపాదించుకున్నాడు. నగరంలో విద్యావంతులైన పెద్దలతో పరిచయ భాగ్యం లభించింది. కవులు, పండితులు, మతాచార్యులు, పరిపాలనా దక్షులు, రాజులు, యువరాజులు, ధనికులు, పేదలు రకరకాల వ్యక్తులతో పరిచయమూ, సన్నిహిత సంబంధాలు ఏర్పడ్డాయి. మానవ జీవితానికి సంబంధించిన ఎన్నో అనుభవాలను గడించేందుకు ఈ పరిచయాలు తోడ్పడ్డాయి.

సాహితీరంగంలో పూర్వంనించి వస్తున్న సంప్రదాయాలను కాదని నిలచిన మహాకవి గాలిబ్. తన సమకాలీన పరిస్థితులను, ప్రజల ఆశానిరాశలను, జయాపజయాలను, తన రచనలలో వ్యక్తపరచిన నిజమైన ప్రజాకవి ఆయన

అప్పటికే మొఘల్ చక్రవర్తి అధికారాలు అన్నీ బ్రిటిష్ వారి హస్తగతమైనాయి. చక్రవర్తి నామమాత్రపు ప్రభువుగా తయారైనాడు. ఆయన భోగభాగ్యాలన్నీ అంతరించాయి. బ్రిటిష్ వారిచ్చే భరణంతో తృప్తిచెందవలసిన స్థితి ఏర్పడింది. ప్రతిభా పాండిత్యాలుగలవారెవరినీ సముచిత రీతిని ధన ధాన్యాలతో సత్కరించే స్తోమతు దివాణానికి లేకుండా పోయింది.

పదిహేనేళ్ళ చిఱుత ప్రాయంలోనే ఢిల్లీ చేరుకున్నాడు గాలిబ్. అంతకుముందు ఆగ్రాలో వున్న రోజుల్లోనే ఉర్దు, పర్షియన్ భాషలలో రచనా వ్యాసంగానికి ఉపక్రమించాడు. సాహితీ రంగంలో పేరు ప్రఖ్యాతులను గడించుకోవాలనే అభిలాష, ఢిల్లీ చేరాక ఏర్పరుచుకున్న పరిచయాలు, సంబంధాల మూలంగా పెంపొందుతూవచ్చింది. "అసద్" అనే మారుపేరుతో రచనలు సాగిస్తూ వచ్చాడాయన.

## పదాడంబరం

ఆ రోజుల్లో ఆయన కవిత్వానికి ఉపయోగించిన భాష వాడుకలో లేని ఏదో పురాతన భాషగా ఉండేది ఆ భాషతో పరిచయంలేని ఆయన సమకాలికులు గాలిబ్ రచనలు అర్థమయేవి కావని విమర్శిస్తూ ఉండేవారు. అర్థంలేని కవితలల్లేవాడుగా ఆయనను అభివర్ణిస్తూ ఉండేవారు. క్లిష్టమైన భావాలను వ్యక్తం చేయడానికి అసాధారణమైన పదాలను వాడుతూ, ప్రయోగాలను చేస్తూ ఉండేవాడు. కొన్ని సందర్భాలలో ఈ కృషి సరిగానే సాగిపోయేది. కాని, మరికొన్ని సందర్భాలలో పదాడంబరం ఎక్కువ అయిపోయి భావ పటిమ లోపించేది.

ఆయననే గనుక ఎవరూ విమర్శించకుండా ఉండి ఉన్నట్లయితే ఇలాంటి రచనలతోనే ఆయన తన ప్రతిభనంతా వ్యర్థంచేసి ఉండేవాడు. అయితే అదృష్టవశాత్తు ఇలా జరగలేదు. సన్నిహితులైన కవులు, రచయితలు-మిత్రులు కానివారు కూడా-గాలిబ్ రచనలను గట్టిగా విమర్శించడం సాగించారు. మొదట్లో అలాంటి వారిని ద్వేషించినా, క్రమేణా, నిజం తెలుసుకుని, ఆయన తన శైలిని మార్చుకున్నారు.

నామమాత్రపు మొఘల్ చక్రవర్తి రెండవ బహదూర్ షా స్వయంగా ఉర్దూ కవి. అవకాశమున్నంతవరకు కవులను, పండితులను ఆదరించేవాడు. మహమ్మద్ ఇబ్రహీం "జౌక్" అనే పండితుడు చక్రవర్తికి సాహిత్యరంగంలో సలహాదారుగా ఉండేవాడు. 1854లో ఆయన గతించటంతో ఆ హోదా గాలిబ్‌కు సంక్రమించింది. అంతకు నాలుగు సంవత్సరాల క్రితమే బహ

(తరువాయి 47 వ పుటలో)

# బాపూవాణి

## సమ్మెలు ఒక పరిశీలన



సమ్మెలు చెయ్యడం ఈనాడు పరిపాటి అయిపోయింది. సమ్మెలు ఇలా వ్యాప్తం కావడానికి ప్రధానకారణం మతం ప్రాతిపదికపై పెంపొందింప బడిన జీవనవిధానం నేడు ఏదో ఒక ప్రాంతంలో సమూలంగా విచ్ఛిన్నమై పోతున్నదన్న ఆందోళన కలగడమే.

సమ్మె ఎప్పుడూ దాని అంతట అది జరగాలి మరొకళ్లు ఎవరో నిర్వహించకూడదు. మరొకరు నిర్వహించటం అంటూ జరిగితే ఎటువంటి నిర్బంధం ఉండకూడదు దౌర్జన్యం, లూటీలు జరిగేందుకు ఏ విధమైన అవకాశం ఉండకుండా చూడాలి. సమ్మెదారుల అందరిమధ్య పూర్తి సహకారం ఉంటే, సమ్మె అలా జరుగుతుంది. సమ్మె శాంతియుతంగా జరగాలి. ఏ విధమైన బల ప్రదర్శన జరగకూడదు. సమ్మెదారులు ఎవరికి వారు కాని, అంతా కలిసికాని తిండి గడవడనికి ఏదైనా పని ప్రారంభించాలి. న్యాయ సమ్మతమైన కారణంలేనిదే సమ్మె చెయ్యకూడదు. సరియైన కారణం లేనిదే మొదలుపెట్టే సమ్మెఏదికూడా విజయవంతంకాదు. అటువంటి సమ్మెపట్ల ప్రజలు ఎవరూ కూడా సానుభూతి చూపకూడదు.

కారణం సరియైనది అయితే, సమ్మెకు పూనుకొన్నవారందరి మధ్య ఏకాభిప్రాయం ఉంటే, సమ్మె జరుగుతున్న సమయంలో కార్మిక సంఘాలు మొదలైన నాటిపై ఆధారపడకుండా సమ్మెదారులంతా పొట్టపోసుకోగలిగిన పరిస్థితి ఉంటే సమ్మె తప్పక పూర్తిగా విజయవంతం అవుతుంది పరిస్థితి ఇందుకు భిన్నంగా ఉంటే సమ్మె ఎప్పటికీ నెగ్గదు.

న్యాయం సాధించడానికి సమ్మె చెయ్యడం కార్మికుల జన్మహక్కు కావచ్చు కాని ఆ పరిశ్రమయజమాని, సంప్రదింపులకూ, మధ్యవర్తి పరిష్కారానికీ సిద్ధమైన మరుక్షణంలో సమ్మె ప్రస్తావనే విరమించాలి. మధ్యవర్తి పరిష్కారానికి అవకాశం ఉండగా సమ్మెచెయ్యడం తీవ్రమైన నేరం.

ప్రజల విశ్వాసం చూరగొన్న పెద్దలయొక్క, నిష్పక్షపాతంగా వ్యవహరించే నిజాయితీపరులయొక్క మద్దతు ఉంటేనేకాని న్యాయమైన కారణాన్ని పురస్కరించుకొని సమ్మె జరుగుతున్నదని ప్రజలకు నమ్మకం కలుగదు. సమ్మెతో సంబంధం ఉన్నవారు కారణాలను గురించీ, మంచి చెడ్డలను గురించీ స్వయంగా నిర్ణయించుకోలేరు. అందువల్ల ఉభయ పక్షాల ఆమోదం పొందిన మధ్యవర్తి ఉండాలి. లేదా న్యాయస్థానం ద్వారా తీర్పు చెప్పడం జరగాలి. అయితే సర్వసాధారణంగా ఇరుపక్షాలకూ ఆమోదయోగ్యుడైన మధ్యవర్తి ఉన్నా, లేదా న్యాయస్థానంలో తీర్పు చెప్పడం జరిగినా సమ్మెకు దిగడం జరగదు. న్యాయస్థానాల తీర్పులు, నిర్ణయాలు కూడా కొందరు యజమానులు కేవలం తమ అధికారం చెలాయించడానికీ, ఇటు కార్మికులు సమ్మె చేయడానికి వీలున్నదికదా అని తమ పట్టు నెగ్గించుకోవడనికీ ప్రయత్నించిన సందర్భాలు కూడా ఉన్నాయి.

పౌరవర్గాలకు చెందిన పై విధమైన సమ్మెలో హింసకు ఏ విధమైన తావివ్వకూడదని నేరుగా చెప్పవలసిన అవసరం లేదు. కాలం గడుస్తున్న కొద్దీ రోజు రోజుకూ పెరుగుతున్న అవసరాలు తీర్చవలసిందిగా కార్మికులు కోరడం ఎక్కువ అవుతున్నది. కోర్కెలు వెంటనే తీర్చకపోవడంతో ఓరిమి కోల్పోయి కార్మికులు హింసాత్మక చర్యలకు దిగడానికి వెనుకాడడం లేదు. అంతే కాదు వారు యజమానుల ఆస్తులకు నష్టం కలిగించడానికి కూడా జంకడం లేదు. యజమానులు, ఉద్యోగులు సమానమైన భాగస్వాములని నా అభిప్రాయం. కార్మికులను అధికులుగా పరిగణించడం జరగకపోగా

ఈ నాడు ఇందుకు భిన్నంగా కేవలం యజమానులనే అధికులుగా పరిగణిస్తున్నారు వారే ఆధిపత్యం చెలాయిస్తున్నారు. ఇందుకు ప్రధాన కారణం వారు పెద్దమొత్తాలలో సొమ్ము పెట్టుబడి పెట్టగలగడమే.

కార్మికులను తమ పరిశ్రమల నిజమైన యజమానులుగా పరిగణించడం మంచిదని పరిశ్రమల యజమానులకు నా సలహా. యజమానులు, కార్మికులు ఇంకా విద్యావంతులు కావడానికి తోడ్పడాలి. ఫలితంగా వారిలో అజ్ఞాతంగా ఉన్న శక్తియుక్తులు వెలుగుచూస్తాయి. దీనివల్ల తమకు నష్టం ఏమిలేకపోగా అధిక ప్రయోజనం కలుగుతుందని యజమానులు చివరకు గుర్తించకలరని నా నమ్మకం.

ఆర్థికపరిస్థితి మెరుగు పరచుకోడానికి జరిగే సమ్మెల విషయంలో రాజకీయ లక్ష్యాలు ఏవీ ఉండకూడదు. ఇలా రాజకీయ లక్ష్యాలు కూడా వీటిలో కన్పిస్తే ఆ లక్ష్యాలు సాధించలేకపోవడమే కాక అత్యవసర సౌకర్యాలకు ఆటంకం కలగకపోయినా సమ్మె దారులను అకారణంగా చిక్కులో పెట్టడం జరుగుతుంది. ఇందుకు ఉదాహరణగా తపాలా సిబ్బంది సమ్మెను పేర్కొనవచ్చును. ఏమైనా రాజకీయ లక్ష్యాలు ఉద్దేశాలు సాధించుకోవడానికి కార్మికులను సమ్మెకు పురికొల్పడం చాలా తప్పు. దేశంలో రాజకీయ పరిస్థితులను పూర్తిగా అవగాహన చేసుకొని, దేశప్రజల సంక్షేమాభివృద్ధి సాధనకై కృషిచెయ్యడానికి సిద్ధపడేదాకా – అటువంటి స్థితి వచ్చేవరకూ కార్మికులకు, సమ్మెకు రాజకీయ ప్రయోజనం దృష్ట్యా ప్రోత్సాహం ఇవ్వకూడదు. రాజకీయ కారణాలను పురస్కరించుకొని జరిగే సమ్మెలు వేరు. ఆర్థిక పరిస్థితిని మెరుగు పరుచుకొనేందుకు జరిగే సమ్మెలు వేరు వీటిని వేరువేరుగానే గుర్తించాలి. రాజకీయ కారణాలను పురస్కరించుకొని చేసే సమ్మెలకు అహింసాత్మక ఉద్యమంలో అధిక ప్రాముఖ్యం ఉన్నది. ఇటువంటి సమ్మెలు ఎప్పుడూ అకస్మాత్తుగా మొదలు పెట్టరు. వాటిలో దౌర్జన్యానికి అవకాశం ఉండకూడదు. హింసకు దారితీసే పరిస్థితి కలుగకుండా చూడడం జరుగుతుంది. అయితే అధికారం కోసం అంతా ఏకమై సమ్మెకు పూనుకోవడం నా అభిమతంకాదు.

కొన్ని అంశాలకు సంబంధించి సమ్మెలు చెయ్యనేకూడదు. అత్యవసర సౌకర్యాల విషయంలో సమ్మెల మూలంగా ప్రజలకు ఇబ్బంది కలగనీయకూడదు ఊడ్చుపనివారి సమ్మెను ఇందుకు ఉదాహరణగా చెప్పవచ్చు వారికి అనేక ఇబ్బందులు ఉండవచ్చు. వారి కోరికలు న్యాయమైనవే కావచ్చు ఏది ఏమైనా వారు సమ్మెకు దిగకూడదు ఏ వివాదాలు వచ్చినా నిష్పాక్షికంగా వ్యవహరించే విచారణసంఘంద్వారా మాత్రమే పరిష్కారం చేసుకోవాలి. అలాగే పోలీసులు కూడా. ఏ సందర్భంలోకూడా సమ్మె చెయ్యకూడదు. జీతభత్యాలతో నిమిత్తం లేకుండా వారు తమ విధులు నిర్వహించవలసిందే. ఇటువంటివన్నీ అత్యవసర సౌకర్యాలక్రిందకు వస్తాయి.

ఇక తపాలా సిబ్బంది సమ్మె విషయంలో ప్రభుత్వం కొంత ఇబ్బందికి, అసౌకర్యానికి లోనుకావచ్చు. అంతేకాని ప్రభుత్వం స్తంభించిపోదు. భాగ్యవంతులు మామూలుకంటె ఎక్కువసొమ్ము వ్యయపరచి టెలిగ్రాములు పంపుకోవడంద్వారానో మరో పద్ధతి ద్వారానో తమ అవసరాలు తీర్చుకొంటారు. కాని అసంఖ్యాకంగా ఉన్న బీదప్రజలకు ఇటువంటి సమ్మె మూలంగా అసౌకర్యం కలుగుతుంది.



(46 వ పుట తరువాయి)

## ప్రజాకవి గాలిబ్

దూర్ షా మొఘల్ చక్రవర్తుల చరిత్ర వ్రాయవలసిందిగా గాలిబ్‌ను కోరడం జరిగింది. ఆర్థికంగా మాత్రం ఆయన స్థితి ఏమీ మెరుగవలేదు. ఏడు సంవత్సరాలపాటు సాలుకి 1360 రూపాయలు మాత్రమే ఆయనకు లభిస్తూ ఉండేవి.

1857లో భారత దేశమంతటా చెలరేగిన రాజకీయ సంక్షోభాన్ని ఆయన కళ్లారా చూచాడు. విన్నాడు. ఆ రోజుల్లో ఆయన చాలా ఇబ్బందులకు గురి అయినాడు. తిరుగుబాటుదారులు ఢిల్లీని వశం చేసుకోవడంతో బ్రిటిష్‌వారు ఆయనకిచ్చే పింఛనును రద్దు చేశారు. బహదూర్‌షాకు భరణమిస్తూండిన బ్రిటిష్‌వారు ఢిల్లీలో పరాజయం పొందడంతో చక్రవర్తికే వరుమానం ఆగిపోయింది. ఫలితంగా గాలిబ్‌కు లభించే పారితోషికం కూడా నిలిచిపోయింది.

1857 సంవత్సరానికి దాదాపు దేశమంతా బ్రిటిష్‌వారి ఆధిపత్యం క్రిందకు వచ్చింది. బహదూర్‌షాను ఖైదు చేసి రంగూన్ పంపారు. ఆయన అక్కడ 1862 నవంబరులో తనువు చాలించారు. బ్రిటిష్‌వారికి వ్యతిరేకంగా సాగిన ఉద్యమంలో గాలిబ్ పాల్గొనలేదు. ప్రశాంత పరిస్థితులు తిరిగి ఏర్పడితే పింఛను సొమ్ము మళ్ళీ తనకు లభించగలదని ఆశించాడు. అయితే బహదూర్‌షా దర్బార్‌లోని కొందరు చెప్పిన మాటలను ఆలకించిన బ్రిటిష్ అధికారులు గాలిబ్‌ను తీవ్రంగా అనుమానించారు. ఎంతో శ్రమపడితేనేగాని 1860 మే నెల నుంచి ఆయనకు పింఛను సొమ్ము చెల్లింపు మళ్ళీ మొదలవలేదు.

సాహితీరంగంలో అంతకు పూర్వంనుంచి వస్తూన్న సంప్రదాయాలను కాదని నిలచినవాడుగాలిబ్. ఆదిలో ఉర్దూ కవులు చాలా మందికి పర్షియన్ భాషలో మంచి పాండిత్యం ఉండేది. ఆ భాషలో రచనా రీతులన్నా, వివిధ ప్రక్రియలన్నా మోజు ఉండేది. అయితే గాలిబ్ మాత్రం ఎన్నడూ నేలవిడిచి సాము చేయలేదు. భారత దేశంలోని అప్పటి స్థితిగతులనూ, భారతీయుల ఆశా నిరాశలనూ, జయాపజయాలనూ ఆయన తన రచనలలో వ్యక్తపరిచేవారు.

సంప్రదాయమనే అడ్డుగోడలను అతిక్రమించడానికి పాటుపడిన ప్రముఖ ఉర్దూ కవులలో గాలిబ్ ఒకరు. ఉర్దూ కవిత్వానికి వాస్తవికతను చేకూర్చిన వాడాయన. ఆయన కవితా నైపుణ్యం అసాధారణమైనది. ఆయన రచించిన ద్విపదలు, పాఠకుల మనోగత భావాలను, వారికి ఎదురయ్యే సమస్యలను ప్రతిబింబిస్తాయి. ఆయన అసలైన ప్రజాకవి.



**కవిత :**

# నగరంలో ఎగ్జిబిషన్

బోయి భీమన్న

ఎగ్జిబిషనుకు పోదామా, రాధా ?
ఈ అందమైన సాయంత్రం కాకూడదు వృథా.
రవీంద్రభారతికి పోగూడదా అంటావా ?
ఎందుకు పోగూడదు ! ఇన్విటేషను లేదు !
ఇరవై పైసలకే ఇరవై వేల అందాలతో
పంచేంద్రియాలకూ పండగచేసే ఎగ్జిబిషను !
కనిపించే, వినిపించే, తినిపించే, త్రాపించే
ఏ ఆనందానికీ లేదిక్కడ ప్రొహిబిషను !
చీరలూ, చెప్పులూ, బొమ్మలూ, బామ్మలూ,
మిరపకాయ బజ్జీలూ, పచ్చి చేప వేపుడులూ,
గోల్డుకవరింగు రింగులూ, మంటల్లో జంపింగులూ,
మినీరైలూ, జెయింటువీలూ,
ముషైరాలూ ఇంతేకాదు నిమాయిష్—
ఇంకా ఉన్నై ఇఫ్ యూ విష్ !
కాఫీ త్రాగవచ్చు—
కప్పులు జేబుల్లో వేసుకుపోవచ్చు;
ఏడో, మూడో పైసలకు—
ఎడారి ఓడలు ఎక్కవచ్చు;
రంగుల రాట్నాలపై
హాసక్రీడలు నెరపవచ్చు;
రగడ తినవచ్చు, చెరకు రసం త్రాగవచ్చు;
మాయా కుటీరంలో మైరేయం ఎఫెక్టు చూడవచ్చు,
తారల్ని మించిన లైట్లు,
ఈ రంగులూ, రుచులూ,
హంగులూ, హాబీలూ అన్నీ
ఏ తురుపుల్లో మెరుపులు దిద్దుకొన్నవో చూడు !
ప్రతి మెరుపూ నీ ఈడు
ప్రతి ఈడూ మన జోడు !
మిధునాల వెంట పీతలూ సింహాలూ,
కన్యల వెంట చలితేళ్ళూ,
మోచేతులే ధనుర్బాణాలైన మానినీ మకరాంకులు,
బూటుకాళ్ళతో కాళ్ళు తొక్కుకుపోయే
పొగరు పొట్టేళ్ళు, అచ్చు ఆబోతులు
రాశులు రాశులుగా పోతున్నారు చూడు !
రాసుకొంటూ వస్తున్నారు చూడు !
సిగరెట్ల పొగమబ్బుల్లో వడగళ్ళ జడి వానల్లా
నాజూకైన కుర్రవాళ్ళు నవ్వుకొంటూ పోతుంటే
వాళ్ళనీడల్లో చూశావా
నక్కిన నల్ల త్రాచుల్ని ?
ఉషఃకాంతుల వెనుక
బుసకొడుతున్న విష తమస్సుల్ని ?
గ్రహబలం సమస్తం నీముందే ఉంది,
ఎవడు మనిషో, ఎవడు పామో
చూచుకొంటూ పద !
అటు చూడకు, అది మోడర్న్ ఆర్ట్,
కళా రామాయణంలో అది పీడకల వేట !
అలా చూడు ఆ ఆలయ గోపురంకేసి,
ఇలా రా ఈ ఎగ్జిబిషను క్లబ్బుకేసి,
క్లబ్బులో కొంచెం ఐసుక్రీం తిని,
అక్కడ జరుగుతున్న కవితాగానం కొంచెం విని,
ఆ అటవీశాఖలో ఒక సీసా తేనె,
మహిళా శాఖలో పాపకు గౌను,
ఇటురా ఈ కొట్లో రెండు మినప సున్ని ఉండలు
తీసుకుపోదాం, అయిందిప్పుడే పది !

( ఫిబ్రవరి 4వ తేదీన ఎగ్జిబిషన్ క్లబ్ ఆధ్వర్యాన జరిగిన కవి సమ్మేళనంలో చదివిన కవితలోని కొన్ని భాగాలు )

# జాతిపితకు కృతజ్ఞతలు



అస్వతంత్రమ్మైన యఖిల భారతజాతి
బంధముక్తికి నీ యుపాయ మద్భు
తమ్మో మహాత్మ! క్రొత్తదది దయారస
భరితమౌ గంగా ప్రవాహ మద్ది
ముంచివైచినది సముత్కటానైక్య భా
వమ్ములన్ మెరక లొక్కుమ్మడిగను
నైతిక శక్తులు నా డొక్కసారిగా
పెరిగిన ప్రజ విజృంభించి లేచె

కదురులాడెను రాట్నముల్ కదలి తిరిగె
గానుగలునాడె నెల్లరోకళ్లు మ్రోగె
నిబిడ గంభీర నినదమ్ము నీ ముఖోద్భ
వమ్ము స్వాతంత్ర్య శంఖారవమ్ము మొరసి

అల్ల ధర్మరాజు నెఱింగి నట్టివాడు
తిక్కనార్యుని పుణ్యాన తెలుగువాడు
నీ యహింసను నీ నీతి నియమములను
బట్టియాతడు వినుగుర్తు పట్టగలడు.

పాయక పారతంత్రముడు
పన్ పయికెత్తిన యట్టి నీ యహిం
సాయుధ మప్రధృష్యము మ
హా విలయమ్మయి విక్రమించి యాం
గ్లేయుల బారదోలినది;

కేవల మీ వొక రాజకీయ ధౌ
రేయుడ వేమి? నా దవత
రించిన ఏ పరమర్షివో గదా!

ఆరని యంటరాని తన
మార్చి వెలార్చినయట్టి మేటి సం
స్కారివి, మద్యపానపు పి
శాచి నెదర్చిన మాంత్రికుండ వే
పారు నహింసయన్న నస
మర్థుడు పట్టిన యాయుధమ్ము కా
నేరదటంచు చాటిన మ
నీషి! జాతిపితా! నమస్కృతుల్.

ఉత్పల సత్యనారాయణాచార్య

# చైతన్యమూర్తులు

## త్యాగరాజస్వామి

కర్నాటక సంగీతంతో పరిచయం వున్న వారికి త్యాగరాజస్వామి వారిని గూర్చి విడిగా చెప్పనక్కరలేదు. అయితే చాలామందికి త్యాగరాజస్వామి వారి కీర్తి ప్రతిష్ఠలకు అసలు కారణమేమిటో తెలియనే తెలియదు. ఆయన గొప్ప సంగీత సరస్వతి అనిమాత్రమే అందరికీ తెలుసు. వారి రచనలను సునిశితంగా పరిశీలించి చూస్తే; వారి అసాధారణ పాండితీ విభవమూ, సాహిత్యంలో చూపిన అద్భుతమైన పటితనమూ, గాఢమైన అనుభూతీ, సంస్కృత, ఆంధ్రభాషలలో విశేషమైన ప్రజ్ఞా, సంగీతరచనలో సాటిలేని మేటి కళా కౌశలమూ మనకు కనిపిస్తాయి. వారు చేసిన అసంఖ్యాకమైన సంగీతరచనల్ని చూస్తే, అందులో వారు చూపిన వైవిధ్యాన్ని పరిశీలిస్తే మనకు ఎంతైయినా ఆశ్చర్యం కలుగుతుంది. సాహితీప్రాభవాన్ని ఏమాత్రం కోల్పోని సంగీత రసగుళికలవి.

త్యాగరాజస్వామివారి "కృతి" సంగీతరచనా ప్రక్రియలో పరాకాష్ఠ చెందిన స్వరూపం. వారు చేసిన ఈ సంగీతరచనలే వారి కీర్తిప్రతిష్ఠలను దేశం నలుమూలల్లోకి కొనిపోయాయి. వారి కృతులు సాహిత్యపరంగానూ, సంగీత పరంగానూ సుసంపన్నమై దక్షిణాదిని గత రెండు శతాబ్దాలుగా సాటిలేని మేటి రచనలుగా సుప్రతిష్ఠితమై భాసిల్లుతున్నాయి.

కర్నాటక సంగీతంలో మన సంస్కృతి తొంగిచూస్తుంటుంది. ముఖ్యంగా త్యాగరాజస్వామివారి సంగీత రచనల్లో మన సంస్కృతి ముమ్మూర్తులా ప్రతిబింబిస్తుంటుంది. సంగీత విద్వాంసులూ, సంగీత శ్రోతలూ వీటిలో సత్యాన్నీ, సౌందర్యాన్నీ దర్శించగలుగుతారు. స్తుతిమాలికలలో వీరి కీర్తనలను అగ్రగాములుగా పేర్కొనవచ్చు.

సంగీతరచనలో త్యాగరాజస్వామి వారు కొంత వరకు సాంప్రదాయక పద్ధతినే అనుసరించారు. రాగతాళ భావాలు చెడకుండా వినేవారి హృదయ కమలాలను వికసింపజేస్తూ తన హృదయగత భావాలకూ, అనుభూతికీ చక్కటి రూపకల్పనచేస్తూ అకళంకమైన, మధురమైన రస ప్రవంతులను ఆయన ప్రవహింపచేశారు.

కర్నాటక సంగీతానికి త్యాగరాజస్వామివారు ప్రధానమైన మూడు స్తంభాలలోనూ ఒకరు. ఎందరో సంగీత విద్వాంసులు, గాయకులు ఆ మహోన్నతమైన స్తంభాన్ని ఆసరాచేసుకొని దాని నీడలో మనగలుగుతున్నారు. ఆయన వందల సంఖ్యలో కృతుల్ని రచించారు. ప్రతిచిన్న అనుభూతినీ, ప్రకృతి రహస్యాన్నీ సంగీతంలో మేళవించారు. కర్నాటక సంగీతంలో ఎంతో వైవిధ్య పూరితమైన భిన్నభిన్నమైన కృతులనేకం చేశారు. వారి రచనలు యీనాటికీ నిత్య నూతనంగా వెలుగొందు తున్నాయి. ఒకవిధంగా చెప్పాలంటే త్యాగరాజస్వామివారి రచనలే లేకపోతే కర్నాటక సంగీతమే లేదు. సాంప్రదాయ సిద్ధంగా వస్తున్న కర్నాటక సంగీత ధోరణులన్నిటినీ పుణికి పుచ్చుకుని సరి కొత్త గుబాళింపులతో అత్యంత మనోహరంగా, ఆకర్షణీయంగా సంగీత సరస్సులో కీర్తనలనే కలువలను ఆయన పూయించారు

శ్రోతలహృదయగతమైన అనుభూతులను అందుకోగలిగిన దిట్ట ఆయన. వారిలో భక్తి తన్మయతను, తననుతాను మరిచిపోయే సమాధి స్థితిని కలిగించిన అపర సంగీత సరస్వతి ఆయన నిజంగా నాదబ్రహ్మ.



## స్వామి వివేకానంద

(జననం : జనవరి 12. 1863)

"ఆకలితో అలమటించే అన్నార్తులకు మతబోధ గావించడం, వేదాంతాన్ని చెవిలో నూరిపోయడం— అనేది నిజానికి వారిని అవమాన పరచినట్లవుతుంది".

"వితంతువు కన్నీటి బొట్లను తుడిచివేయలేని, అనాధుని నోటికి పట్టెడన్నం అందించలేని దేముడన్నా, మతమన్నా నాకు నమ్మకంలేదు"

ఎవరో నాస్తికుడన్న మాటలు కావివి. శ్రీ రామ కృష్ణ పరమహంస శిష్యాగ్ర గణ్యుడైన స్వామీ వివేకానందుని నోటి వెంట వెలువడిన మాటలు కేవలం భగవంతుణ్ణి నమ్మడమేకాదు, సాక్షాత్తూ ఆయన స్వరూపాన్ని సందర్శించగలిగిన పుణ్యపురుషుడు శ్రీ స్వామీజీ. మతమంటే ఏమిటో ప్రపంచానికి ప్రబోధించేందుకే ఆయన అవతరించారు. మతోపదేశాన్ని గావించేందుకే ఆయన యీ లోకంలో అడుగుపెట్టారు. దరిద్ర నారాయణుడే ఆయన దేవుడు. ఆయన మతం సేవాధర్మ సంపన్నమైనది. శ్రమించే కష్టజీవులలో, బీద సాదలలో ఆయన దైవాన్ని సందర్శించేవారు. దైవిక సామ్యవాద సిద్ధాంత ప్రభావితమైనది ఆయన మతం. "సృష్టిలోని ప్రతి వస్తువూ, అనంతప్రాణికోటీ భగవంతుని స్వరూపం. జన్మించిన ప్రతి మనిషి ప్రతి ప్రాణికీ ఏదో రూపంలో ఋణపడివున్నాడని. ఋణ విమోచనం గావించుకొనేందుకు అతను కొంత త్యాగం చేయాలనే భావను ప్రకటింపజేసే తత్వం కలిగినది ఆయన మతం.

సంశయాత్మకుడైన విజ్ఞానిగా, ఉద్రేక పూరితుడైన హేతువాదిగా ప్రారంభించి నరేంద్రనాథ దత్తుడు, (యితని తరువాతి నామమే వివేకానందుడు) కనబడిన ప్రతి ఋషిని, ప్రతి యోగినీ "మీరు దేవుణ్ణి చూశారా ?" అని ప్రశ్నిస్తూ తిరిగారు. చివరకు శ్రీ రామకృష్ణ పరమహంస తప్ప ఎవ్వరూ అతనికి సరియైన సమాధానం చెప్పలేకపోయారు. "అవును వత్సా! నిన్ను నేను చూచినట్లే దైవాన్ని చూచాను ఇంతకన్నా స్పష్టంగాకూడా చూచాను" అని శ్రీ రామకృష్ణ పరమహంస వివేకానందునికి జవాబిచ్చారు. రామకృష్ణుని ఆధ్యాత్మిక పరిపోషణలో సర్వ మత సమన్వయ సిద్ధాంతాన్ని అవగాహన గావించుకొని, విశ్వైక మత తత్వాన్ని సమర్థించగలిగిన సత్వ సంపన్నులు కాగలిగారు స్వామీజీ

1893 సెప్టెంబరు 11 భారత దేశానికి గర్వకారణమైన దినం. ఆనాడే చికాగోలో జరిగిన ప్రపంచ మతాల మహాసభలో వివేకానందుడు గావించిన గంభీరోపన్యాసం నల్గడల మార్మ్రోగి, దిగ్దంతులను దద్దరిల్ల జేసింది.

ఎప్పటికైనా ప్రపంచానికంతా ఒకే మతం అనేది గనుక ఏర్పడడం సంభవిస్తే అది యిలా వుండాలి. స్థల, కాల నిర్ణయాలకు అతీతమై, తాను బోధించే భగవంతునివలె అనంతమై, పుణ్యాత్ములూ, పాపాత్ములూ, హైందవుడూ, క్రైస్తవుడూ అనే వ్యత్యాసాలు లేకుండా అందరినీ సమాదరించ కలిగినదై, బ్రాహ్మణ మతమనీ, బౌద్ధ మతమనీ, క్రైస్తవ మతమనీ యిస్లామ్ మతమనీ ఏ ఒక్క మతానికీ చెందనిదై, అన్ని మతాల సారాన్ని జీర్ణించుకున్నదై, ప్రతి నిత్యం ప్రవర్థమానమయ్యేందుకు అవకాశాలు కలిగి, అది మానవుని మొదలుకొని అధ్యాత్మిక పరిణతిని పొందకలిగిన పుణ్యపురుషుల వరకూ అందరినీ తన పరిధిలో యిముడ్చుకొనకలిగినదీ, అనశ్వరమై ప్రకాశించ కలిగేదీ— ఈ మతం హింసకూ, దౌర్జన్యానికీ యిందులో తావులేదు. సంకుచిత మత తత్వాలకు యిక్కడ ఆశ్రయం లభించదు. ప్రతి వ్యక్తిలో దేవుని అంశ వుందనీ, ఆ దేవుని చేరుకొనేందుకు అవసరమయ్యే శక్తి సంపత్తిని మానవలోకానికి సమిష్టిగా అందించేందుకు వివిధ మతాలు పరస్పరం సహకరించుకోవలెననీ బోధించేదే ఈ మతం. ఒకరినొకరు అర్థంచేసుకొని, ఒకరి మతాన్ని మరియొకరు అవగాహన కావించుకొని, వ్యక్తిత్వాన్ని పరిరక్షించుకుంటూ తన కనుగుణమైన పద్ధతిలో ప్రతి ఒకడూ అభివృద్ధి చెందాలి అని ప్రబోధిస్తుంది ఈ మతం.

స్వామి వివేకానంద జ్ఞానియైన దేశ భక్తాగ్రేసరుడు, దేశానికి క్షేమకరం కాని దానినీ, మతాల్లో కనుపించే లోపాలనూ నిర్భయంగా బయటపెట్టి విమర్శించేందుకు ఆయన వెనుకంజవేసేవారు కాదు. అస్పృశ్యతను పాటించడం మహా పాపం అని, అది అవశ్యం వర్జనీయమని ఆయన వాదించారు.

ఆయన స్థాపించిన రామ కృష్ణ మిషన్ మత, సాంస్కృతిక, సాంఘిక, విద్యారంగాలలో మానవ సమాజానికి అపూర్వ సేవల నందించే గొప్ప సంస్థగా నేటికీ ప్రకాశిస్తున్నది.

ప్రతి ఒకడూ బల సంపన్నుడు కావాలని ఆయన సందేశం చాటుతుంది. మోసగాడైనా సరే బలవంతుడైతే, ఎప్పటికైనా తనలోని బల సత్వాలకు, మోసగుణం తలవంచక తప్పదని ఆయన అభిప్రాయం.

నేటి ప్రపంచ పరిస్థితులలో వివేకానందుని దివ్య సందేశం ఎంతో ప్రాముఖ్యతను సంతరించుకున్నది. "సమాజం వర్ధిల్లాలంటే అందరూ ఏకాభిప్రాయులుగా వుండాలి. ఒకరితో ఒకరు ప్రతి చిన్న విషయానికీ పోట్లాడుకుంటూ పోతే సమాజం శక్తి హీనమౌతుంది. పటిష్ఠమైన సమాజ బలంమీదనే భావి భారతం ఆధారపడి వుంది. ఆ శక్తి నశించిన నాడు సమాజం పురోగమించలేదు. అందువల్ల ప్రజలు తమలోని కీచులాటకు స్వస్తి వచనం పలకాలి". నిజంగా ఆయన పలుకులు రత్నపు తునకలు.

## నేతాజీ సుభాస్ చంద్రబోస్

(జననం: జనవరి 23, 1897)

లాంఛనాయుతంగా భారత దేశానికి స్వాతంత్ర్యం లభించిన రోజు 1947 ఆగస్టు 15, కాని నిజానికి, తాత్కాలికమని చెప్పబడినా, స్వేచ్ఛా భారత ప్రభుత్వం స్థాపించబడి ప్రకటించబడింది యింతకన్నా చాల ముందుగానే. అంటే 19 3 అక్టోబరు 21న ఈ ప్రభుత్వం రూపొందింది. యిందులో ప్రత్యేకత ఏమిటంటే స్వేచ్ఛా భారత తొలి ప్రభుత్వం భారత భూభాగంమీద కాక సింగపూరు భూభాగంపై స్థాపించి, ప్రకటించబడింది. ఈ సంఘటన వెనుక మనకు కనుపించే అసహాయ శూరుడు శ్రీ నేతాజీ సుభాస్ చంద్రబోస్.

నేతాజీ! ఏమా పేరులో వుండే మహాత్మ్యం! ఆ ధ్వని మనలో ప్రవేశించి మనలను చైతన్యపూరితులను గావిస్తుంది. మనలో ఒక విచిత్రమైన, వర్ణనాతీతమైన అనుభూతిని సృష్టిస్తుంది. అద్వితీయుడైన ఆ వీరాగ్రేసరుడు, కష్టాలు పడ్తూ, త్యాగాలు చేస్తూ, రెండవవాని సహాయం లేకుండా, బాధలగుండా, పరితాపాలగుండా తనతోపాటు అశేష ప్రజానీకాన్ని ముందుకు నడిపించుకొని పోగలిగిన ధీశాలి!

పదిహేడేండ్ల బాలునిగా అడవులవెంట, హిమాలయ పర్వత శ్రేణి లోయల వెంట నాయకునికోసం— అంటే ఆధ్యాత్మిక మార్గదర్శికోసం—నిరంతరం అన్వేషణ సాగించాడు. ఆయనకెవ్వరూ తగినవారు గోచరించలేదు. తిరిగి యింటికి చేరుకున్నాడు. ఆయనకు ఆయనే నాయకుడయ్యాడు. కర్మయోగాన్ని అవలంబించి తూ చా. తప్పక దాన్ని పాటించి, బాహిరంగా కాకపోయినా కర్మిష్ఠిగా తాను దైవశక్తి సంపన్నుడు కాగలిగాడు.

తాను కలకత్తా కాలేజీలో చదువుతున్న రోజుల్లో, ఐరోపా దేశస్థుడైన ఒక ప్రొఫెసర్ అహంభావంచూపి ప్రవర్తించిన దానికి నిరసనగా ఆయన సమ్మె జరిపి దానికి నాయకత్వం వహించారు.

చతుర్థ శ్రేణిలో తాను ఐ. సి. యస్. పరీక్షలో ఉత్తీర్ణుడైనప్పుడు ఉజ్జ్వలమైన, సౌభాగ్య దాయకమైన భవిష్యత్తు తన్ను ఆహ్వానిస్తున్నా లెక్కచేయక, దాన్నికాదని దేశసేవా పథంలోకి తన జీవిత మార్గాన్ని త్రిప్పుకోగలిగిన విశిష్ట దేశభక్తుడాయన. బొంబాయిలో సుభాష్ గాంధీజీని కలుసుకున్నారు. కాని ఆయన నాయకత్వం సుభాసును ప్రభావితుని చేయలేక పోయింది.

కొన్నాళ్ళపాటు నేతాజీ దేశబంధు చిత్తరంజనదాసు నాయకత్వాన్ని అంగీకరించి, అనుసరించారు. కలకత్తాలోని నేషనల్ కాలేజీ ప్రిన్సిపాలుగా, కార్పొరేషన్ ప్రముఖ నిర్వహణాధికారిగా, మేయరుగా నాయకత్వపు విశిష్ట లక్షణాలను ఆయన ప్రదర్శించారు.

'దేశబంధు'ని మరణానంతరం వంగదేశం సుభాష్‌ను నాయకునిగా స్వీకరించింది. 1933 లో ఒకసారి గాంధీజీ పర ప్రభుత్వంతో సంప్రదించేందుకు శాసనోల్లంఘన ఉద్యమాన్ని కొద్దిసేపు విరమింపజేసినప్పుడు'' గాంధీజీ చేసిన పని అపజయాన్ని తనంతట తాను ఒప్పుకున్నట్లే అవుతుంది'' అని నిర్మొహమాటంగా, ధైర్యంగా చెప్పకలిగిన సాహసి సుభాష్. 1938 లో హరిపురం కాంగ్రెస్ అధ్యక్ష పదవికి ఉద్దండులైన ముగ్గురు నాయకులు_ అంటే మౌలానా అబుల్‌కలామ్ అజాద్, జవహర్‌లాల్ నెహ్రూ, ఖాన్ అబ్దుల్ గఫర్‌ఖాన్ వంటి వ్యక్తులు పోటీనుంచి విరమించుకొని ఆ పదవికి సుభాష్‌ను ఏకగ్రీవంగా ఎన్నుకున్నారంటే ఇది నిజంగా నేతాజీ నాయకత్వానికి ఒక బ్రహ్మాండమైన విజయంగా భావించవచ్చు.

పార్టీ అనుసరించే విధానాలు, కార్యక్రమాల ప్రాతిపదిక పై అధ్యక్షుని ఎన్నిక జరగాలని సుభాష్ అభిప్రాయం. ఈ సమస్య విషయంలో కృషిచేసి ఆయన మరో ఘనవిజయాన్ని సాధించారు. ఈ సందర్భంలోనే ఆయన డా॥ పట్టాభి సీతారామయ్య వంటి రాజకీయ చతురుని ఓడించి త్రిపుర కాంగ్రెస్ అధ్యక్ష పీఠాన్ని అలంకరించ కలిగారు. పట్టాభి అపజయం, తన అపజయంగా భావిస్తున్నానని ఆ సమయంలో గాంధీజీ చెప్పక తప్పిందికాదు. రెండవ ప్రపంచ యుద్ధం విరుచుక పడింది. స్వేచ్ఛా సాధనకిది అదనైన తరుణమని సుభాష్ భావించారు. బ్రిటిష్‌వారికి అవి గడ్డు రోజులు. ఈ విషమ పరిస్థితిలో వారిని తబ్బిబ్బు పరచడం గాంధీజీకి అంత యిష్టంలేదు. ''బ్రిటన్‌ను రక్షిస్తామని మాట్లాడడంలో అర్థంలేదు. అది మంచిపనికాదు'' అని సుభాష్ అన్నారు. భారత దేశం మొదట తన సద్గతి చూసుకోవాలి. తన స్వేచ్ఛను గురించి ఆలోచించాలి. ఆ ప్రయత్నాలలోనే నిమగ్నం కావాలి. తక్షణం మనం కార్యరంగంలో దూకాలి__అని నేతాజీ త్వరపడేవారు. ఇదివరకు అనుసరించిన పంథా ఆయనకు నచ్చలేదు. బ్రిటిష్‌వారితో యుద్ధం సాగించే (శత్రు) రాజ్యాలనుండి సహాయం పొందాలని ఆయన అభిమతం.

అంతే. అయన దీక్ష వహించి, మీసాలూ గడ్డాలూ పెంచేసి, అద్భుతంగా కలకత్తానుండి తప్పించుకొని వెళ్ళిపోయారు. పెషావర్‌కు పోతూ మౌల్వీ జియావుద్దీన్ అనే పేరుతో యిన్సూరెన్సు ఏజెంటు గానూ, కాబూల్‌వద్ద చెవిటి వానిగా, మూగవానిగా చలామణీ అవుతూ ప్రయాణం చేసారు. ఎత్తైన కనుమలగుండా, అగాధమైన లోయలగుండా, బ్రహ్మాండమైన ఎడారులగుండా, భయంకరమైన కీకారణ్యాలగుండా, లారీలోనూ, కాలినడకనూ, రోడువెంటా, పడవలమీదా ఆయన ప్రయాణం సాగింది. సత్రాల్లో, మసీదుల్లో తలదాచుకోవలసి వచ్చింది.

రాజభోగాలు అనుభవించవలసిన వానికి ఎటువంటి కష్టాలు! ఎటువంటి దుర్భర పరిస్థితులు!! ఎందుకోసం యీ యాతనలు? ఎవరికోసమీ కష్ట పరంపరానుభవాలు? తల్లి భారతి దాస్య శాప విమోచనం గావించేందుకే. మన మేదైనా సాధించాలంటే ముందు కొంత త్యాగం చేయాలి. మాతృదేశానికి స్వేచ్ఛను సాధించాలనేది ఆయన కోరిక. అందుకే ఆయన తన రక్తాన్ని ధారపోసేందుకు సంసిద్ధుడయ్యారు. కలకత్తానుండి భూమార్గంలో మాస్కోకు చేరుకున్నారు విమానంమీద బెర్లిన్‌కు ప్రయాణంచేసారు జర్మనీనుండి దుర్గమమైన ప్రమాద భూయిష్టమైన సముద్రమార్గం గుండా జలాంతర్గామిలో ప్రయాణం సాగించి టోకియో చేరుకున్నారు. టోకియోనుండి చారిత్రాత్మక సింగపూరు చేరుకున్నారు. ఇక్కడే అజాద్ హింద్ తాత్కాలిక ప్రభుత్వాన్ని స్థాపించి బ్రిటన్‌పై యుద్ధం ప్రకటించారు. నేతాజీ అంటూ పిలువబడ్డారు. ఆయనది అమోఘమైన నాయకత్వం ఆయన శంఖారావాన్ని అందుకొని అనేకమంది విరాళాలు గుమ్మరించారు. వేలాది జనం సైన్యంలోచేరి రక్తాన్ని ధారపోసేందుకు ముందుకు పరుగెత్తారు. ఇక ధనమంటారా_కోట్లలో వచ్చిచేరింది. కోట్లకొలది ప్రజల ఆదరాభిమానాలను చూరగొన్న ప్రియతమ నాయకుడు నేతాజీ. దేదీప్యమానమైన దేశభక్తి, అయస్కాంతం వలె అందరినీ ఆకర్షించ కలిగిన అపూర్వనాయకత్వం_ ఇవి సాహసోపేతుడైన అద్భుతవ్యక్తి నేతాజీ విశిష్ట లక్షణాలు.



డా. జాకీర్ హుసేన్

(జననం: 8 ఫిబ్రవరి 1897)

భారతదేశ రిపబ్లిక్ మూడవ రాష్ట్రపతిగా పదవీ ప్రమాణ

స్వీకారం చేసిన అనంతరం డా. జాకిర్‌హుసేన్, సంపూర్ణ సేవా తత్పరతతో, వినమ్రతతో తాను ఈ బాధ్యత స్వీకరిస్తున్నట్లు పేర్కొన్నారు. ప్రమాణ స్వీకారం చేసినప్పటికీ, చేయక పోయినప్పటికీ ఆయన ఎల్లప్పుడూ సేవాతత్పరుడే. వినమ్రుడే.

విద్యాభివృద్ధికీ, జాతీయభావం ప్రచారానికీ ఆయన తమ సేవలను అర్పించారు. కొన్ని దశాబ్దాల క్రితం భారతీయ ముస్లిములను వేరు పడడం, కలిసివుండడంలో దేనిని వరించాలన్న సమస్య ఎదుర్కొన్నప్పుడు జాకిర్‌సాహేబ్ సమైక్యతను కోరుకున్నారు.

జాతీయ ముస్లిం విశ్వవిద్యాలయమైన జమియామిలియా ఇస్లామియాను డా. జాకిర్‌హుసేన్ స్థాపించారు. రెండు దశాబ్దాలకు పైగా దానిని పెంచి పోషించారు. గాంధీజీ తమ కుమారుడు శ్రీ దేవదాసును విద్యాభ్యాసానికై ఈ సంస్థకు పంపించారు. ఈ విశ్వవిద్యాలయం పరిపూర్ణమైన జాతీయ సంస్థగా భాసిల్లడానికి ఈ విద్యావేత్త కృషి చేశారు.

డా. జాకిర్ హుసేన్ అధికారాన్ని ఎప్పుడూ ఆశించలేదు. విద్యాప్రచారమే ఆయన ధ్యేయం. విద్యకు ఆయన విశేష ప్రాముఖ్యం యిచ్చారు.

1920 వ సంవత్సరంలో ఆయన గాంధీజీ పిలుపునందుకొని అలీఘర్ ఎం. ఏ. ఓ కళాశాలను విడిచివచ్చారు. ఆయన ఎల్లప్పుడూ నిశ్శబ్దంగా నిర్మాణాత్మకమైన కృషి జరిపారు.

"సమస్త భారతదేశమూ నా స్వగృహము వంటిది అందలి ప్రజలందరూ నా కుటుంబ సభ్యుల వంటివారు" అన్న ఉదాత్త స్వభావమునకు ప్రభావితుడైన దేశభక్తుడు, విద్యావేత్త డా. జాకిర్‌హుసేన్‌కు దేశంలోని వేర్పాటు ధోరణులు ఎంతో బాధ కలిగిస్తాయి. "ద్వేషాగ్ని జ్వాలలు త్వరితంగా వ్యాపిస్తున్నాయి. ఉదాత్తమైన భూమిలో అగ్ని రగులుకున్నది. ఉదాత్త, విజ్ఞతను పాటించేవారు దీని మధ్య ఎట్లు వర్ధిల్లగలరు? మృగాలకంటె కూడా చాలా తక్కువ స్థాయిలో వున్న నేటి మానవ ప్రమాణాలను ఎట్లు మెరుగుపరచగలము?" అని ఆయన ఆవేదన పడతారు. శ్రద్ధగా ఆలకించవలసిన మాటలు ఇవి.

## సరోజినీదేవి

(జననం: 13 ఫిబ్రవరి, 1879)

సరోజినీనాయుడు కవితా జీవితం 11 సంవత్సరాల చిరుత ప్రాయంలోనే ప్రారంభమైంది. ఆల్జీబ్రా సమస్యతో సతమతమైన ఆమెకు ఒక పద్యానికి పాదాలు స్ఫురించాయి. 13వ యేట ఆమె 1,300 పంక్తులు కలిగిన దీర్ఘమైన ఒక పద్యాన్ని, 2,000 పంక్తుల నాటకాన్ని రచించింది. 16 వ యేటనే ప్రసిద్ధ సాహిత్య విమర్శకుడు ఎడ్మండ్ గోసే దృష్టిని ఆమె రచనలు ఆకర్షించాయి.

1914 వ సంవత్సరంలో లండన్‌లో గాంధీజీని కలుసుకోవడంతో సరోజినీ జీవితంలో మలుపు ఏర్పడింది. ఈ పరిచయం, వారి మధ్య గురు శిష్యుల వంటి అద్వితీయమైన ఆధ్యాత్మిక సంబంధాన్నీ, మైత్రినీ పెంపొందించింది.

సాంఘిక సంస్కరణ రంగంలో కూడా సరోజినీనాయుడు ప్రముఖురాలుగా పేరు పొందారు. అంతర్వర్ణ వివాహాలను ఆమె ప్రోత్సహించారు. బెంగాలుకు చెందిన ఈ బ్రాహ్మణ



వనిత, హైదరాబాదు వాస్తవ్యులైన డాక్టర్ ముత్యాల గోవిందరాజులు నాయుడును పరిణయమాడారు. ప్రఖ్యాత సంఘ సంస్కర్త కందుకూరి వీరేశలింగం పంతులుగారు వీరి వివాహ మహోత్సవానికి అధ్వర్యం వహించారు.

భారత జాతీయకాంగ్రెసు అధ్యక్ష పీఠాన్ని అలంకరించిన తొలి మహిళ సరోజినీనాయుడు. గాంధీజీ ప్రారంభించిన అన్ని ఉద్యమాలలోనూ ఆమె పాల్గొన్నారు. స్వాతంత్ర్యోదయాన్ని చూచే భాగ్యం ఆమెకు కలిగింది. తొలి మహిళా గవర్నరుగా ఆమెను నియమించి స్వతంత్ర భారతదేశం ఆమెను గౌరవించడమేగాక తనను తాను గౌరవించుకున్నది.

సరోజినీనాయుడు హైద్రాబాదులో జన్మించడం ఆంధ్రప్రదేశ్ వాస్తవ్యులమైన మనకు గర్వకారణం. మూసీని గురించీ, ఇచ్చటి బజార్లు, గోపురాలను గురించీ ఆమె కవితలు చెప్పారు. గాంధీజీతో కలిసి ఆమె హిందూ ముస్లిముల ఐక్యత కొరకూ, జాతీయ సమైక్యత కొరకూ పాటుపడ్డారు.

## అన్నాదురై

(జననం: 15 సెప్టెంబరు 1909)

దక్షిణ భారతదేశంలో సుప్రసిద్ధ రాజకీయనాయకులు శ్రీ సి. ఎన్. అన్నాదురై 1909 సెప్టెంబరు 15వ తేదీన కాంచీపురంలో జన్మించారు. మద్రాసులోని పచ్చయ్యప్ప కాలేజీలో చదువుకుని రాజకీయ, ఆర్థికశాస్త్రాలలో ఎం. ఏ. డిగ్రీ తీసుకున్నారు. చిన్నప్పటినుండి వక్తగా భాసించారు. సమస్యలపై శ్రద్ధ తీసుకునేవారు. జస్టిస్‌పార్టీలోను, 'సెల్ఫ్ రెస్పెక్ట్' ఉద్యమంలోనూ ఆయన ప్రముఖపాత్ర వహించారు. జస్టిస్‌పార్టీ ఆంగ్ల దినపత్రిక అయిన 'ది జస్టిస్'లో ఆయన ఉప సంపాదకునిగా పని చేశారు.

తర్వాత ఆయన స్వతంత్రంగా తమిళ వారపత్రిక 'ద్రవిడనాడు'ను ప్రారంభించారు. ద్రవిడకజగం నాయకుడు శ్రీ ఇ. వి. రామస్వామి నాయకర్‌తో 1949 వరకు ఆయనకు సన్నిహిత సంబంధం వున్నది. హిందీని ప్రవేశపెట్టినందుకు నిరసనగా జరిగిన ఉద్యమంలో పాల్గొన్నందుకు ఆయనను అరెస్టు చేశారు.



ద్రవిడ మున్నేట్రకజగం (డి. యం. కె.) పార్టీని స్థాపించి దక్షిణ భారతదేశం రాజకీయాలలో ఒక నూతన శకాన్ని ప్రారంభించారు. 18 సంవత్సరాలలో ఆ పార్టీని ఎంతో అభివృద్ధి చేశారు. నాల్గవ సాధారణ ఎన్నికల అనంతరం ఈ పార్టీ పదవిలోనికి వచ్చింది. తమిళభాషపట్ల, తమిళ సంస్కృతిపట్ల, ప్రజల ప్రేమాభిమానాలను, ఆదరణను ఈ పార్టీ పెంపొందించింది.

మూడవ సాధారణ ఎన్నికల ముందు డి. యం. కె 'ద్రవిడనాడు' వాదాన్ని విడిచిపెట్టి, భారత యూనియన్‌లో దక్షిణ రాష్ట్రాల ఐక్యతకు కృషి చేసింది. 1967 సాధారణ ఎన్నికలలో డి. యం కె ఘన విజయం పొంది, ప్రభుత్వాన్ని ఏర్పాటు చేసుకోగలిగింది. పార్లమెంటు సభ్యునిగా ఎన్నికైన శ్రీ అన్నాదురై ఆ పదవికి రాజీనామా నిచ్చి, రాష్ట్ర శాసన మండలి సభ్యులయారు. ఆయన ముఖ్యమంత్రిగా డి. యం, కె. పార్టీ రాష్ట్రంలో మొట్టమొదటి సారిగా పాలనను నిర్వహించింది. ముఖ్యమంత్రిగా రెండు సంవత్సరాలు మాత్రమే పని చేసినప్పటికీ శ్రీ అన్నాదురై మద్రాసు, కోయంబత్తూరులలో రూపాయికి శేరు చొప్పున బియ్యం విక్రయం, హిందీని వ్యతిరేకించిన ద్విభాషా సూత్రాన్ని అమలుపరచడం, సామర్థ్యంతో పరిపాలనను నిర్వహించడం మొదలగు ఘన విజయాలను సాధించారు. కేంద్రంతో రాజకీయంగా వైరం ఉన్నప్పటికీ శ్రీ అన్నాదురై ఆందోళనను లేవదీయలేదు. విజ్ఞప్తుల ద్వారా ఆయన తన విధానాలను తెలియజేశారు. వివిధ ఉద్యమాలలో పాల్గొన్నందుకు ఆయన అనేక సార్లు జైలుశిక్ష అనుభవించారు.

శ్రీ అన్నాదురై 30కి పైగా పుస్తకాలు వ్రాశారు. వాటిలో నవలలు, చిన్నకథలు, నాటకాలు ఉన్నవి. శ్రీ అన్నాదురైను సామాన్య ప్రజలు ఆరాధించారు. ఆయన సమావేశాలకు వేలాది సంఖ్యలో ప్రజలు హాజరై ఆయన చేసిన మహోపన్యాసాలను విని ఆనందించేవారు. అనుచరులకు ఆయన 'అన్నా' వంటివారు. ఆయనను 'తమిళనాడు గాంధీ' అని కూడ పిలిచేవారు.



## లూయీ బ్రైల్

(జననం: 4 జనవరి 1809)

లూయీ బ్రెల్ అంధులకు చేసిన సేవ చిరకాల స్మరణీయమైనది. ప్రపంచంలో అంధులు వున్నంత వరకూ ఆయనపేరు చరిత్రలో స్మరింపబడుతూనే వుంటుంది.

లూయీ బ్రైల్ 1809 లో ఫ్రాన్సుదేశంలో కోవ్‌రె అనే గ్రామంలో జన్మించారు. ఆయన తండ్రి సైమన్ రెనే బ్రైల్ జీనులు తయారు చేసి అమ్మి జీవనం వెళ్ళబుచ్చుతుండేవాడు. వృద్ధాప్యంలో కొడుకు తనకు తన పని పాటల్లో చేదోడు వాదోడుగా వుంటాడని ఆయన భావించాడే తప్ప పుట్టిన ఆ బిడ్డ అంధుడవుతాడని తలచనే తలచలేదు!

లూయీబ్రైల్ చాలా చురుకైన కుర్రవాడు. మంచి తెలివి తేటలుగల వాడు కూడా. ఒకసారి మూడేళ్ళ వయసులోనే, తండ్రి వుపయోగించే పనిముట్లను చేతిలోకి తీసుకుని వాటితో తండ్రిలా పనిచేయడానికి ప్రయత్నించాడు. అదిజారిపోయి కంటిలో గుచ్చుకుని పెద్దగాయం తగిలింది. ఎన్నిమందులు వేసినా, ఎన్నికట్లు కట్టినా

లాభం లేకపోయింది. కంటిగుడ్డు బాగుపడలేదు. క్రమంగా రెండో కన్ను కూడా పాడై చూపుపోయి పూర్తిగా గ్రుడ్డివాడై పోయాడు.

ఆ గ్రామంలోని పాదిరీ అబ్బీ జాక్విస్ పాల్ అబాలుని గూర్చి ప్రత్యేక శ్రద్ధ తీసుకున్నారు. ఆయన వల్లనే లూయీ బ్రైల్ ప్రకృతిలోని వివిధ ప్రాణులను గూర్చి, వస్తువులను గూర్చి, వర్ణమయజగతిని గూర్చి, కాంతిమయ ప్రకృతిని గూర్చి తెలుసుకోగలిగాడు.

ఆ తర్వాత ఆ గ్రామంలో అంటోనీ అనే ఉపాధ్యాయుడు లూయీ ఎడ ప్రత్యేక శ్రద్ధవహించి పాదిరీగారి కృషిని తను చేపట్టికొనసాగించాడు. ఇతర బాలురు కళ్ళతో చూసీ, చదివీ ఏమేమి నేర్చుకున్నారో లూయీబ్రైల్ కూడా తెలుసుకునీ, కంఠస్థం చేసీ నేర్చుకున్నాడు. అతని తెలివి తేటలకు ఉపాధ్యాయులు ఆశ్చర్యపోతుండేవారు. పాదిరీగారూ, గ్రామ ఉపాధ్యాయుడూ యిద్దరూ ఆ బాలుని భవితవ్యాన్ని తీర్చిదిద్దడానికి కలిసికట్టుగా పరిశ్రమించారు లూయీ బ్రైల్‌ను పాఠశాలలో ఆ ఉపాధ్యాయుడు చేర్చగలిగాడు.

ఎంతో ప్రజ్ఞతో పాఠశాలలో చెప్పే విషయాలన్నీ బ్రైల్ గ్రహించగలిగేవాడు. వాటిని అర్థంచేసుకుని గుర్తుంచుకునేవాడు. 14 వ యేట జోళ్ళు తయారుచేసే వర్కు-షాపులో లూయీబ్రైల్ ఫోర్‌మన్‌గా పని చేశాడు విద్యార్థి దశలోనే ఆల్జీబ్రా, వ్యాకరణం, జాగ్రఫీ వంటి సబ్జెక్టులను తోటిబాలురకు లూయీ చెప్పగలుగుతుండేవాడు.

1819లో ఛార్లెస్ బార్బేర్ అనే సైనికాధికారికి రాత్రుళ్ళు రహస్య సందేశాలను పంపించడం ఒక క్లిష్టసమస్యగా వున్నప్పుడు స్పర్శామాత్రాన తెలుసుకోవడానికి వీలుగా కార్డుబోర్డు మీద చిన్న చిన్న కన్నాలుచేసి చూశాడు అదిఎంతవరకు వుపయోగిస్తుందో తెలుసుకుందామని దానిని అంధుల పాఠశాలలో పరీక్షించాలని భావించాడు. దానిని పరీక్షించిన వారిలో లూయీ బ్రైల్ ఒకరు. అప్పటికే లూయీబ్రైల్ కంటితో చూసి వ్రాసే వ్రాతకాక ఒక కొత్త రకపు వ్రాతపద్ధతినిగూర్చి ఆలోచిస్తుండేవాడు. అతనికి యీ కన్నాల పద్ధతి బాగా నచ్చింది ఆయనా, అతని మిత్రులూ యీ కన్నాలను బాగా పరిశీలించారు. దాని మంచిచెడ్డలను గురించి చర్చించారు. ఛార్లెస్ బార్బేర్, పాఠశాలకు వచ్చేప్పటికి పదిహేనేళ్ళ కుర్రవాడు కన్నాలద్వారా వ్రాసేపద్ధతిని పరిశీలిస్తుండడం చూసి ఆశ్చర్యపోయాడు.

లూయీబ్రైల్ ఆరుకన్నాలను 63 రకాలుగా కలిపి వ్రాయడానికీ చదవడానికీ, వీలయిన ఒక కొత్త పద్ధతిని రూపొందించాడు. తనను చూసి వ్యంగ్యంగా నవ్వేవారి నవ్వుల్ని ఆయన ఎప్పుడూ లక్ష్యపెట్టలేదు. తన విధానాన్ని బాగా క్రమబద్ధంచేసిన అనంతరం ఆయన 18.9 లో వ్యాకరణ సంబంధమైన పుస్తకాన్ని ఒకదానిని ప్రచురించినప్పుడు, తనకు యీరకమైన ఆలోచనకు కారకుడైన బార్బేర్ బ్రైల్‌కు కృతజ్ఞత తెలుపుకున్నాడు. 1834 లో పేరిస్‌లో జరిగిన "పారిశ్రామిక ప్రదర్శనలో" యీవిధానాన్ని పరీక్షించాలని బ్రైల్ భావించాడు. ఈ విధానాన్ని ఏనాటికైనా లోకం ఆదరించి తీరుతుందని ఆయనభావించాడు. రెండు కళ్ళను కోల్పోయిన అంధులకు లూయీబ్రైల్ ఆరుచుక్కలకళ్ళను ప్రసాదించాడు.

## శ్రీ బందా

శ్రీ బందా కనకలింగేశ్వరరావుగారి మరణంతో లలిత కళా ప్రపంచంలో జాజ్వల్యవంతమైన ఒక తార రాలిపోయినట్లయ్యింది. కళా సరస్వతి మ్రోల వెలిగే ఒక కాంతి జ్యోతి ఆరిపోయింది. తెలుగు రంగస్థలానికి అనేక సంవత్సరాల క్రిందటే అద్వితీయమైన సేవచేసి అపారమైన కీర్తిప్రతిష్ఠలను ఆయనఅందుకోగలిగారు. తెలుగు రంగస్థలం మీద బళ్ళారిరాఘవ, స్థానం నరసింహారావుగార్లు సూర్య ప్రభా సమానులై వెలుగొందుతున్న సమయంలో వారి మధ్యనిలచి, ప్రముఖ రంగస్థల నటుడుగా భాసిల్లగలిగారు.

బందా కనకలింగేశ్వరరావుగారు కూచిపూడినృత్య సాంప్రదాయాన్ని పునరుద్ధరించడానికి చేసిన సేవ అనుపమానమైనది. కూచిపూడి నృత్యం నామ మాత్రావశిష్టమైపోతున్న రోజుల్లో శ్రీ బందాగారు దానిని పునఃప్రతిష్ఠించి ప్రచారంచేయడానికి తన యావచ్ఛక్తినీ వినియోగించారు. బహుళజనాదరణను కలిగించారు. ఈ నాడు కూచిపూడి నృత్యం దేశంలోని ముఖ్యమైన నృత్యాలలో ఒకటిగా పరిగణించబడుతున్న విషయం ప్రత్యేకించి చెప్పనక్కరలేదు.

కళల వికాసానికే తన కాలాన్నంతటినీ వినియోగించిన బందా కనకలింగేశ్వరరావుగారు అయిదేళ్ళ క్రిందటే నటనలో జాతీయ బహుమతిని అందుకున్నారు. ఆయన నటుడే కాదు మంచి నిర్వాహకుడు కూడా. ఆకాశవాణిలో నాటక ప్రయోక్తగా ఆయన నిర్వహించిన కార్యక్రమాలు, చేసిన కృషి అద్భుతమైన ప్రజ్ఞాపాటవానికి చిహ్నాలు. నిజంగా ఆయన ఆంధ్ర కళారసరాట్టు.

## శ్రీ వెలగపూడి రామకృష్ణ

ప్రసిద్ధ పారిశ్రామికవేత్త శ్రీ వెలగపూడి రామకృష్ణ, ఐ సి.ఎస్. (రిటైర్డ్) 1968 నవంబరు 28న స్వర్గస్థులయ్యారు. చనిపోయేనాటికి ఈయనవయస్సు 73 సంవత్సరాలు. కె.సి.పి. లిమిటెడ్ ఛైర్‌మన్‌గానూ, వుయ్యూరు చక్కెరమిల్లు డైరెక్టర్ల మండలికి అధ్యక్షులుగానూ, మాచెర్లలోని రామకృష్ణా సిమెంట్సు కంపెనీ సంస్థాపకులుగాను శ్రీ వెలగపూడి ప్రసిద్ధికెక్కారు. పంచదార, సిమెంటు పరిశ్రమల పురోగతికి శ్రీ రామకృష్ణ విశేషంగా కృషిచేశారు. యంత్ర నిర్మాణ పరిశ్రమ రంగంలో మార్గదర్శి యనదగిన ఈయనకు ఆంధ్ర సిమెంట్సు, జయపూర్ షుగర్సు యిత్యాది పరిశ్రమల సంస్థాపనతో అత్యంత సన్నిహితమైన సంబంధం వున్నది. అఖిల భారత స్థాయిలోకూడా అనేక పబ్లిక్, ప్రైవేట్ రంగాల పరిశ్రమలతో ఈయనకు సంబంధం వుంది.

# ఆంధ్రప్రదేశ్‌లో అంధత్వ నివారణ చర్యలు

మన దేశంలో గ్రుడ్డివారు అధికసంఖ్యలో వున్నారు. మన దేశం ఎంత పెద్దదో యీ సమస్యలో కూడామనదేశం అంత పెద్దదిగానే వుంది. అంధుల సంఖ్యను బట్టి చెప్పాల్సివస్తే మన దేశం ప్రపంచంలో రెండవది. 1944 రికార్డులను బట్టి మన దేశంలో 20 లక్షల మంది గ్రుడ్డివారు వున్నారు. అంటే ప్రపంచంలోని మొత్తం గ్రుడ్డివారిలో అయిదోవంతు మన దేశంలోనే వున్నారన్నమాట.



అంధ విద్యార్థి బ్రెయిల్ లిపిలోవున్న పుస్తకాన్ని చదువుతున్న దృశ్యం

మన దేశంలో ప్రతి లక్ష జనాభాకి 500 మంది గ్రుడ్డివారున్నారు. ఆరోగ్యమంత్రిత్వ శాఖ అధ్వర్యం క్రింద ఇటీవల జరిపిన సర్వేనుబట్టి మన దేశంలో 40 లక్షల మంది గ్రుడ్డివారు వుండగలరని అంచనా. లండన్‌లో రాయల్ కామన్వెల్త్ సొసైటీ ఫర్ బ్లైండ్ వారి అంచనాలు కూడా యిదే విషయాన్ని ధృవపరుస్తున్నాయి. పాఠశాలలకు వెళ్ళే వయసులో వున్న పిల్లలలో సుమారు 4 లక్షలమంది గ్రుడ్డివారు వున్నారు.

మన రాష్ట్రంలో సుమారుగా 90,000 మంది గ్రుడ్డివారు వున్నారు. పాఠశాలకు వెళ్ళే వయసు పిల్లలలో గ్రుడ్డివారు సుమారు 18,000 వరకు వుంటారని అంచనా.

గ్రుడ్డివారికై ప్రభుత్వం నిర్వహిస్తున్న పాఠశాలలు మన రాష్ట్రంలో రెండువున్నాయి. వీటిలో సుమారు 150మంది విద్యార్థులు వున్నారు. ఈ రెండు పాఠశాలల్లోనూ గ్రుడ్డివారికి విద్యాబోధన గరిపి హెచ్. ఎస్. సి పరీక్షకు పంపిస్తారు. సంగీతంలోనూ, నేతపని మొదలైన వృత్తి కళలలోకూడా వీరికి శిక్షణ యిస్తారు. ఈ పాఠశాలల్లోని విద్యార్థులకు ఉచిత భోజన, వసతి సౌకర్యం కల్పించ బడుతుంది. వీరికి బట్టలకు, పుస్తకాలకు అలవెన్సులను కూడా యిస్తారు. ప్రభుత్వం, స్కాలర్‌షిప్పులను కూడా యిస్తుంది. నరసరావుపేట, గుంటూరు, భీమవరంలలో మూడు ప్రయివేటు పాఠశాలలు వున్నాయి. ఇవి ప్రాథమిక పాఠశాలలు. వీటిలో సుమారు నూరు మంది చదువుతున్నారు.

అంధులకు విద్య బోధించేందుకు శిక్షణయిచ్చే రెగ్యులర్ ట్రైనింగ్ సంస్థలు రాష్ట్రంలో ఏమీలేవు. హైదరాబాదులోని అంధుల కొరకు ఉద్దేశించిన ప్రభుత్వ ఉన్నత పాఠశాలలోనే అర్హులైన వారికి తాత్కాలిక ప్రాతిపదిక మీద బోధన విషయంలో శిక్షణ యివ్వడం జరుగుతున్నదే తప్ప రెగ్యులర్ పద్ధతిని జరగడం లేదు. వికలాంగులనిమిత్తం ఒక ప్రత్యేక ఉపాధి కల్పనా కేంద్రం ఒకటి హైదరాబాదులో వుంది. కేంద్ర ప్రభుత్వం అధ్వర్యం క్రింద యిది పనిచేస్తున్నది.

సాంఘిక–సాంస్కృతిక వాతావరణంలో వికలాంగులు కూడా యిముడగలిగేటట్లు చేయడమే వికలాంగుల విద్యలో ప్రాథమిక అంశం. అందువల్లనే సాధారణ విద్యా విధానంలో, వికలాంగులైన బాలలకు విద్య గరపడం ఒక ప్రధానమైన, విడదీయలేని అంశంగా పేర్కొనబడుతున్నది.

సంఘంలో గ్రుడ్డివారు కూడా సంపూర్ణమైన వ్యక్తులుగాకి ప్రయోజనకరమైన పౌరులుగా రూపొందడానికి వీలుగా వారి వీలయినంత ఎక్కువ సహాయాన్ని అందజేయడం అనేది అంధులకు విద్యగరపడంలోని స్థూలమైన అంశం.

నేడు మన రాష్ట్రంలో అంధులకు విద్యగరిపే పాఠశాలలు రెండేరెండు వున్నాయి. అందువల్ల వీటిలో ప్రవేశపు వత్తిడి చాలా ఎక్కువగా వుంది. కొద్దిపాటి అభ్యర్థులను మాత్రమే వీటిలో చేర్చుకోవడం జరుగుతున్నది. అంధ విద్యార్థులకు యింకా ఎక్కువమందికి విద్య గరపాలంటే కనీసం జిల్లా కొకటి అయినా రెసిడెన్షియల్ ప్రాథమిక పాఠశాల అంధులకొరకు వుండాలి.

అంతే కాదు అంధులకు పునరావాసం, ఉపాధి సౌకర్యాలను కలిగించే నిమిత్తం ఒక షల్టర్డ్ వర్కుషాపు వుండడం చాలా అవసరం. ప్రయోగాలు చేయడానికి వీలైన కేంద్రంగా వుపయోగించే ఒక నమూనా పాఠశాల అంధులకొరకు ఏర్పాటు చేయడం కూడా యీ నాడు చాలా అవసరం. గ్రుడ్డివారికి చదువుకోవడానికి తోడ్పడే గ్రంథాలను అచ్చువేయడానికిగాను ఒక బ్రెయిల్ ప్రెస్‌ను ఏర్పాటు చేయడం కూడా అవసరం. ఇవన్నీ ఒనగూడిననాడే గ్రుడ్డివారి పరిస్థితులు మెరగుపడే అవకాశంవుది.

సీరియల్ :

# గృహిణి

## పిలకా గణపతి శాస్త్రి

### జ రి గి న క థ

పార్థసారథి రాఘవ నాట్య కళామండలి ద్వారా నాటకాలు వేస్తుండేవాడు. ఒకసారి ఆయన ఏలూరులో శ్రీకృష్ణతులాభారం నాటకం వేశాడు. ఆ నాటకంలో పాల్గొనవలసిన సరోజ రాకపోవడము వల్ల నాటకం వాయిదాపడింది. తిరిగి స్వగ్రామం వచ్చిన పార్థసారథికి సరోజ మద్రాసు వెళ్ళినట్టు తెలిసింది. పార్థసారథికూడా మద్రాసు వెళ్ళి సరోజ బసచేసిన హోటలులో ఆమెను కలుసుకున్నాడు. సోమనాథం అనే సినిమా ప్రొడ్యూసర్‌తో సరోజ, ఆమె మేనమామ పేకాట ఆడుతుండగా పార్థ సారథి వెళ్ళాడు.

సోమనాథం ఇంచుమించుగా నల్లభై ఏళ్లున్న వ్యక్తిలా కనిపించాడు. మాంచి పుష్టిగా, వలంగా, బలంగా ఉన్నాడు. నీలిరంగు చలవకళ్ళజోడుతో సిల్కు సూటుతో బాగా భేషజంగా ఉన్నాడు. చురుగ్గా కనిపించాడు. అతను మాట్లాడినప్పుడు మద్య సేవ పరిమళం గుప్పున వ్యాపించింది.

ఇక వెంకట కృష్ణయ్య అనాడు అతరు సువాసనలతో ఘుమ ఘుమ లాడిపోతున్నాడు. జరీ అంచుపంచె కట్టుకున్నాడు. చేతులమీద పెద్దాపురం సిల్కు లాల్చీ వదులుగా వేళ్ళాడుతూంది. కళ్ళు, జేగురురంగు పూసినట్టు ఎర్రగా మెరుస్తున్నాయి. ధోరణిని బట్టి 'తీర్థం' విస్తారంగా సేవించినట్టున్నాడని పార్థసారథి అనుమానించాడు.



అంతలోనే సరోజ తన చేతిలోని ముక్కలన్నీ ఒక్కసారి కిందపడవేసి ఆ రమ్మీ ఆట గెలుచుకున్నట్టు వెల్లడించింది. వెంటనే వెంకటకృష్ణయ్య, సోమనాథము తమ జేబులలోనుంచి చెరొక పదిరూపాయలు పైకితీసి అభివందనలతో బాటు ఆమె చేతికందించారు. సరోజ ఆ ఆట అంతచక్కగా ఆడగలదని పార్థసారథికి అంతకు మునుపెన్నడు తెలియనే తెలియలేదు!

'ఎప్పుడు నేర్చుకున్నావు సరోజా రమ్మీ ఇంత చక్కగా ఆడుతున్నావు!'

ఉప్పొంగుతున్న ఆశ్చర్యంతో ఆకాశానికెత్తివేశాడు.

'మా సరోజ అసలే ఆటలో అందెవేసిన చెయ్యి! ఆ పైన ఈ వేళ నక్కని తొక్కివచ్చినట్టుంది!' వెంకటకృష్ణయ్య మరింతగా ఆమె చాకచక్యం మెచ్చుకున్నాడు. ఆ తరవాత అతడు తిరిగి కొత్త ఆటకోసం ముక్కలు కలపడం మొదలుపెట్టాడు.

'అనవసరంగా ఊరికే కూర్చోవడం ఎందుకు? పార్థసారథి గారు కూడా ఆడతారు. ఆయనకి కూడా ముక్కలు వెయ్యండి!'

ఆదే క్షణంలో సోమనాథం తన రిస్టువాచీకేసి చూసుకున్నాడు.

'ఏమండీ! వెంకటకృష్ణయ్యగారు! మనం నాలుగు గంటలకి బయలుదేరి వెడదామనుకున్నాంగా! మరి వెడదామా?'

ఆ ప్రశ్న వినగానే తానక్కడికి రాకమునుపే వారందరు కలిసి ఎక్కడికో వెళ్ళిపోవాలని నిశ్చయించుకున్నారని పార్థసారథికి తటాలున స్ఫురించింది. దానితో అతనికి వెంకట కృష్ణయ్య మీద ఎంతయినా కోపం వచ్చింది. అయితే అతిగుంభనగా ఆదిఅంతా నిగ్రహించు కున్నాడు. అంతలోనే వెంకటకృష్ణయ్య అందుకున్నాడు.

'ఇదిగో పార్థసారథిగారితోకూడా రెండు మూడు ఆటలు ఆడాక వెడదాము.'

అతనికి కూడా ముక్కలు పంచబోయాడు.

'నాకా ఆట అంతగా అలవాటు లేదు. అలవాటు లేకపోతే ఆటలో మజా ఏమి ఉంటుంది?'

పార్థసారథి తన కిష్టంలేదని అనకుండా మర్యాదగా తప్పించుకొన్నాడు. అయినా సరోజ అతన్ని విడిచిపెట్టలేదు.

'పోనీ బ్రిడ్జి ఆడదాము! ఆ ఆటంటే మీరు చెవి కోసుకుంటారుగా!'

దాని కంగీకరించిక తప్పలేదు పార్థసారథికి. వెంకట కృష్ణయ్య తిరిగి ముక్కలన్నీ కలిపి వరసగా అందరికీ పంచిపెట్టాడు. ఒకరొకరికెదురుగా కూర్చోడం వల్ల వెంకట కృష్ణయ్య, పార్థసారథి ఒక ఉజ్జీగాను, మిగిలిన వారిద్దరు ఒక ఉజ్జీగాను ఏర్పడ్డారు. ఆ తరవాత ఆటంతా పది పదిహేను నిమిషాలపాటు నిమ్మకి నీరెత్తినట్టు నిశ్శబ్దంగా కొనసాగింది. సరోజ సోమనాథము కలిసి అవలీలంగా ఆట గెలుచుకుంటున్నారని వెంకటకృష్ణయ్య కనిపెట్టాడు. ఆ పైన పార్థసారథి కొంచెంసేపు జాగ్రత్తగా ఆలోచించి ఇస్పేటురంగు దిగాడు.

'ఏమిటండీ! ఆ ఆట! రంగు దిగుతారేమిటి? చేతకాకపోతే మొట్టమొదటే చెప్పలేక పోయారా?'

వెంకట కృష్ణయ్య మర్యాద, మన్నన ఆలోచించకుండా నోటికి వచ్చినట్టు మాట్లాడి విసుకున్నాడు. పార్థసారథి జాగ్రత్తగానే ఆడుతున్నాడు. అందుచేత వెంకట కృష్ణయ్య విసుగుతో అతనికి చిరాకు తలకెక్కింది.

'మీకు తెలియదు! ఆదే రంగు దిగాలి! ఇదేమన్నా పల్లెటూరి ఆటనుకున్నారా?'

పార్థసారథి మరింత విసురుగా విదిలించివేశాడు. వెంకట కృష్ణయ్య అంత దురుసుగా ఈసడించ గలడని పార్థసారథి చూచాయగా నయినా ఊహించలేదు. అందుచేత ముఖంచిట్లించుకుని అంతకన్నా ఘాటుగా సమాధానం చెప్పాడు. వెంకట కృష్ణయ్య దురుసు ధోరణినిబట్టి ఊరికే ఉత్తపుణ్యానికే అవమానం చెయ్యాలని ప్రయత్నిస్తున్నాడని గ్రహించుకున్నాడు. దానికి మితిమీరి పుచ్చుకున్న మద్యం కూడా తోడై ఉండవచ్చునని అనుమానించాడు. వెంకటకృష్ణయ్య మరి పెదవి కదపలేదు. ధుమ ధుమ లాడుతూ ముక్కలు విసిరివేశాడు. మరి కొన్ని క్షణాలలో ఆ ఆట ముగిసింది. సరోజ, సోమనాథం కలిసి చక్కని చాకచక్యంతో అది ఇట్టే గెలుచుకున్నారు.

పార్థసారథికి, వెంకటకృష్ణయ్యకి మధ్య మొలకెత్తిన వైమనస్యాన్ని బట్టి ఆ తరవాత సోమనాథానికిక ఒక్కక్షణమయినా అక్కడ ఉండడం రుచించలేదు.

'మరి మనం బయలు దేరదామా?'

వెంకట కృష్ణయ్యకేసి చూసి కొంచెం సంకోచిస్తూ అడిగాడు. అతడప్పటికి కొంచెం తమాయించుకున్నాడు.

'పోనీ మీరు ముందు వెళ్ళండి! పార్థసారథిగారేదో పనిమీద మాట్లాడానికి వచ్చినట్టున్నారు! మేమిద్దరము ఆ తరవాత బయలుదేరివస్తాము అట్టే ఆలస్యం కాదు! త్వరగానే వచ్చేస్తాము'.

''అబ్బే! నేను అంత రహస్యంగా మాట్లాడవలసిన పెద్దపని ఏమీ లేదే! ''

పార్థసారథి క్షమాపణ ధోరణితో, నవ్వు ముఖంతో తన అడ్డంకి ఏమీ లేదన్నట్టు నచ్చ జెప్పాడు. అయినా సోమనాథం మరి ఆగలేదు. వారందరి దగ్గిర వేర్వేరుగా మర్యాదగా సెలవు తీసుకుని తొందరగా అడుగులు వేసుకుంటూ వెళ్ళిపోయాడు. ఆపైన నాలుగయిదు క్షణాలవరకు పార్థసారథి తాను వచ్చిన పని సంగతి ప్రస్తావించలేదు.

'ఏమిటి పార్థసారథిగారు! మీ రేదో పనిమీద మాట్లాడాలని వచ్చినట్టున్నారు! మేము త్వరగా వెళ్ళాలి! అదేదో పెందరాళే తెమల్చండి!'

కొంచెం విసుగ్గా మొట్టమొదట తానే ఆ సంగతి ఎత్తుకున్నాడు వెంకటకృష్ణయ్య.

'సరోజ మీతో చెప్పలేదా? నేను ఇప్పుడు ప్రత్యేకంగా చెప్పవలసింది ఏమి ఉంది?'

పార్థసారథి రవంత ఆశ్చర్యపడ్డాడు.

'ఏదో చెప్పిందిగాని నేను తొందర పనిలోఉండి ఆ గొడవ తిన్నగా వినిపించుకోలేదు'. లంకపొగాకుచుట్ట ముట్టిసూ వెంకటకృష్ణయ్య మరింతగా చిరాకు పడ్డాడు. ఆ వైఖరితో పార్థసారథి కోపం రవంత తలకెక్కింది. అయినా చెక్కుచెదరకుండా ప్రసన్నంగా ప్రసంగిచాడు. సరోజ సమయానికి రాకపోవడంవల్ల ఏలూరులో జరిగిన గందరగోళం వివరించి, తిరిగి నవంబరు 6వ తేదీన అక్కడ కృష్ణతులాభారం వెయ్యబోతునట్టు వెల్లడించాడు. దానికి ఆమె నెలాగయినా పంపించక తప్పదని కొంచం బ్రతిమాలుకుంటున్న కంఠస్వరంతో అర్థించాడు. అయినా నాలుగయిదు క్షణాలదాకా వెంకటకృష్ణయ్య నోట ప్రతిసమాధానం వెలువడలేదు. లోపలికి పీల్చిన లంకపొగాకుచుట్టపొగ హేలగా విడిచిపెట్టి, పెద్దగా ఆవలించి చిటికవేసి 'కృష్ణా!' అని భగవన్నామస్మరణ చేసి కొనగోటితో కోరమీసాలు సవరించుకున్నాడు. 'వీలయితే అలాగే వస్తుంది, దానికేం? అయినా దీనికి నన్నడగడమెందుకు?'

అదే సమయంలో సరోజ రవంత తల వంచుకుని వారిద్దరి సంభాషణ ఎంతో శ్రద్ధగా ఆలకిస్తున్నది. అంతేగాని పెదవి కదిపి తానేమీ మాట్లాడలేదు. ఆమె వైఖరి గమనించిన పార్థసారథి మరుక్షణంలోనే అందుకున్నాడు.

'వీలయితే — అంటేకాదు. తప్పకుండా పంపించాలి. ఈ సారిగాని మళ్లీ గొడవ జరిగితే ఇక సరోజగాని, నేనుగాని నలుగురిలోను తలఎత్తుకుని తిరగలేము. మా మండలిపేరు, ప్రతిష్ఠలు కూడా ఒక్కసారిగా గంగలో కలిసిపోతాయి.'

పార్థసారథి గొంతులో తిరిగి అనునయం ప్రతిధ్వనించింది.

వెంకటకృష్ణయ్య ఆవలింత వస్తూంటే అతి కష్టంమీద ఆపివేసుకుంటూ నోటికి చెయ్యి అడ్డుపెట్టుకున్నాడు.

'పార్థసారథిగారూ! అయితే ఉన్నమాట కాస్తా చెబుతాను వినండి! ఇక్కడ సినీమా ఏర్పాట్లన్నీ చురుగ్గా సాగుతున్నాయి. అందుచేత మీ నాటకానికి రావడం వీలు పడదనుకుంటాను.'

'అన్నీ సిద్ధంచేసుకుని కూర్చున్నాంకదా! మీరుకూడా అలాగంటే ఏలాగ చెప్పండి! ఇంతాచేసి ఒక్కనాటి రాత్రికేగా మీరు సరోజనక్కడికి పంపించేది!'

పార్థసారథి తిరిగి సరోజవైపు చూశాడు. అతని ముఖంలో బాగా బ్రతిమాలుకుంటున్న భంగిమ ప్రతిఫలించింది. సరోజ మేనమామ వైపు తిరిగి ఎంతో గోముగాముఖంపెట్టి చెంగలిస్తున్న చిరునవ్వుతో అడిగింది.

'పోనీ ఈ ఒక్కసారికి ఎలాగో అలాగ వెళ్ళివస్తాను మామయ్యా!'

'అన్నీ తెలిసినదానవు. నువ్వుకూడా అలాగంటావేమిటి? వీలులేదు!'

వెంకటకృష్ణయ్య కొంచం గట్టిగా కటువుగా కసురుకున్నాడు.

'ఇంతాచేసి ఒక్కనాటి రాత్రికే అక్కడికి వెళ్ళేది! మళ్లీ మర్నాడే తిరిగి వచ్చివేస్తానులే! అలాగే వస్తానులెండి పార్థసారథిగారూ!'

ఎంతో ముద్దుగా బ్రతిమాలుకుంటున్నట్టు ముఖంపెట్టి మేనమామకేసి చూస్తూ సమాధానం చెప్పింది. అయినా వెంకటకృష్ణయ్య అనుమతించలేదు. ధుమ ధుమ లాడుతూ పెడముఖం పెట్టుకుని కూర్చున్నాడు.

'వల్లకాదు! వెళ్లడానికి వీలులేదు!'

వెంకటకృష్ణయ్య బాగా దురుసుగా మండిపడ్డాడు.

'ఒక్కనాటి రాత్రికే ఆ సినిమా తియ్యడం ఆగిపోతుందేమిటి? ఇంకా ప్రారంభంకాలేదుగా!'

సరోజ మరింత దీనంగా ముఖంపెట్టి బ్రతిమాలుకుంది!

ఆప్రశ్న వినీవినగానే వెంకటకృష్ణయ్య తోకతొక్కిన తాచులా కస్సుమని భగ్గుమని ప్రజ్వలించాడు.

'ఎన్నిసార్లు చెప్పాను నీకు వీలుపడదని! రేపో ఎల్లుండో సినిమాకి ప్రారంభోత్సవం జరుపుతున్నారే! సోమనాథంగారికి మాట ఇచ్చిన తరువాత ఎలాగ వెడతాము. కాస్త సమంచి, మర్యాద, మన్నన ఆలోచించుకో అక్కరలేదూ? ... అవును అడ్డమయిన రౌడీలతోను కలిసి తైతక్కలాడుతూంటే మర్యాద, మన్నన ఎలాగవస్తాయి.'

పార్థసారథి మరి భరించలేక తటాలునలేచి నిలుచున్నాడు! క్రోధావేశంతో అతనిముఖం గీసిన కందగడ్డలా ఎర్రబడింది. శరీరం గజగజ వణికింది.

'ఏమయ్యోయ్ ఏం! మాటలు తిన్నగారానీ! అడ్డమయిన రౌడీలేమిటి? ఎవరితో మాట్లాడుతున్నావో కాస్త ఆలోచించుకుని మరీ మాట్లాడు! జాగ్రత్త!'

మరుక్షణంలోనే వెంకటకృష్ణయ్య తన కుర్చీలోనించి తటాలున లేచి అతని మీదిమీదికి వెళ్లబోయాడు.

'ఆం! ఏమిటి చేస్తావయ్యా నువ్వు! చాలుచాలులే! నేర్చావు! నడు! నడు!' అతని గుండెమీద చెయ్యివేసి వెనక్కితోశాడు.

పార్థసారథికి ఆ అవమానంతో రక్తం కళ్ళకెక్కింది ; చేతి కొద్ది లాగి వెంకటకృష్ణయ్య చెంపమీద ఫెడీమని కొట్టాడు. ఆ దెబ్బతో వెంకటకృష్ణయ్య కుర్చీమీద కూలబడి పోవలసిందే ; కాని అతి కష్టం మీద తట్టుకున్నాడు.

' ఆఁ ? ఆఁ ! కొడతావురా ! పశువా ! ' అమాంతంగా మీది కురికి పార్థసారథితో తలపడి పిడికిలితో కణతమీద ఒక దెబ్బ కొట్టాడు. దానితో అతని కుడి కణత, కన్ను కొంచెం వాచాయి. పార్థసారథి ఇటీవల వచ్చిన జ్వరంతో కొంచెం నీర సంగా ఉన్నాడు. అయినా ఒళ్ళెరగని క్రోధావేశం వల్ల అతని కొక్కుమారుగా కొండంత బలం వచ్చింది. తిరిగి వెంకట కృష్ణయ్య కణతల మీద, ముఖంమీద, పిడికిళ్ళతో రెండు మూడు గట్టి దెబ్బలు కొట్టి దభాలున వెనక్కి తోసివేశాడు. చిత్తుగా తాగి ఉండడం మూలాన వెంకటకృష్ణయ్య మరి నిలబడలేక కుప్పగా కూలబడిపోయాడు. ఆ పోట్లాట అంతా ఒక అరనిమిషంలో జరిగిపోయింది.

అంతలోనే 'అయ్యో ; అయ్యో ' అని ఆక్రోశిస్తూ సరోజ వారిదరి మధ్య నిలబడి పోట్లాడు కోవద్దని హెచ్చరిస్తూ అడ్డుకుంది. ఆ దేక్షణంలో వెంకటకృష్ణయ్య తూలుతూ లేచి నిలబడి తిరిగి పార్థసారథి మీదికి లంఘించాడు. కాని సరోజ అతనిని తన ప్రగాఢాశ్లేషంతో బంధించి తొందర పడవద్దని ప్రాధేయపడింది.

' వదులు ! వదులు ! ఈ వేళ వీడి రక్తం కళ్ళ జూస్తాను '

వెంకటకృష్ణయ్య ఒక విదిలింపుతో ఆమె పట్టు విడిపించు కొని తిరిగి పార్థసారథి మీదికి వెళ్ళబోయాడు ! అతడు తిరిగి రెట్టించిన ఆగ్రహావేశంతో వెంకటకృష్ణయ్య మీది మీదికి వెళ్ళ బోయాడు. కాని ఆదేక్షణంలో తటాలున వారిద్దరి మధ్య నిల బడిన సరోజ తన యావచ్ఛక్తినీ వినియోగించి వెంకటకృష్ణయ్య నడ్డుకొని అతి కష్టం మీద కుర్చీ మీద కూర్చొబెట్ట గలిగింది. బాగా పరిశీలనగా అతని వైపు చూసింది.

' అదేమిటి మామయ్యా ! అంత దెబ్బ తగిలింది. చెంపంతా వాచిపోయి నట్టుందే ! '

విపరీతమైన గద్గదికంతో మరి మాట్లాడలేక తటాలున వెనక్కి తిరిగి పార్థసారథి వైపు చురచుర చూసి కస్సుమని బుస కొట్టింది.

' ఏమిటండీ ! పార్థసారథిగారూ! ఈ గోలంతాను! కాస్త మంచీ చెడూ ఆలోచించుకో అక్కరలేదా? ఎంత తోస్తే అంతేనా! ఇక మీ నాటకానికీ, మీకూ ఒక్క నమస్కారం! చాలు చాలు ! మరి దయచెయ్యండి ! ఎందుకింకా అలాగ నిలబడతారు ! అయిన రభసంతా చాలదా ? చాలు! చాలు! ఈ మర్యాద ! వెళ్ళండి ! ఇంకెప్పుడూ ఇక్కడికి రాకండి !'

ఆమె గొంతు గద్గదికతో గజగజ వణికింది. రెండు చెక్కిళ్ళ మీదా కన్నీటి బిందువులు నెమ్మదిగా జారాయి

సరోజ ఆ విధంగా చెడా మడా దులిపివేసి అవమానించిన తరువాత పార్థసారథికి కాళ్ళ క్రింద భూమి తటాలున లోపలికి కూలిపోయినట్లనిపించింది ! తలవంచుకుని గిరుక్కున వెనక్కి తిరిగి చర చర నడిచి వీధిలోకి వెళ్ళిపోయాడు ! ఆ సమయంలో అతని కళ్ళమ్మట నీళ్ళు తిరిగాయి.

ఆ దుస్సహ మానసిక వేదనతో అతనికి టాక్సీ పిలవాలని కూడా స్ఫురించలేదు ! ఎడతెగని ఆలోచనలతో, పరధ్యాన్నంతో అలాగే కొంత దూరం చరచరా నడిచిపోయాడు ! మరికొంత సేపటి కతనికి పొరబాటున తానింకొక వీధిలో పడి నడిచిపోతు న్నట్టు తెలిసింది. వెంటనే వెనక్కి తిరిగి వేరొక అడ్డదారిలో మౌంట్ రోడ్ చేరుకున్నాడు. అప్పటికే ఇంచుమించుగా ఒక అరమైలు దూరం నడిచినట్టు తోచింది. విపరీతమైన నిస్త్రాణం వల్ల మరి అడుగుపడలేదు ! ఆ సమయంలో కనుచూపు మేరలో ఎక్కడా టాక్సీ కనబడలేదు. మరికొంత సేపు అలాగే నిలబడి నిరీక్షించాడు. పది అడుగుల దూరంలో కాళీగా వెడుతున్న ఒక పెద్ద టాక్సీ కనబడింది. కొంచెం గొంతెత్తి పిలిచి దగ్గరికి వచ్చి నిలబడగానే దానిలో కూలబడ్డాడు. నెమ్మదిగా తనచిరునామా చెప్పి కళ్ళు మూసుకుని వెనక్కి చేర్లబడ్డాడు. టాక్సీ సెంట్రల్ హోటల్ ముందు ఆగిన తర్వాత వెంటనే కిరాయిచెల్లించి నీరసంగా నడిచివెళ్ళి తనగదిలో పరుపుమీద పడుకున్నాడు. అప్పటికి సుమారు ఆరు గంటలయింది! ఆనాడు గోల్డెన్ లాడ్జిలో జరిగిన దుస్సంఘటన అంతా అతనికి మహాభీభత్సమయిన ఒక పీడకలలా స్ఫురించింది. ఇక ఆనాటితో సరోజతో తన సంబంధం పూర్తిగా తెగిపోయినట్టే! ఎంతలో ఎంతపని జరిగింది! పార్థసారథి నోటినుండి తిరిగి తిరిగి అదేమాట వెలువడింది. అతడెంతో ఓరిమి వహించి వెంకట కృష్ణయ్యతో చాలా మర్యాదగా మాట్లాడాడు! ఎంతగా అమర్యాదగా దురుసుగా దులిపివేసినా నవ్వుముఖంతో బ్రతిమాలుతున్నాడు. అయినా అతడు మాటిమాటికి రెచ్చిపోయి, మీదమీదికి వచ్చి గుండెమీద చెయ్యివేసి వెనక్కుతోసి అవమానించాడు. ఆపైన ఎంతగా ఓరిమి వహించినా భరించలేక ఒళ్ళెరగని కోపంతో అతనిని కొట్టాడు! వెంకటకృష్ణయ్యకి ఒకటి రెండు దెబ్బలు కొంచెం గట్టిగా తగిలినా తనకంతకన్నా ఎక్కువగానే మోటు దెబ్బలు తగిలాయి! కణత మీది దెబ్బతో కన్నుకొంచెం వాచింది. అయినా సరోజ నింద అంతా తన మీదే పెట్టి చాలా నిష్ఠూరంగా మాట్లాడింది! పైగా తనికి తన నాటకానికి ఒక్క నమస్కారం పెట్టి పో, పొమ్మని దులిపివేసి అవమానించింది! ఆమెవల్ల అంతటి తలవంపు కలగ గలదని పార్థసారథి కలలో నయినా ఊహించ లేదు.

నిజానికి వెంకటకృష్ణయ్య కొట్టిన దెబ్బలకన్న సరోజ చురుకు చూపులే, ఈసడింపు మాటలే అతనికి అత్యంత దుస్సహ మయిన వ్యథ కలిగించాయి. తిరిగి తిరిగి అవే తలుచుకుని తలుచు కుని ఉస్సురుస్సురని నిట్టూర్చి నీరసంగా నాలుగయిదు సారులు మూలిగాడు. తాను కోరిన స్వల్ప విషయానికే అంతటి పెద్ద రభస జరగడాని కేమికారణమో అతని కేమాత్రము అవగాహన కాలేదు. సరోజ ఒక్కనాటి రాత్రికి ఏలూరు వచ్చి ఆ నాటకంలో

వేషం వేసినంత మాత్రంలోనే యీ పని అంతా అమాంతంగా ఆగిపోతుందా? వెంకటకృష్ణయ్య అంతగా ససేమిరా అని శరించి తన మాట కాదని ఎందుకు కొట్టిపారవెయ్యాలి? పోనీ అతనికిష్టం లేకపోతే సరోజ స్వతంత్రించి వెడతానంటే కాదని అడ్డుపడగలడా? మేనమామ దగ్గిర అలాగ అడుగులకు మడుగులొగ్గుతూ లగగ్గ లాడుతూ అంత భయపడిపోవలసినంతటి అగత్యం ఏమి వచ్చింది? వెంకటకృష్ణయ్యకి హఠాత్తుగా అంతటి అధికారం ఎవరిచ్చారు? అతనికంతటి మిడిసిపాటెందుకు?

అదే సమయంలో అతనికి ఏలూరులో నాటక ప్రదర్శనం సంగతి జ్ఞప్తికి వచ్చింది. నవంబరు 6 వ తేదీ నాడయినా కృష్ణ తులాభారం గొప్పగా ప్రదర్శించి అంతకు మునుపు వచ్చిన అప్రతిష్ఠ అంతా పూర్తిగా పోగొట్టుకో వచ్చునని ఉబలాట పడ్డాడు. కాని పరిస్థితులన్నీ ఎంతలో ఎంత దారుణంగా మారిపోయాయి. అంతే కాదు. తాను మండలిమీద పెట్టుకున్న ఆశలన్ని ఒక్కమారుగా పేక మేడల్లా కూలిపోయాయి. అయినా అతనికి సరోజ మీదగాని, మండలి మీదగాని ఆశపూర్తిగా అంతరించలేదు. పోనీ రాఘవ వస్తున్నాడని ఆమె చెప్పిందికదా. అతని చేత వెంకట కృష్ణయ్య కొకసారి తమ ప్రదర్శనాన్ని గురించి పరోక్షంగా సిఫారసు చేయిస్తే. ఆ విషయం ఆలోచిస్తూంటే అతనికే నవ్వువచ్చింది. 'పూర్తిగా మునిగిపోయిన మనిషి గడ్డిపరక పట్టుకుని వేలాడి నట్టుంది నా పరిస్థితి' అని సరి పోల్చుకొని ఉసూరుమని నిశ్వసించాడు. 'అంతవరకు వచ్చిన తరవాత రాఘవ చెప్పినా వెంకట కృష్ణయ్య మరి నామాట చెవికెక్కనిస్తాడా? కలలోమాట!' అని తీర్మానించుకుని ఇక ఆమాటే తలపెట్టలేదు పార్థసారథి.

క్రమక్రమంగా అతనికి చలి బాగా ఎక్కువవుతున్నట్లు తోచింది. జ్వరం కూడా పీల్చి వేస్తూంది. చిట్టచివరికి ఒకచుక్క కాఫీ పుచ్చుకోవాలని కూడా అనిపించలేదు. ఇక ఆ రాత్రికి ఏమీ తీసుకోనని అక్కడఉన్న నౌకరుతో చెప్పి తలుపులు బిగించుకొని దుప్పటి ముసుగుపెట్టుకుని పడుకున్నాడు. ఆపైన జ్వరం తీవ్రత వల్ల క్రమక్రమంగా అతనికి ఒంటిమీద స్మారకమే తప్పిపోయింది.

ఆ మరునాటి ఉదయానికి జ్వరం తీవ్రత రవంత తగ్గినట్లు తోచింది కాని తలనొప్పిలో మాత్రం ఎన్నదగినంత మార్పేమీ కనబడలేదు. ఆనాడంతా వట్టి కాఫీ మాత్రమే పుచ్చుకున్నాడు. అయినా ఆ సాయంత్రం కూడా జ్వరం పరిస్థితిలో మార్పేమీ కనబడలేదు. 'ఆ, తగ్గకేం జేస్తుంది. అదే తగ్గిపోతుంది.' అని సమాధానపడి అలాగే వట్టి కాఫీ మాత్రమే తీసుకుని పడుకు న్నాడు. ఆ మరునాడు ఏమాత్రం నింపాదిగా ఉన్నా నాటకం ఆగి పోయిందని వెంటనే గుప్త కొక టెలిగ్రాం పంపించాలనీ, తిరిగి త్వరగా ఇంటికి వెళ్ళి పోవాలనీ నిశ్చయించుకున్నాడు.

మరునాడు బాగా తెల్లవారినదాకా అతనికి మెళకువ రాలేదు. ఆ తర్వాత మంచంమీద కాస్తలేచి కూర్చోవడమే కష్టమనిపించింది. ఇప్పుడెలాగ పోస్టాఫీసుకి వెళ్ళడం? పోనీ ఎవరిచేతయినా టెలిగ్రాం రాయించి పంపిద్దామనుకుంటే ఈ మహాపట్టణంలో నాకెవరు పలుకుతారు. కాస్త జ్వరం తగ్గిన తరువాత వెంటనే ఇంటికి వెళ్ళిపోవాలనుకున్నాను. ఇదేమిటి ఈ జ్వరం ఇలాగ శని లాగ పట్టుకుని వేధిస్తూంది? ఇది ఎప్పటికి తగ్గుతుంది. ఎలాగ యింటికి వెళ్ళడం? చూడగా చూడగా ఇదేదో మలేరియా జ్వరం లాగుందే. కాకపోతే ఇంతచలి ఎందుకు వేస్తుంది?—ఆ విధమయిన రకరకాల ఆలోచనలతో అతనికి తల తిరిగి పోతున్నట్లనిపించింది.

మరికొంత సేపయిన తరువాత క్షీణ స్వరంతో హోటల్ నౌకర్ని పిలిచి వేడి వేడి కాఫీ తెమ్మని చెప్పాడు. అదే నాలు గయిదు గుక్కలు తాగి ఇక ఆనాటికి కూడా తానేమి తీసుకోనని చెప్పి దుప్పటి ముసుగు పెట్టుకుని పడుకున్నాడు. విపరీతమయిన నీరసం వల్ల బాగా నిద్రపట్టింది. అలాగ ఎంతసేపు గడిచిందో అతనికే తెలియదు. తిరిగి మెళుకువ వచ్చిన తరువాత రిస్టువాచీ చూసుకుంటే రాత్రి పన్నెండు గంటలు దాటింది.

(సశేషం)

---

ఈ సంచికలోని వివిధ శీర్షికలను గురించి, ఇందలి రచనలనుగురించి మీ అభిప్రాయాలు తెలపండి. మీ సూచనలకు, సలహాలకు, విమర్శలకు స్వాగతం

---

# పండుగలూ పర్వదినాలూ

## మకర సంక్రాంతి

మకర సంక్రాంతి పండుగ పంట నూర్పిడికాలంలో వస్తుంది. సేద్యానికి సంబంధించిన సంవత్సరం దరిదాపుగా జూన్ 7 వ తేదీనుండి ప్రారంభమౌతుంది అప్పుడే ఋతుపవనాలు వీచి వర్షాలు పడడం మొదలెడతాయి. డిసెంబరు నెల నాటికి ఈశాన్య, నైరుతీ ఋతుపవనాలు రెండూ వీచి వర్షాలను కురిపించేసి వుంటాయి. అంటే వర్షాకాలం చాలవరకు ముగిసినట్టే. రైతూ, అతని కుటుంబం, అతని బంధుమిత్రులు, అతని పశుగణం ఆరు నెలలుగా సాగించిన కృషి ఫలితం జనవరి మధ్యకాలంలో చేతి కందుతుంది. అదే మకర సంక్రాంతి కాలం. యింతకాలం కష్టపడి శ్రమకోర్చి పండించిన పంటల నూర్పిడి చేసుకొని– ధాన్యరాసులతో గాదెలను నింపుకొనే సమయం అది రైతులకి. ఆ సందర్భంలో వెల్లివిరిసే ఆనందంతో కూడుకొన్న పండుగ కావడంతో మకర సంక్రాంతిని అందాల, ఆనందాల పండుగ అని చెప్పుకోవచ్చు.

ఈ పండుగలో మొదటిదినం 'భోగి' అదే భోగిమంటలు వేసుకొనేరోజు. ఇది ప్రారంభమయ్యేందుకు ఒకనెల రోజుల ముందునుంచి పిల్లలు పిడుగులనేరడంలో, పిడకలను తయారు చేయడంలో నిమగ్నులవుతారు.

పాతబడిపోయిన తాళ్ళూ, పనికిరాని కొయ్యసామాన్లూ, తట్టలూ ఈ భోగిమంటకు ఆహారమౌతాయి. ఈ పండుగ వస్తుందనగానే గృహ పరిశుభ్ర కార్యక్రమం ప్రారంభమౌతుంది. ఇళ్ళకు వెల్లవేయడం, రంగులుపూయడం, సామాన్లన్నింటిని సర్ది యింటిని చక్కగా అలంకరించడం, ఇల్లలికి ముగ్గులు పెట్టడం, పసుపు కుంకుమలు పెట్టి తోరణాలు వ్రేలాడదీయడం మొదలైన కార్యకలాపమంతా జరుగుతుంది. ఆరోగ్య భద్రతకు అవసరమయ్యే పరిశుభ్రతకు యివన్నీ సాధనాలు.

ఇక రెండవరోజు పవిత్ర మకరసంక్రాంతి దినం. దాన ధర్మాలకు, పితృతర్పణాలకూ, సుష్టుగా విందుచేసుకొనేందుకూ ప్రసిద్ధిగాంచిన దినమిది.

మూడో రోజు కనుమ పండగ. అంటే పశువుల దినోత్సవం. ముఖ్యంగా ఆవులు, కోడెలు, లేగలు వీటికి సంబంధించిన పర్వదినం. సేద్యంలో యజమానితో కష్టంచేసి వుంటాయి కోడెలు, లేగలకు పాలుమాన్పించడంతో, కమ్మని పాలతో దండిగా నిండుగా వుండే బొద్దయిన పొదుగులతో గోమాత కళకళలాడుతుంటుంది. అమాయకంగా లేగదూడలు వెచ్చటి లేత యెండలో గంతులువేస్తూ ఉరకలు తీస్తుంటాయి. మకర సంక్రాంతికి పూర్వం వచ్చేది ధనుర్మాసం. అంటే ఆ కాలంలో సూర్యుడు ధనుర్రాసిలో సంచరిస్తాడు. సంక్రాంతికాలం సూర్యుడు ధనుర్రాసినుండి మకర రాసికి ప్రయాణంచేసే తరుణం కావడంతో, దేశంకూడా చాలీ చాలని పరిస్థితినుండి తప్పించుకొని సమృద్ధికర పరిస్థితిలోకి అడుగు పెడుతుంది. అంటే సంక్రాంతి కాలానికి ఆహార ధాన్యాలైతేనేమీ, తదితర వస్తువులైతేనేమి సమృద్ధిగా లభిస్తాయన్న మాట. నూతన దంపతులకు ఇది ఆహ్లాదకరమైన పండుగ. అంతెందుకు ఇది అందరికి సమృద్ధిగా ఆనందాన్ని పంచియిచ్చే పండుగంటే సరిపోతుందేమో!

## మహా శివరాత్రి

సర్వేశ్వరుడైన శివుడు జ్యోతిర్లింగ స్వరూపుడై అవతరించిన మహాపుణ్యదినం మహాశివరాత్రి. ఈ నాడు పరమేశ్వరుడు పన్నెండు క్షేత్రాలలో జ్యోతిర్లింగ స్వరూపుడై మనకు దర్శనం ఇస్తున్నాడు. సౌరాష్ట్రదేశంలో సోమనాథుడు, శ్రీశైలంమీద మల్లికార్జునుడు, ఉజ్జయినిలో మహాకాలుడు, మాలవి ప్రాంతంలోవి పర్లీలో వైద్యనాథుడు, నాసికకు 120 మైళ్ల దూరంలో డాకిని అనేచోట భీమ శంకరుడు, రామేశ్వరంలో రామేశ్వరుడు, దారుకావనంలో నాగేశ్వరుడు, కాశీలో విశ్వనాథుడు, గోదావరీ తీరంలో త్ర్యంబకేశ్వరుడు, హిమాలయాలలో కేదార ఖండంలోని కేదారీశ్వరుడు, మహారాష్ట్రంలోని శివాలయం అనే చోట ఘుశ్మేశ్వరుడు వేంచేసి ఉన్నారు.

ఒక శివరాత్రినాడు మహేశ్వరుడు భక్తులకు దర్శనం ఇచ్చి నృత్యం చేశాడట. ఆదిలో శివుడూ, ఆయన శక్తీ సమ్మేళనం చెందినప్పుడు స్పందనం కలిగింది. ఆ స్పందనమే సృష్టికికారణం అయింది ఆ స్పందనమే శివతాండవం. శివపూజ ఐన తరవాత డమ్‌డమ్ శబ్దాన్ని ఉచ్చరిస్తున్నాం. అది ఓంకారం యొక్క సులభ స్వరూపమే.

పరమేశ్వరుని వ్యక్తరూపానికీ, అవ్యక్తరూపానికీ సమాధాన చిహ్నమే లింగం మహేశ్వరుని వ్యక్తభావం పిండరూపమైన మనుష్యునిలోనే గోచరిస్తూఉంది. మానవుడు ఆధ్యాత్మికంగా

(తరువాయి 64 వ పుటలో)

భారత రాజ్యాంగం :

# ప్రాథమిక హక్కులు

**1947** ఆగస్టు 15 వ తేదీన స్వాతంత్ర్యం వచ్చిన రెండున్నర ఏళ్ళకు భారత రాజ్యాంగం 1950 జనవరి 26 న అమలులోకి వచ్చింది. దీనితో, భారత దేశం మత ప్రమేయంలేని సర్వసత్తాక ప్రజాస్వామిక దేశంగా అవతరించింది.

పౌరులకు న్యాయ సమ్మతమైన అనేక ప్రాథమిక హక్కులు కల్పించడం యీ రాజ్యాంగంలోని విశేషాంశం. ఈ హక్కులు, యితర విషయాలతోపాటు, ఆలోచనలో, భావ వ్యక్తీకరణలో, నమ్మకంలో, విశ్వాసంలో, ఆరాధనలో పౌరులకు స్వేచ్ఛనూ; సమాన అవకాశాలను కల్పిస్తున్నాయి. తక్కువ వర్గాలవారి సంస్కృతి, భాషల పరిరక్షణకు, ఆస్తులపై హక్కుకు ఇది అవకాశాన్ని కల్పిస్తున్నది.

స్వాతంత్ర్యమనేది బహుముఖాలు. వోటు చేసే స్వాతంత్ర్యం. రాజకీయ స్వాతంత్ర్యం, వాక్స్వాతంత్ర్యం, భావనా స్వాతంత్ర్యం, ఇష్టమైన వృత్తిని చేపట్టే స్వేచ్ఛ. న్యాయ పాలనలో సమత, స్త్రీ. పురుషులిరువురకు సమాన హక్కులు, సమాన ఆర్థిక, విద్యా సౌకర్యాల కల్పన – యిలాగ స్వాతంత్ర్యం అనేక రకాలు. ఈ రకమైన స్వేచ్ఛాస్వాతంత్ర్యాలు, యింకా స్వేచ్ఛా సమాజంయొక్క లక్షణాలు యివన్నీ భారతదేశంలో 21 సంవత్సరాల క్రిందటే లభించాయి. ఇవి ఇటీవలే లభించినప్పటికీ ప్రపంచంలోని అతి పురాతనమైన ఏ ప్రజాస్వామిక దేశంలోని స్వేచ్ఛా స్వాతంత్ర్యాలకూ తీసిపోని విధంగా పౌరునకు భారత దేశంలో లభిస్తున్నాయి.

## వాక్స్వాతంత్ర్యం

రాజకీయపార్టీలు బహిరంగసభలలోనూ, పత్రికలద్వారానూ స్వేచ్ఛగా తమ అభిప్రాయాలను ప్రకటిస్తున్నాయి. అవి తమ స్వంత వార్తా పత్రికల్ని, మేగజైనుల్నీ ప్రచురిస్తున్నాయి. పత్రికలు ఏ పార్టీకీ చెందినవి కావు. అవి పార్టీ రహితమైన అభిప్రాయాన్ని ప్రకటిస్తాయి.

ఇంకా నిరక్షరాస్యత దేశంలో బాగా విస్తరించి వున్నప్పటికీ 1947 లో 300 గా వున్న దిన పత్రికల సంఖ్య 1967 కు, 588 కు పెరిగింది. వీటిలో 366 పత్రికల మొత్తం సర్క్యులేషన్ 66 లక్షలు. మేగజైనుల సంఖ్య 8,670. వీటి మొత్తం సర్క్యులేషన్ సుమారు కోటిన్నర.

గ్రామీణ ప్రాంతాలలోని నిరక్షరాస్యులు సైతం భారత దేశంలోనూ, ప్రపంచంలోనూ జరుగుతున్న సంఘటనలను, తెలుసుకోవడానికి రేడియో చక్కటి అవకాశాన్ని కలిగిస్తోంది. రేడియో ప్రభుత్వానికి సంబంధించినది. 1947 లో దేశ విభజన జరిగినప్పుడు ఆరు రేడియో స్టేషన్లు మాత్రమే వుండేవి. ఈనాడు ఆకాశవాణికి 36 ప్రధానమైన కేంద్రాలున్నాయి. మీడియం వేవ్ మీద ప్రసారాలను యించుమించు మన జనాభాలో 72 శాతం మంది వింటున్నారు. రానున్న అయిదేళ్ళలో యీ సంఖ్య 80 కు పెరుగుతుంది. లైసెన్సు పొందిన రేడియోదార్ల సంఖ్య 30,000 నుంచి 76 లక్షలకు పెరిగింది.

ఢిల్లీలో ఒక టెలివిజన్, కేంద్రం పనిచేస్తున్నది. ఇతర ముఖ్య పట్టణాలలో కూడా టెలివిజన్ కేంద్రాలను నెలకొల్పాలని ఉద్దేశిస్తున్నారు.

## ఆరాధనా స్వేచ్ఛ

భారత దేశపు జనాభా 43.90 కోట్లలోనూ (1961 జనాభా లెక్కల ప్రకారం) 36.60 కోట్ల మంది హిందువులు, 4 70 కోట్ల మంది ముసల్మానులు, 1.1 కోట్ల మంది క్రైస్తవులు, 80 లక్షల మంది సిక్కులు, 30 లక్షల మంది బౌద్ధులు, 20 లక్షల మంది జైనులు. వీరు కాక కొంతమంది పార్సీలూ, యూదులు తదితరులు చిన్న మొత్తాలలో వున్నారు.

సెక్యులర్ రాజ్యంగా భారతదేశం ఏ మతానికీ కట్టుబడి లేదు. మతం ప్రాతిపదిక మీద ఏవిధమైన వ్యత్యాసమూ యిక్కడ లేదు.

హిందువులకన్న హిందూయేతరుల జనాభా శీఘ్రగతిని పెరుగుతున్నది.

## స్త్రీలకు సమాన హక్కులు

భారత రాజ్యాంగంలో పురుషులతో పాటు స్త్రీలుకూడా సమాన హక్కులను అనుభవిస్తారు.

సాంప్రదాయకంగా వస్తున్న హిందూ న్యాయశాస్త్రాన్ని క్రోడీకరించిన చట్టాలవల్ల వారసత్వపు ఆస్తిలో స్త్రీకి కూడా భాగం పొందే అధికారం లభించింది. భార్య వుండగా మరొకరిని పెండ్లియాడుట నిషేధించబడినది. కొన్ని ప్రత్యేకమైన పరిస్థితులలో భర్తకు విడాకులిచ్చే అధికారంకూడా భార్యకు లభించింది.

కొత్తగా కల్పింపబడుతున్న విద్యా సౌకర్యాలను, ఆర్థిక సౌకర్యాలను మహిళలుకూడా పూర్తిగా వినియోగించుకుంటున్నారు. ఉన్నత విద్య బోధించే కళాశాలలు, యితర పరిశోధన సంస్థలు, శిక్షణ సంస్థలలో 3,80,000 మందికి పైగా స్త్రీలు చదువుకుంటున్నారు. 1961 లో గ్రామీణ, పట్టణ ప్రాంతాలు రెండింటా కలిపి మొత్తం 5.9 కోట్ల మంది మహిళా కార్మికులు వున్నారు. మహిళలు కేవలం విద్య, వైద్యరంగాలలోనే గాక ఇంజనీరింగ్, ఆటామిక్ రిసర్చి రంగాలలో కూడా వున్నారు. మహిళలు సాంఘిక సేవా కార్యక్రమాలలో అధిక ఆసక్తితో పాల్గొంటున్నారు.

## సాంఘిక సమానత్వం

ప్రజలలో ఒక వర్గంవారు 'అంటరాని వారు'గా పరిగణింపబడుతుండేవారు. స్వేచ్ఛా భారత రాజ్యాంగంలో అంటరానితనం నిషేధించబడింది. అంటరాని తనాన్ని పాటించడం చట్ట ప్రకారం నేరం. వెనుకబడిన సాంఘిక వర్గాలవారికి వారు, తమ వెనుకబడిన తనాన్ని అధిగమించేందుకై జనాభా ప్రాతిపదికమీద కొంత శాతం చొప్పున స్థానాలు ప్రత్యేకించబడినవి. రాష్ట్ర శాసన సభలలోనూ, జాతీయ శాసన సభలలోనూ షెడ్యూలు కులాల వారికి (లోగడ అంటరానివారుగా పేర్కొనబడినవారు), గిరిజనులకు స్థానాలు ప్రత్యేకించబడినవి.

అదే విధంగా ప్రభుత్వ ఉద్యోగాలలోనూ, ప్రభుత్వం నిర్వహించే విద్యా సంస్థలలోనూ షెడ్యూలు కులాల వారికి, గిరిజనులకు కొంత శాతం మేరకు సీట్లు ప్రత్యేకించబడినవి.

సాంప్రదాయకమైన సమాజంనుండి ఆధునిక సమాజం ఆవిర్భవించి, సాంఘికమైన సమానత్వం నెలకొనడంతోనే యీ ప్రత్యేక సౌకర్యాల కల్పనను ఆపివేయడం జరుగుతుంది.

## వ్యక్తి స్వాతంత్ర్యం

తనకు నచ్చిన వృత్తిని చేపట్టే స్వేచ్ఛ భారత పౌరునకు వుంది. ఈ వ్యక్తి స్వేచ్ఛకు భంగం వాటిల్లిన సందర్భాలలో తరచుగా న్యాయస్థానాలు యీ శాసన సంబంధమైన, పరిపాలనా సంబంధమైన చర్యలను అరికట్టడం జరుగుతున్నది. వ్యవసాయం, వాణిజ్యం, పరిశ్రమలు ప్రయివేటు రంగంలోనే వున్నాయి. కార్మిక సంఘాలు అన్నిచోటా చురుగ్గా పనిచేస్తున్నాయి. ★

---

(62 వ పుటనుండి)

### పండుగలూ-పర్వదినాలు

ఎంత ఉన్నతి చెందుతూ ఉంటే అంత ఎక్కువగా సదాశివుని స్వరూపం అతనిలో వ్యక్తమౌతూ ఉంటుంది. మానవుడు తుదకు మహేశ్వరునితో తాదాత్మ్యం పొందుతాడు.

శివునికి ప్రియమైన రాత్రి శివరాత్రి. శివరాత్రినాడు ఉపవాసం విధింపబడింది. "స్నానంకాని, వస్త్రంకాని, ధూపంకాని, అర్చనకాని, పుష్పాలుకాని ఉపవాసం వలె నాకు సంతృప్తిని కలిగింపవు" అని శివుడే చెప్పియున్నాడు. ఆ రాత్రి జాగరణం కూడా చాలా ముఖ్యం.

మొదటి జాములో పాలతోను, రెండవజాములో పెరుగుతోను, మూడవ జాములో నేతితోను, నాల్గవ జాములో తేనెతోనూ శివలింగానికి అభిషేకం చేయాలి. మొదటి జాములో శివుని ఈశాన రూపంలోను, రెండవ జాములో అఘోర రూపంలోను, మూడవ జాములో వామదేవునిగాను, నాల్గవ జాములో సద్యోజాతునిగాను పూజించాలి.

దారిద్ర్యాన్ని పోగొట్టి అన్ని కోర్కెలూ తీర్చే మారేడు పత్రాలు శివునికి చాలా ప్రియమైనవి. మారేడు పత్రితో శివుని పూజించడం శివరాత్రినాడు విధాయకం.

### బక్రీద్

ప్రాచీన కాలంనుంచీ బలి అన్నిదేశాలలోను ఒక మత ధర్మంగా వస్తూఉంది. ఇస్లామ్‌లో విధింపబడిన బలి పండుగ బక్రీద్ ముస్లిములు మక్కాకు చేయు హజ్ యాత్రకు సంబంధించినది. అది ముస్లిముల పన్నెండవ మాసమైన జిల్‌హిజ్‌లో 10 వ నాటి నుంచి 13 వ నాటి వరకూ జరపబడుతుంది. యాత్రలో లేని వారు తమతమ యిళ్ళలోనే ఈ పండుగ జరుపుకొంటారు.

ఈ పండుగకు సంబంధించిన ఒక గాథ కురాన్‌లో ఉంది. తన మత కార్యాలలో తోడ్పడడానికి సద్గుణవంతుడైన ఒక కుమారుని ప్రసాదింపవలసినదిగా హజ్‌రత్ ఇబ్రాహిమ్ దేవుని ప్రార్థించాడు. వినయ సంపన్నుడైన ఒక పుత్రుడు కలుగుతాడనే శుభవార్త దేవుడు ఆ ప్రవక్తకు తెలియజేశాడు. బీబీహజరాయందు ఇబ్రాహిమ్‌కు ఇస్మాయిల్ అనే సుపుత్రుడు కలిగాడు అతడు పెద్దవాడయ్యాడు. తండ్రికి సహాయపడే ఈడు వచ్చింది. తన ఏకైక పుత్రుడైన ఇస్మాయిల్‌కు దేవుని మార్గంలో జబా చేస్తున్నట్లు ఇబ్రాహిమ్‌కు స్వప్నం వచ్చింది. ఈ వృత్తాంతం ఆయన తన కుమారునికి తెలియజేసి "నీ అభిప్రాయం ఏమిటి?" అని అడిగాడు. "దేవుని ఆజ్ఞ ప్రకారం చెయ్యి నాయనా, ఆయన అనుగ్రహంవల్ల నేను స్థిర బుద్ధితో ఉంటాను" అని ఇస్మాయిల్ చెప్పాడు. తండ్రీ కొడుకులిదరూ దేవునికి విధేయులై ప్రవర్తించారు. కాజా మసీదునకు సమీపంలో జబా చేయడానికి సిద్ధపడ్డారు. కుమారుడు బోరగిల పడుకొన్నాడు. తండ్రి కత్తి ఎత్తాడు. "స్వప్నంలో నా ఆదేశం ప్రకారం చేయబూనుకున్నావు. ఇక జబా చేయనక్కరలేదు. ఇది పరీక్ష మాత్రమే ఈ పరీక్షకు మీరిద్దరూ నిలిచారు, నాకు సంతృప్తి అయింది. నేను ఋజు మార్గవర్తనులను బహూకరిస్తాను." అన్న దేవుని వాక్యాలు వినబడ్డాయి. ఇస్మాయిల్‌కు బదులు ఒక పొట్టేలు బలి ఇవ్వబడింది. ఈ సంఘటనకు స్మారక చిహ్నంగానే బక్రీద్ పండుగ జరుగుతున్నదని అంటారు.

--కమలా త్రివేణి

# తిరస్కృతి

—వాసిరెడ్డి సీతాదేవి

## జరిగిన కథ

సత్యం, సూర్యం అన్నదమ్ములు. మేనమామ కూతురు సరళ కూడా వాళ్ళతోపాటే పెరుగుతోంది. సత్యం అంటే సరళకు యిష్టం. ఎప్పుడూ అతనితో ఆడుకొనేది. ఒకసారి సరళను రక్షించబోయి సత్యం లారీ క్రింద పడి చెయ్యి పోగొట్టుకున్నాడు. తర్వాత స్కూల్లో సరళ జెడపుచ్చుకుని లాగిన ఓకొంటె కుర్రాడితో పోట్లాడి దెబ్బలు తిన్నాడు. స్కూల్లో పోట్లాడాడని తెలిసి తండ్రి సత్యాన్ని కొట్టాడు. అప్పటినించి సత్యం స్కూలుకు వెళ్ళడం మానేశాడు. మాస్టరుగారి సహాయంతో శాంతినికేతన్ వెళ్ళి చదవడానికి ఇంట్లో ఒప్పించాడు.



"ఏమండీ! మావాడు వచ్చాడా!" అంటూ చంద్రయ్య కేశవరావుయింటి లోపలకు వచ్చాడు. అందరూ ఒక్క సారిగా ఈ ప్రపంచంలోకి వచ్చారు. తండ్రిని చూసి సత్యం లేచి నిల్చున్నాడు వెళ్ళటానికి సిద్ధ మవుతూ.

"రండి! చంద్రయ్య గారూ! సత్యం కూర్చోవోయ్ వెళ్ళొచ్చులే, కూర్చోండి" కేశవరావు చంద్రయ్యను కూర్చోమన్నాడు. విమల లేచి తనుకూర్చున్న కుర్చీని చంద్రయ్య కోసం ఖాళీ చేసింది.

"మీ అమ్మాయాండీ!" చంద్రయ్య విమలను చూస్తూ ప్రశ్నించాడు.

"అవునండి! మా పెద్దమ్మాయి. నాకు ఇద్దరే ఆడపిల్లలని మీకు తెలుసను కుంటాను."

"అవునండీ! ఒక మగ పిల్లవాడు వుంటే బాగుండేది."

"వాళ్ళనే మగ పిల్లల్లా బాగా చదువు సంధ్యలు చెప్పించి పెంచాలను కుంటున్నాను. అయినా సత్యం వున్నాడుగా" నవ్వుతూ అన్నాడు కేశవరావు.

"అదంతా మీ అనుగ్రహం!"

"సరేగాని! సత్యం ఏమయిపోతాడని మీకీ భయం, వెతుక్కుంటూ వచ్చారు?" కేశవరావు మాట మారుస్తూ ప్రశ్నించాడు.

"అది కాదండీ! తొమ్మిదయినా రాకపోయేప్పటికి మనసులో ఏమిటోలావుంది" అన్నాడు.

"శాంతినికేతన్ నుంచి ఉత్తరం వచ్చింది." అన్నాడు కేశవరావు. "వచ్చేసిందా? సీటు దొరికిందా?" ఆత్రంగా ప్రశ్నించాడు చంద్రయ్య.

"వచ్చింది. కాని సంవత్సరానికి కనీసం ఓ ఐదు వందలైనా ఖర్చుచెయ్యాల్సి వుంటుంది. సత్యం తన తెలివి తేటలతో స్కాలర్‌షిప్ సంపాదించుకుంటాడనే నమ్ముతున్నాను. అలా

అయితే ముందు ముందు మీరు ఖర్చు చెయ్యనక్కరలేదు. అతనికి సరిపోను అతనే సంపాదించుకోగలడు. " అన్నాడు కేశవరావు నిశితంగా చంద్రయ్య ముఖంలోకి చూస్తూ.

చంద్రయ్య ఓక్షణం ఆలోచిస్తూ మౌనంగా ఉండిపోయాడు. సత్యం తండ్రి ముఖంలోకి ఆదుర్దాగా చూడసాగాడు.

" దానికేం లెండి, డబ్బుకు వెనకా ముందూ చూడకండి. వాడికంటే నాకు ఈ డబ్బు ఎక్కువకాదు. " అన్నాడు చంద్రయ్య.

సత్యంముఖం అరవై వాట్ల బల్బులా ఒక్కసారి వెలిగింది.

" ఎప్పుడు వెళ్ళాల్సివుంది ? " చంద్రయ్య మళ్ళీ అడిగాడు.

" వచ్చే నెల మొదటి వారంలో బయలు దేరాల్సి వస్తుంది." అన్నాడు కేశవరావు.

" మీరు తీసుకెళ్తారుగా ? "

"తప్పకుండా, రేపే నేను ఒక వారం రోజుల పాటు శెలవుకు అర్జీ ఇస్తాను. "

"మీఋణం ఎలా తీర్చుకోగలనో!" చంద్రయ్య లేచి కేశవరావు రెండు చేతులూ పట్టుకున్నాడు. " నాకు వాడి విషయంలోనే దిగులుగా వుండేది. మీరే మార్గం చూపించారు. "

తండ్రి తన గురించి అంత బాధ పడుతూ వుంటాడని ఏనాడూ అర్థం చేసుకోని సత్యం ఆశ్చర్యంగా తండ్రి ముఖంలోకి చూశాడు. వజ్రం కంటే కఠినంగా కనిపించే అతనిలో వెన్నకంటే మృదువైన హృదయం వుంది అనుకున్నాడు కేశవరావు.

" వెళ్ళొస్తానండీ!" అంటూ లేచాడు చంద్రయ్య. తండ్రితో పాటే వెళ్ళటానికి సిద్ధంగా లేచి నిలబడ్డ సత్యాన్ని వుద్దేశించి అన్నాడు కేశవరావు.

" సత్యం తరువాత వస్తాడు లేండి, ఇవ్వాళ ఇక్కడే భోజనం చేస్తాడు. అది నా కోరిక కాదు, మా అమ్మాయి కోరిక. నేను వచ్చి దిగబెడతాను లెండి " అన్నాడు కేశవరావు.

సత్యం సందేహిస్తూ నిల్చున్నాడు. " సరే, నేను వెళ్ళొస్తాను. " అంటూ చంద్రయ్య వెళ్ళిపోయాడు.

* * * *

కనుచీకటి పడుతోంది. చంద్రయ్య చుట్టముట్టించి వీధి అరుగుమీద కూర్చొని వున్నాడు ఎదురుగా పాలేర్లు యేసోబూ పోలాయి, కింద నేలమీద చతికిలబడి వున్నారు అంతలో కేశవరావు తమ కేసే రావడం చూసి చంద్రయ్య "రండి ! రండి ! " అన్నాడు అరుగు దిగుతూ.

కేశవరావు దిగులు పడినట్లు కనిపిస్తున్నాడు. ఎప్పుడూ ఉత్సాహంగా వుండే కేశవరావు అలా ఉండట్యం చంద్రయ్యకు ఎంతో ఆశ్చర్యాన్ని కలిగించింది. బహుశా డబ్బు ఏమైనా అవసరం అయి వచ్చాడేమోననుకున్నాడు.

" రండి లోపలకు ? " అన్నాడు చంద్రయ్య ఆదరంగా.

" ఇక్కడ కూర్చుందాంలెండి. " అన్నాడు కేశవరావు.

" అదేం వీల్లేదు. లోపలకు రండి " అంటూ లోపలకు దారి తీశాడు చంద్రయ్య. అనుసరించాడు కేశవరావు. లాంతర్లు తుడుస్తూ కూర్చున్న సరళ కేశవరావుకేసి కుతూహలంగా చూసింది. కేశవరావు వచ్చినప్పుడల్లా పెద్ద బావ గురించి ఎన్నో విషయాలు, శాంతినికేతన్ సంగతులూ చెపుతూ వుంటాడు. సరళ చేతులు పని చేస్తున్నా ధ్యాసంతా కేశవరావు వైపే వుంది.

"చెప్పండి ?" అన్నాడు చంద్రయ్య " చూడమ్మా సరళా ! అత్తయ్యను కాఫీ పెట్టమని చెప్పు." పురమాయించాడు సరళకు. సరళకు అక్కడ నుంచి కదలాలని లేదు అయిష్టంగానే లేచి లోపలకు వెళ్ళింది.

" ఇప్పుడు కాఫీ ఎందుకండీ ! "

" పరవాలేదండీ ! సత్యం మీ కేమైనా ఉత్తరం రాశాడా ? నాలుగు నెలలుగా ఉత్తరం ముక్కైనా రాయలేదు. కాస్త మీరు గట్టిగా మందలిస్తూ ఉత్తరం రాద్దురూ నాలుగేండ్లైంది వాణ్ణి చూసి. ఒక సారి కూడ శెలవలకు రాలేదు. కనీసం నెలకు ఒక వుత్తరం అయినా రాయమని గట్టిగా మందలించండి!" అన్నాడు చంద్రయ్య.

శెలవలకు వస్తే అనవసరపు ఖర్చని సత్యం అభిప్రాయం. పైగా ఐదేళ్ళు ఆ వాతావరణంలో కళారాధన చెయ్యాలనీ, ఒక క్షణం కూడా వ్యర్థం చెయ్యడం తనకు ఇష్టం లేదనీ రాశాడు అందుకే నేను కూడా సత్యాన్ని శెలవలకు రమ్మని రాయటం లేదు. నాకు నెలకు ఒక ఉత్తరం రాస్తూనే వున్నాడు మీకు ఎందుకు ఇంత ఆలస్యంచేశాడో తెలియదు. రేపే మందలిస్తూ రాస్తాను లెండి." అన్నాడు కేశవరావు.

"మరో సంవత్సరం వుండాలి." అన్నాడు చంద్రయ్య.

"అవును! మరో సంవత్సరం ఎంతలో తిరిగివస్తుందిలెండి" అన్నాడు కేశవరావు.

"ఏమో నాయనా! మరో సంవత్సరం వాణ్ణి చూడకుండా ఉండాలంటే నాకు మరోయుగం వుండాలనిపిస్తుంది " కాఫీ గ్లాసుతో అప్పుడే అక్కడకు వచ్చిన శాంతమ్మ అంది.

కేశవరావు ఏమీ మాట్లాడలేదు, ఏదో ఆలోచిస్తున్నాడు.

"మీరు ఇవ్వాళ ఉత్సాహంగాలేరు. కారణం తెలుసుకో వచ్చునా?" చంద్రయ్య అడిగాడు.

"ఏమీ లేదండీ!"

"కాదు, దాస్తున్నారు. చెప్పండి; నేను వినతగిందయితే చెప్పండి!"

"వినకూడంది ఏమీలేదండీ? నేను ఇక్కడ ఉద్యోగం వది లేసి వెళుతున్నాను".

చంద్రయ్య అర్థంకానట్లు చూశాడు.

"ఇక్కడ సమితి ప్రెసిడెంట్‌గారికీ నాకూ పడడంలేదు. ఆయనకు కావల్సిన కుర్రవాళ్లకు, ఆయన కోరిన మార్కులు వెయ్యాలి. అది నావల్లకాదు. హెడ్‌మాష్టరు కూడా ప్రెసిడెంటు మాట వినాల్సిందే నంటాడు. రోజు రోజూ చీటికీమాటికీ బాధిస్తూ వున్నారు. అందుకే నేను రాజీనామా ఇచ్చాను." అన్నాడు కేశవరావు నిట్టూరుస్తూ.

"మీరు తొందరపడలేదు కదా!"

"లేదండీ! ఒక్కక్షణం కూడా ఈ ఊళ్లో ఉండలేను. అనేక రకాలుగా బాధిస్తున్నారు. హైదరాబాదులో ఒక హైస్కూల్లో నాకు ఉద్యోగం వచ్చింది. అక్కడ నాకు మంచి స్నేహితులున్నారు. పిల్లల చదువులకు కూడా ఇబ్బందివుండదు. కాకపోతే ఇంత కాలంగావున్న ఈ ఊరు ఈ విధంగా వదలాల్సి వచ్చినందుకు కొంచెం బాధగావుంది."

"కాఫీ తాగండి చల్లారిపోతుంది. ఎప్పుడు వెళుతున్నారు?"

"రేపు సాయంత్రం?"

"ఇంత త్వరగానా!" అన్నాడు చంద్రయ్య.

"అవునండీ! వచ్చే సోమవారం అక్కడ డ్యూటీలో జాయిన్‌కావాలి."

"ఒకటి అడుగుతాను ఏమీ అనుకోకండీ?" అన్నాడు చంద్రయ్య.

"పరవాలేదు అడగండి."

"మీకు డబ్బు ఏమయినా అవసరం అయితే తీసుకెళ్ళండి. నా దగ్గిర సందేహించకండి."

"మీ అభిమానానికి కృతజ్ఞుణ్ణి. డబ్బు అవసరం ఏమీలేదు" అన్నాడు కేశవరావు. కాని కేశవరావు ఏదో అడగాలని ప్రయత్నిస్తూ అడగలేకపోతున్నాడని చంద్రయ్య లీలగా గ్రహించాడు. కాని ఎంత ఆలోచించినా ఏమయివుంటుందో అంతుపట్టలేదు.

"సత్యం వచ్చిందాకా ఉండలేకపోయాను."

"వాడు మీ దగ్గరకు రాకుండావుంటాడా? ముందు మిమ్మల్ని చూసే ఇక్కడకు వస్తాడని నా నమ్మకం," అన్నాడు చంద్రయ్య.

"నేను ఈ వూరినుంచి వెళ్ళేసమయంలో మిమ్మల్ని ఒకటి అర్థించటానికి వచ్చాను." అన్నాడు కేశవరావు సిగ్గుపడుతూ.

"చెప్పండీ! మీకు మా కుటుంబం ఎంతో రుణపడివుంది. మీ కేదయినా చెయ్యగలిగితే అది మా భాగ్యంగా తలుస్తాము" అన్నాడు చంద్రయ్య.

"ఆఁఅది చాలకాలంగా మీదగ్గిర చెప్పాలనుకుంటూ సందేహించానండీ!"

"చెప్పు నాయనా! అంత వెనకాముందు ఆడతావేం?" అంది శాంతమ్మ.

"అదేనండీ? సత్యం అంటే నాకెంత అభిమానమో మీకు తెలుసుగా?" నసిగినట్లు అన్నాడు కేశవరావు.

"అది మీ నోటిమీదగా చెప్పాలా? మాకు తెలియదా?"

"మాఇంట్లో అందరికీ సత్యం అంటే అభిమానం. ముఖ్యంగా మాపెద్దమ్మాయి సత్యంఅంటే వల్లమాలిన అభిమానం"

సరళ చేస్తున్న పనిని ఆపుచేసి చెవులు రిక్కించుకొని విన సాగింది.

చంద్రయ్యా, శాంతమ్మలు కేశవరావు ఏం చెప్పదలచు కున్నాడో అర్థం కానట్లు చూశారు.

"మీకు కులాల పట్టింపులు లేకపోతే మా పెద్దమ్మాయిని సత్యానికి ఇవ్వాలనివుంది. అది ఇప్పుడు గుంటూరులో ఇంటరు చదువుతుందని మీకు తెలుసుగా?"

సరళ చేతిలోని లాంతరు గ్లాసు రాతిమీద జారిపడి పగిలింది. అందరూ ఉలిక్కిపడి అటు చూశారు. సరళ అక్కడనుంచి లేచి గబ గబా ఇంట్లోకి పరుగెత్తుకెళ్ళింది. కేశవరావు ప్రశ్నార్థకంగా చంద్రయ్య ముఖంలోకి చూశాడు.

చంద్రయ్యా ముఖం వెలవెలబోతొంది. శాంతమ్మ కాఫీ తాగిన ఖాళీ గ్లాసును తీసుకొని లోపలకు వెళ్ళిపోయింది. ఆ వాతావరణం తనకు వ్యతిరేకంగా వున్నట్లు అర్థం అయింది కేశవరావుకు.

"మీకు కులాల పట్టింపులు వుంటే ఈ ప్రసక్తిని ఇంతటితో వదిలేయండి. మాకు అలాంటివి లేవు. అమ్మాయి మనస్సును అర్థం చేసుకొని, మీ దగ్గర నా అభిప్రాయాన్ని వెలిబుచ్చకుండా వుండలేక పోయాను. తండ్రిగా నా బాధ్యత అయిపోయింది. తరువాత దాని అదృష్టం!" కేశవరావు స్వరంలో జీర పలికింది.

చంద్రయ్య సర్దుకొని కూర్చున్నాడు. ఒకసారిసకిలించి గొంతు సవరించుకున్నాడు.

"క్షమించండి కేశవరావుగారూ కులాల విషయం కాదు నేను చెప్పబోయేది. నేను చెప్పేదంతా విని మీరు ఏం చెయ్యమంటారో చెప్పండి అలాగే చేస్తాను." చంద్రయ్య చుట్టతీసి ముట్టించుకున్నాడు. కేశవరావు కుతూహలంగా చంద్రయ్య ముఖం చూస్తూ కూర్చున్నాడు. అతనిలో మళ్ళీ ఏదో ఆశ తలఎత్తింది.

"ఇంతకు ముందు లోపలకుపరుగెత్తిన సరళను చూశారుగా? అది నా మేనకోడలు. తల్లీ తండ్రీలేరు. నా దగ్గరే పెరిగింది. అది పుట్టిన నాడే సత్యం భార్యగా నిర్ణయం జరిగింది. క్రమంగా పసి హృదయాల్లో కూడా అలాంటి భావమే వయసుతో పాటు పెరుగుతూ వస్తోంది. వాళ్ళిద్దర్నీ చూస్తుంటే ప్రపంచంలో ఏశక్తీ వాళ్లను విడదీయలేదు అనిపించేది నాకు. దాన్ని రక్షించటానికే వాడు చెయ్యబోగొట్టు కున్నాడు. మీ మాటలు వినగానే దాని

చేతిలో గ్లాసు కింద పడిపోవటం చూశారుగా! ఇంతకంటే నేను మరేమీ చెప్పలేను."

"అక్కరలేదు లెండి. నాకు ఈ విషయం తెలియదు. అనవసరంగా మిమ్మల్నందర్నీ బాధ పెట్టాను." కేశవరావు అన్నాడు.

చంద్రయ్య మాట్లాడ లేదు.

"వస్తానండీ! మీరు బాధ పడకండి!" అంటూ కేశవరావు లేచి నిల్చున్నాడు.

"నాకు నిజంగా బాధగావుంది మాస్టరుగారూ!" చంద్రయ్య ఢీలా పడిపోతూ అన్నాడు.

కేశవరావు పెదవులమీద విరిగిపోయిన పాలలాటి చిరునవ్వు వెలసింది.

"మాకు అంతే అదృష్టం అనుకుంటాం.మీరే నన్ను క్షమించాలి. చాలా బాధ పడుతున్నాను. విషయం తెలుసుకోకుండా తొందరపడినందుకు" అంటూ కేశవరావు గబగబా వెళ్ళిపోయాడు.

అలా వెళ్ళిపోతున్న కేశవరావును చూస్తూ చంద్రయ్య చుట్ట దమ్ము గట్టిగా నసాళానికి అంటేలా పీల్చాడు.

* * *

ఐదు సంవత్సరాల అనంతరం సత్యం శాంతి నికేతన్‌లో విద్యా, విజ్ఞానం ఆర్జించుకొని, కళాకారుడిగా తిరిగొచ్చాడు. నిండు యవ్వనుడుగా వచ్చిన కొడుకును చూసుకుని మురిసి పోయాడు చంద్రయ్య. తనకంటే ఓ గుప్పెడు ఎత్తుగానే వున్నాడు అనుకున్నాడు. బెంగాలీ వేషభాషల ప్రభావంతో స్ఫురద్రూపి అయిన సత్యాని చూచిన సరళకు శరత్ నవలల్లోని హీరోలు గుర్తుకొచ్చారు. ముఖ్యంగా సరళ కళ్ళకు సత్యం దేవదాసులా కనిపించాడు.

సూర్యం విశాఖ పట్నంలో ఇంటర్ ఫైనల్ చదువుతున్నాడు. చిన్నతనంలోనే మితభాషిగా వుండే సత్యం ఇప్పుడు చాలా గంభీరంగా తయారయాడు. సరళ సెకండ్ ఫారంతోనే చదువు మానేసిందనీ, చవకబారు నవలాసాహిత్య పఠనం పైకి ఆమె ఆలోచనలు పోవనీ, ఇంకా అంత అమాయికగానే వుందనీ, చూసిన మరుక్షణంలోనే తెలుసుకున్నాడు సత్యం.

ఆ రాత్రి భోజనాల దగ్గర కూర్చున్నప్పుడు సత్యం కేశవరావు గార్ని గురించి అడిగాడు. తను ఎన్ని ఉత్తరాలు రాసినా సంవత్సరంగా జవాబులేదని చెప్పాడు తండ్రితో.

కేశవరావు విషయం అంతా చెప్పాడు. ప్రస్తుతం హైదరాబాదులో వుండి వుండాలన్నాడు. కాని ఎవరూ ఆ నాడు కేశవరావు తమ ఇంటికి వచ్చి, సత్యానికి తన కూతుర్ని ఇవ్వాలని వుందని అన్నాడని చెప్పలేదు. చంద్రయ్యకు తెలుసు సత్యం మనసు. కేశవరావు యెడల సత్యం మనస్సులో ఎలాంటి కృతజ్ఞతాభావం ఉందో తెలుసు. అలాంటి సత్యం కేశవరావు కొరకు ఏ మయినా చెయ్యగలడనీ, ఏలాంటి త్యాగం చెయ్యటానికైనా వెనకాడడనీ తెలుసు. అందుకే ఆ విషయాన్ని అతని దగ్గర ఎవరూ ప్రస్తావించలేదు.

ఆ రాత్రి చాలాసేపు సత్యం కేశవరావుగురించి ఆలోచిస్తూ పడుకున్నాడు. మధ్యమధ్య కేశవరావు కూతురు, ఆకాశంలో కంటికి కనిపించని చిన్న నక్షత్రంలా తళుక్కుమంటూనే వుంది సత్యం స్మృతిపథంలో. ఎలాగయినా అతని అడ్రసు సంపాదించి హైదరాబాదు వెళ్ళి కేశవరావుగార్ని కలుసుకోవాలనీ, ఆయనకు తన కృతజ్ఞతలు తెలుపుకోవాలనీ నిశ్చయించుకున్నాడు.

కేశవరావుగారి అడ్రసు సంపాదించాలని ఎంత ప్రయత్నించినా లాభం లేకపోయింది. హైదరాబాదులో ఏదో స్కూల్లో పనిచేస్తున్నాడనేవారేకాని, ఫలానా స్కూలు అని ఎవరూ చెప్ప లేక పోతున్నారు. సత్యం చాలా నిరాశ చెందాడు.

సత్యం వచ్చినప్పటినుంచి నియమంగా ఉదయం, సాయంత్రం పొలాలకేసి వెళుతున్నాడు. కుంచెలూ స్టాండూ మొదలైనవి తీసుకొని మరీ వెళతాడు. ఇంట్లో ఉన్నప్పుడైనా ఎక్కువ భాగం చదవటంతోనూ, బొమ్మలు దిద్దుకుంటూ కూర్చోవటంతోను గడుపుతుంటాడు. రోజూ ఒక గంట సరళకు హిందీ ఇంగ్లీషు నేర్పిస్తుంటాడు.

"ఏరా సత్యం? బి ఏ. పాసయావుగా ఏదయినాఉద్యోగం చూసుకోకూడదూ" చంద్రయ్య ఒకసారి చిన్నగా కదిలించాడు.

సత్యం ముఖం గంభీరంగా మారింది. ఓక్షణం మౌనంగా వుండి "నాకు ఉద్యోగం చెయ్యాలనిలేదు నాన్నా. అసలు నేను ఆ ఉద్దేశంతో చదవలేదు'' అన్నాడు తల వంచుకుని వినయంగా.

చంద్రయ్యకు కొడుకు మాటలు చిత్రంగా వినిపించాయి

"మరి ఇంత చదువూ చదివింది గీతలు గీస్తూ కూర్చోటానికేనా?''

"అవును నాన్నా! ఆ గీతల్లోనే నా జీవిత పరమార్థం ఇమిడివుంది. అందులో లభించే ఆనందం నాకు ఏ పనిలోనూ లభించదు. నాకు పెద్ద ఆడంబరంగా బతకాలని లేదు. ఇంటిపట్టునే వుండి నీకు పెద్దతనంలో తోడుగా వుంటాను. పొలం పనులు చూసుకుంటూ స్వతంత్రంగా బ్రతుకుతాను.'' అన్నాడు సత్యం. ఆ స్వరంలో దృఢమైన నిర్ణయం వినిపించి చంద్రయ్య అక్కడనుంచి లేచి వెళ్ళిపోయాడు. ఆ తరువాత మళ్ళీ ఎప్పుడూ ఆ విషయం కొడుకు దగ్గర ఎత్తలేదు.

ఒకరోజు మధ్యాహ్నం సత్యం ఒక చిత్రానికి ఫైనల్ టచెస్ ఇస్తున్నాడు సరళ వెళ్ళి వెనగ్గా గమనిస్తూ కూర్చుంది. దూరంగాకొండలు, ఆ కొండల వెనుక జేవురు రంగులో సగం కనిపిస్తున్న సూర్యబింబం సంధ్యారాణి నొసటిమీది కుంకుమబొట్టు చెరిగినట్లుంది. పడమటి అరుణిమను పులుముకున్న ఆకాశం దగ్గరగా ఓ చెట్టు వుంది. చెట్టుకింద ఓ స్త్రీమూర్తి, గుడ్డల మూటమీద

తమాషా భంగిమలో కూర్చొని వుంది. ముఖంలో అలసట కని పిస్తోంది. అవయవాలు పొంకంగా, బలిష్ఠంగా వుండి మనిషి ఆకర్షణీయంగా వుంది. కడియాలు వున్నకాళ్ళను తమాషాగా పెట్టుకొని కూర్చొంది. సరళకు ఆ స్త్రీమూర్తిని ఎక్కడో చూచినట్లనిపించింది. మళ్ళీమళ్ళీ చూసింది. ఆశ్చర్యంతో కళ్ళు పెద్దవి చేసుకొని మరీ చూసింది.

సందేహం లేదు. తమ ఇంటి చాకలి కోడలు. దాని పేరు మాణిక్యం. మాణిక్యం ఇంత అందంగా వుంటుందా ? తనకు ఎప్పుడూ అది అందంగా కనిపించలేదే? బావ దాని బొమ్మలు వేశాడు అంటే అది బావ కళ్ళకు చాలా అందంగా కనిపించి వుండాలి. అందుకే బొమ్మను అంత అందంగా వేశాడు. కాని బావ అచ్చం దానిలాగే వేశాడు. ప్రత్యేకంగా అది అందంగా కనిపించాలని ఏమీ నగలూ గట్రా వెయ్యలేదే. మరి బొమ్మలో అది అంత అందంగా ఎలా వచ్చింది? తను అందంగా ఉంటుందని అందరూ అంటారు. ఆ మాణిక్యం అయితే తన అందాన్ని కళ్లార్పకుండా చూస్తుంది బట్టలు తెచ్చినప్పుడల్లా. మరి తన బొమ్మగీస్తే, ఆ బొమ్మ ఇంకెంత అందంగా ఉంటుందో !

కాని బావ తన బొమ్మ గీస్తాననలేదు. పైగా ఒక్కనాడైనా తన అందాన్ని మెచ్చుకోలేదు చివరకు బావ కళ్ళకు తనకంటే మాణిక్యం అందంగా కనిపించిందన్నమాట.

పని పూర్తిచేసుకొని నిల్చున్న సత్యం దృష్టిని సరళ ఆకర్షించింది.

"ఏమిటి సరూ! అలా కూర్చున్నావు ? బొమ్మ బాగుందా?" అన్నాడు సత్యం.

"ఊ!" అనిమాత్రం వూరుకుంది సరళ ముభావంగా.

"అందులో వున్న బొమ్మ ఎవరో తెలిసిందా ? '' సత్యం ప్రశ్నకు సరళకు వళ్ళు మండింది.

చాలా గొప్ప ప్రశ్నే. రోజూచూసే మాణిక్యం, తన మురికి గుడ్డలు ఉతికే మాణిక్యం గురించి ఎంతగొప్పగా ప్రశ్నిస్తున్నాడో!

"ఏం బావా ? మాణిక్యం నీకు అంత అందంగా కన్పించిందా ?'' సరళ స్వరంలోని తీవ్రతకు సత్యం బొమ్మమీద నుంచి తన కళ్ళను సరళవైపుకు తిప్పాడు.

" మాణిక్యం అంత అందంగా నేనులేనూ? "

సత్యం సరళ ముఖంలోకి గుచ్చి చూశాడు. సత్యం పెదవులపైన సన్నని హాసరేఖ కదిలింది.

" దేనికంటే ఏది అందమైందో చెప్పటం కష్టంసరళా ! ఒకో వస్తువుకు, ఒకో ప్రాణికి, ఒకో వ్యక్తికి, ఒకో రకమైన అందం వుంటుంది. నా కళ్ళకు సృషిలోని ప్రతి వస్తువులోను ఏదో రకమైన అందం కనిపిస్తుంది. చూసేకళ్ళూ, అనుభవించే సంస్కారంగల హృదయమూ వుండాలి.

సరళకు సత్యం మాటలు సరిగా అర్థం కాలేదు. అర్థం అయిందల్లా, తనూ, మాణిక్యం ఇద్దరూ బావ కళ్ళకు అందంగానే కనిపిస్తారు. సరళకు రోషం తన్నుకొచ్చింది.

'' నువ్వు అందంగా లేవని నేను ఎప్పుడైనా అన్నానా ! '' అన్నాడు ఆప్యాయం ఉట్టిపడే స్వరంతో చిన్నముఖం చేసుకున్న సరళను అనునయిస్తున్నట్లు.

సరళకు కళ్ళనీళ్ళ పర్యంతం అయింది. అక్కడనుంచి చివ్వన లేచివెళ్ళిపోయింది. సత్యం అలా వెళ్ళిపోయిన సరళనుచూస్తూ తనలో తనే నవ్వుకున్నాడు.



వారం రోజులనుంచి పాలేరు పోలయ్యను ఎదురుగా నిల్చోబెట్టి సత్యం గీతలు గీస్తుంటే సరళ పక్కనే కూర్చొని కుతూహలంగా చూస్తూ వుంటుంది. పోలయ్య సన్నగా, పొడవుగా, నల్లగా వుంటాడు. అలాంటి వాళ్ళను పల్లెసీమల్లో ' బడితెలా వున్నాడు ' అంటారు. పోలయ్య తలకు పెద్ద తలగుడ్డ. షర్టులేని పొట్ట అక్కిలించుకొని వుంటుంది. ధోవతి మోకాళ్ళపైకి మడిచి కడతాడు. కాళ్ళకు మొరటు చెప్పులు, చేతులో ముల్లుకర్ర, నాటు పొగాకుచుట్ట, నలభై దాటిన పోలాయ్, దారిద్ర్య దేవత కరుణించడంవల్ల మరో పది సంవత్సరాలు పెద్దగా కనిపిస్తాడు.

బావసంగతి తనకు మరీ అర్థంకాదు. ఆ పోలయ్య ఏం బాగుంటాడని వాడి బొమ్మను గీయటానికి అన్నిగంటలు, అంత కష్టపడుతుంటాడు ! పోలయ్యను ఎదురుగా నిల్చోబెట్టి, రోజూ ఒకలా నిల్చోబెట్టి బొమ్మను గీస్తున్నాడు. మరి మాణిక్యం బొమ్మ ఎలా గీశాడు? ఇలాగే రోజూ పొలంలో చెట్టుకింద మాణిక్యంను కూర్చోబెట్టుకొని, గంటలకొద్దీ బొమ్మలు గీశాడన్నమాట !

సత్యం ఆనాటికి పనిముగించి లేచాడు.

'' బావా !''

'' ఏమిటి సరళా ?''

'' అందమైనవాళ్ళ బొమ్మల్ని వెయ్యకుండా నువ్వు పోలయ్యనూ, మాణిక్యంనూ వేస్తావేం ? '' ఆశ్చర్యంతో కళ్ళు విప్పుతూ ప్రశ్నించింది.

" నీకు మాణిక్యం బొమ్మ బాగాలేదా ? " కుంచెలు పెట్టెలోకి సర్దుతూ తల ఎత్తకుండానే ప్రశ్నించాడు సత్యం.

" బొమ్మ బాగానేవుంది కాని నాకు మాణిక్యం బాగుండదు. '' కసిగా అంది సరళ.

(సశేషం)

# అఖిలభారత పారిశ్రామిక ప్రదర్శన

టి. రాజగోపాలన్

జనసామాన్యానికి విజ్ఞానాన్ని కూర్చడంలో ప్రదర్శనలు ప్రధానపాత్ర వహిస్తాయి. కంటితో చూసి, చేతితో తట్టి, మనసుతో అనుభూతిని పొందే అవకాశం ప్రదర్శనలలో వుంటుంది. హైదరాబాదులో కొత్త సంవత్సరం ఆరంభంతో అఖిలభారత పారిశ్రామిక ప్రదర్శన ఆరంభమైంది. ప్రతి యేటా జనవరి ఒకటో తేదీనుంచి నలభై రోజులపాటు కన్నులపండువుగా ఈ ప్రదర్శన ఏర్పాటు చేయబడుతుంది.

ఈ ప్రదర్శనను ఏటాజరిపించడానికి ప్రదర్శన సంఘం ఒకటివుంది. 1938లో ఉస్మానియా విశ్వవిద్యాలయ పట్టభద్రులై ఉత్సాహవంతులైన యువకులు కొందరు తొలిసారిగా యీప్రదర్శనను ప్రారంభించారు. అది ఆనాటినుంచి దినదిన ప్రవర్ధమానమై తీరుగా అభివృద్ధిచెంది యీనాడు మనదేశంలో జరిగే పెద్ద పెద్ద ప్రదర్శనల్లో ఒకటిగా రూపొందింది. నాటి హైదరాబాదు రాజ్యంలో హస్తకళాఖండాలు, గ్రామీణ, కుటీరపరిశ్రమలను అభివృద్ధిచేసేవుద్దేశంతోనూ, ఆర్థిక, పారిశ్రామిక అభివృద్ధికి అనువైన వాతావరణాన్ని కలిగించేవుద్దేశంతోనూ ఆదిలో యీ పారిశ్రామిక ప్రదర్శనను ప్రారంభించారు. అప్పట్లో వంద స్టాల్‌లతో యీ ప్రదర్శన ప్రారంభమైంది. అదిన్నీ, ఆనాటి హైదరాబాదు రాజ్యంలో ఉత్పత్తి అయిన వస్తువుల ప్రదర్శనకు మాత్రమే పరిమితమైవుండేది. నేడు ఈ ప్రదర్శనలో 1500 సాల్‌లు వున్నాయి. దేశంలోని అన్ని ప్రాంతాలవారూ దీనిలో పాల్గొంటున్నారు. 1947,48 సంవత్సరాలలో మాత్రం రాజకీయమైన కారణాలవల్ల యీ ప్రదర్శన ఏర్పాటుచేయబడలేదు.

మొదటి రోజుల్లో యి ప్రదర్శనను పబ్లిక్‌గార్డెన్స్‌లో ఏర్పాటుచేస్తుండేవారు. అయితే రానురాను యీ ప్రదర్శన విశేష ప్రచారంపొంది బాగావిస్తరించడంవల్ల దీనిని 1946 లో గాంధీ భవన్ ప్రక్కనేవున్న 32 ఎకరాల ఖాళీస్థలంలోకి మార్చారు. మొట్టమొదటి ప్రదర్శనను సుమారు 50 వేల మంది సందర్శించారు దీనిమీద లక్షరూపాయల ఆదాయంవచ్చింది. ఈనాడు దీనిని సందర్శించేవారి సంఖ్య 15 లక్షలకు మించింది. ఆదాయం కోటి రూపాయలవరకు వుంటున్నది.

రెండేళ్ళ క్రితం వరకు యీ ప్రదర్శనలో ప్రభుత్వస్టాలుల ప్రయివేటు స్టాలులు అన్నీ కలగలిపివుండేవి. అయితే గత యేడాదే ప్రభుత్వ స్టాలులన్నిటినీ ఒకేచోట కేంద్రీకరించి ఏర్పాటు చేయడం జరిగింది. దీనివల్ల వివిధ ప్రభుత్వశాఖలు చేపట్టుతున్న అభివృద్ధి కార్యక్రమాలు మరింత స్పష్టంగానూ, తేలికగానూ సామాన్యజనానికి అర్థంకావడానికి అవకాశం ఏర్పడింది.

రాష్ట్ర ప్రభుత్వ జనసంబంధ శాఖ అధ్వర్యంలో యీ ఆలోచన కార్యరూపంధరించింది. 1968లోనే యీ విధంగా ప్రభుత్వ స్టాలులను ఒకేచోట ఏర్పాటుచేయడం జరిగినప్పటికీ యీ ఏడాదే ఆయాప్రభుత్వ శాఖల స్టాలులకు వాటి నిర్మాణానికి డబ్బు పంపిణీ చేసే బాధ్యత జనసంబంధ శాఖ తీసుకుంది. 1968 వరకు తమ తమ స్టాలులకు ఆ యా శాఖలే తమ బడ్జెటుల నుండి వెచ్చిస్తుండేవి. అయితే యీ ఏడాది ఆర్థికశాఖ సుమారు రూ. 1,30,000 లమేరకు గల ఆయా శాఖల వనరులను జనసంబంధశాఖ అధీనంలోవుంచి వివిధ శాఖలకు వాటివాటి అవసరాల మేరకు పంపిణీచేసే అధికారం కల్పించబడింది.

ఈ ప్రదర్శనలో 36 ప్రభుత్వశాఖలు, ప్రభుత్వ సంస్థలు పాల్గొన్నాయి, వీటిని ప్రధానంగా ఆహార-వ్యవసాయ విభాగం, వాణిజ్య-పరిశ్రమల విభాగం, విద్య విభాగం, సాంఘిక సంక్షేమ విభాగం, ఆరోగ్య-వైద్య విభాగం, సాధారణ విభాగం అని ఆరు విభాగాలుగా ఏర్పాటుచేశారు. ప్రతి విభాగం క్రింద తత్సంబంధమైన శాఖల ప్రదర్శన స్టాలులు ఏర్పాటుచేయబడినాయి,

ఈ ఇరవై తొమ్మిదవ అఖిలభారత పారిశ్రామిక ప్రదర్శనకు 1969 జనవరి ఒకటిన మైసూర్ ముఖ్యమంత్రి శ్రీ వీరేంద్ర పాటిల్ ప్రారంభోత్సవం చేశారు. ప్రారంభోత్సవ కార్యక్రమానికి ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డి అధ్యక్షత వహించారు.

ఈ ఏడాది మన గాంధీ శతజయంతిని జరుపుకుంటున్న దృష్ట్యా ఈ ప్రదర్శనలో "గాంధీదర్శన్" స్టాలును ఏర్పాటు చేయడం ఎంతయినా సముచితంగావుంది. గాంధీ జీవితాన్ని



"గాంధీ దర్శన్" స్టాలు

ప్రకటించే అరుదైన ఫోటోలు యిందులో ప్రదర్శించబడినవి. ఈ స్టాలులోకి అడుగుపెట్టగానే మనం నిజంగా గాంధీజీ సమక్షంలోనే వున్నామనిపిస్తుంది. దీనికి ఆనుకునే గాంధీజీ సాహిత్యం ప్రదర్శించబడిన స్టాలువుంది.



"గాంధీ దర్శన్" స్టాలుకు రాష్ట్ర గవర్నరు జనవరి 5న ప్రారంభోత్సవం చేసినప్పటి దృశ్యం.

జనసంబంధశాఖవారు రాష్ట్ర ప్రజల సంస్కృతిని ప్రకటించే ఛాయాచిత్రాలనూ, ప్రచురణలనూ ప్రదర్శించారు. దేశం నలుమూలల్లో జరిగే సంఘటనలను ఎప్పటికప్పుడు పత్రికలవారికి ఎలా తెలుస్తాయో తెలుసుకోవడానికి వీలుగా ఒక టెలిప్రింటరును కూడా యిక్కడ పని చేయిస్తూ చూపించారు.

దేవాదాయశాఖవారి అత్యంత సుందరమైన దేవాలయం ప్రదర్శకులను బాగా ఆకర్షించింది. నిజమైన దేవాలయ వాతావరణమంతా యిక్కడ కల్పించబడింది. రాష్ట్రంలోని ముఖ్యమైన పుణ్యక్షేత్రాలలోని మూల విరాట్టుల నమూనాలను యిక్కడ ఆల



దేవాదాయ శాఖ స్టాలు ముందు దైవ దర్శనానికై క్యూలో నిలుచున్న జనం.

యంలో సహజంగా ప్రదర్శించారు దీనిలోనికి ప్రవేశించగానే మనసు భక్తిభావంతో, ప్రశాంతతతో నిండిపోతుంది. శాస్త్రీయ ఆరాధనాసంగీతం టేపురికార్డులు వేసి వీనులవిందు చేశారు.

పోలీసుస్టాలులో కుతూహలాన్ని రేకెత్తించే విషయాలు కొన్ని వున్నాయి. దొంగ రూపాయినోట్లను తయారుచేయడానికి వుపయోగించే బ్లాకులు, దొంగనాణేలను తయారుచేయడానికివాడే పరికరాలను యిక్కడ ప్రదర్శించారు. వివిధ నేరస్తులకు సంబంధించిన ఫోటోలు, కొందరు నేరస్తుల చేతివేలిముద్రలు, కాలిముద్రలు అడుగుజాడలు మొదలైనవి ప్రదర్శించబడ్డాయి.

విద్యుచ్ఛక్తిశాఖవారి స్టాలును సందర్శిస్తే, మనరాష్ట్రం విద్యుచ్ఛక్తి రంగంలో ఎంత గణనీయమైన అభివృద్ధిని సాధించిందో అర్థమౌతుంది. వివిధ విద్యుదుత్పాదక కేంద్రాల నమూనాలు, రక



ప్రభుత్వ శాఖలకు సంబంధించిన ఒక దృశ్యం

రకాల ట్రాన్స్‌ఫార్మర్లు, ఆటో ట్రాన్స్‌ఫార్మర్లు, ఎయిర్ బ్లాస్ట్ సర్క్యూట్ బ్రేకర్లు, మినిమమ్ ఆయిల్ సర్క్యూట్ బ్రేకర్లు మొదలైనవి యిక్కడ ప్రదర్శించారు.

అటవీశాఖవారి స్టాలులో నేచరల్ హిస్టరీ విభాగం అతి సహజంగా వుంది. అడవి వాతావరణం సృష్టించి, దాని మధ్య పెద్దపులి, ఎలుగుగొడ్డు, కోతుల చర్మాలలో గడ్డికుక్కి చేసిన బొమ్మలను వుంచారు. ఈ స్టాలు పిల్లల్ని సహితం అమి



బాలికల పాలిటెక్నిక్ స్టాలు

తంగా ఆకర్షిస్తున్నది. అటవీవుత్పత్తులకు సంబంధించిన పరికరాలు అనేకం యిందులో ప్రదర్శించబడినాయి.

మత్స్యశాఖవారి స్టాలుకూడా ఎప్పటిలాగే చాలా ఆకర్షణీయంగా వుంది. దీనిలో ఒక అమ్మకపు విభాగాన్నికూడా ఏర్పాటు చేశారు రకరకాల చేపలతో చక్కగా అమర్చిన ఎక్వేరియంలు వున్నాయి. వివిధ రకాల నావల నమూనాలూ వలల నమూనాలూ వున్నాయి.

పురాతత్వశాఖవారి స్టాలు చాలా విజ్ఞానదాయకంగావుంది. ఇందులో పల్లవులు, చోళుల కాలంనాటి శిల్పాలు, మృణ్మయ శిథిలాలు, విజయనగరకాలంనాటి కంచువిగ్రహాలు, అమరావతి, పోచంపాడు త్రవ్వకాలలో దొరికిన శిథిలశకలాలు, రాతియుగం నాటి రకరకాల పనిముట్లు, పురాతన ఎర్రమట్టి బొమ్మలు, పాత్రలు మొదలైనవీ, జాతీయ మ్యూజియం నుండి తెచ్చిన కొన్ని పురాతత్వ వస్తువులు వున్నాయి. అజంతా ఎల్లోరా కుడ్యచిత్రాల నకళ్ళు వున్నాయి. 17వ శతాబ్దానికి చెందిన ఆయుధాలువున్నాయి. పురాతన రాజవంశాలవారి శాసనాలుకూడా కొన్ని యిక్కడ ప్రదర్శించబడ్డాయి.

లఘుపరిశ్రమల అభివృద్ధి మండలివారి స్టాలులో అమ్మకానికై యంత్రాలను వుంచారు. ఈ పెద్ద స్టాలులో వివిధ పరిశ్రమలకు చెందిన స్టాలులు కలిపివున్నాయి. రేడియో విభాగాలు ట్రాన్స్‌ఫార్మర్లు సూపర్ ఎనామిల్ కవర్ వైర్లు మొదలైనవెన్నో వున్నాయి. ఆంధ్రప్రదేశ్ మైనింగ్ కార్పొరేషన్ అలంకారానికి వుపయోగపడే రకరకాల రాళ్ళను ప్రదర్శించింది. హెచ్.ఎం.టి. వారు తాము తయారుచేసిన వివిధరకాల వాచీలను, వివిధ యంత్రాలను ప్రదర్శించారు. భారత భారీ విద్యుత్పరికరాల కర్మాగారం కూడా తమ ఉత్పత్తులను ప్రదర్శించింది. వాణిజ్యం ఎగుమతుల అభివృద్ధిసంస్థ. ఐ. ఎస్. ఐ. ప్రాగాటూల్స్. నిజాం షుగర్ ఫ్యాక్టరీలకు సంబంధించిన ప్రదర్శన వస్తువులనుకూడా యిక్కడవుంచారు. చేనేత విభాగంలో హిమ్రూమగ్గం, గద్వాల్ మగ్గం, పోచంపల్లి మగ్గం పనితీరులను వాటిపై నేతనేసే పద్ధతిని ప్రత్యక్షంగా చూపించారు.

కుటుంబనియంత్రణ వారి స్టాలుచూస్తే జనాభా పెరుగుదల వివరాలు, దానిని అరికట్టడానికి తీసుకోవలసిన చర్యలు మొదలైనవి తెలుస్తాయి. ఆంధ్రప్రదేశ్‌లో జరిపిన శస్త్రచికిత్సలు, అమర్చిన లూప్‌లు; హైదరాబాదులో జనాభా పెరుగుదల వివరాలు వివిధదేశాలలోని వివాహవయస్సు వివరాలు యింకా ఆసక్తికరమైన విషయాలు, ఛార్టులు యిందులో ప్రదర్శింపబడ్డాయి.

భారతదేశంలో వివిధరంగాలలో జరుగుతున్న అభివృద్ధికి సంబంధించిన పెద్ద పెద్ద ఛాయాచిత్రాలతో విశాలమైన స్టాలులో భారతప్రభుత్వంవారి ప్రచార విభాగంవారు 'మన భారతదేశం' అనే ప్రదర్శన ఏర్పాటుచేశారు.

భారత భూగర్భ పరిశోధకశాఖవారి స్టాలు ఆకర్షణీయమైన, విజ్ఞానయుతమైన వాటిలో మరొకటి. పది కోట్ల సంవత్సరాల

క్రిందట భూమిమీద సంచరించిన జంతువుల నమూనాలూ, లక్ష సంవత్సరాలక్రితం వుండిన ఏనుగు నమూనా, 2-4 కోట్ల సంవత్సరాల కాలంనాటి బెలూచిస్తాన్ జంతువు నమూనాలు వున్నాయి. వివిధ రాష్ట్రాలలోని రకరకాల ఖనిజాలు కూడా వున్నాయి.

ఉస్మానియా విశ్వవిద్యాలయ స్వర్ణోత్సవ స్టాలు ఒకటి వుంది. ఏడవ నిజాం, ఉస్మానియా విశ్వవిద్యాలయ భవన సముదాయానికి శంకుస్థాపన చేస్తున్న ఛాయా చిత్రం. ఆ సందర్భంలో ప్రముఖు నుంచి వచ్చిన శుభాకాంక్షల ఫొటో ప్రింటులు, నాటినుండి నేటి వరకు ఈ విశ్వవిద్యాలయ అధ్యక్షులు. ఉపాధ్యక్షుల ఛాయా చిత్రాలు, పట్టప్రదానోత్సవ దృశ్యాలూ. ప్రముఖులు సందర్శించినప్పటి ఛాయా చిత్రాలూ యిందులో ప్రదర్శించారు.

భారత రెడ్ క్రాస్ సంఘం, హైద్రాబాదు ఇంజనీరింగ్ కార్పొరేషన్, రాష్ట్ర పురావస్తు సంచయన కేంద్రం కూడా తమ తమ స్టాల్‌లను ఏర్పాటు చేశాయి.

విద్యాశాఖవారి స్టాలు ప్రధానంగా యువకుల కొరకు ఉద్దేశించినది. విద్యా సంస్థలలోని విద్యార్థులు తయారుచేసిన పరికరాలు, వస్తువులు యిందులో వున్నాయి. కొన్ని అమ్మకానికి కూడా పెట్టారు.

వ్యవసాయశాఖవారి స్టాలులో అధిక దిగుబడినిచ్చే అనేక రకాల వంగడాలను ప్రదర్శించారు. రాష్ట్రంలోని వివిధ ప్రాంతాలలో పండించే పొగాకు రకాలను కూడా యిక్కడ ప్రదర్శించారు.



వ్యవసాయశాఖ స్టాలు లోపలిదృశ్యం

ఎవరైనా వచ్చి తమ భూమిలోని మట్టిని ఇక్కడ ఉచితంగా పరీక్ష చేయించుకోవచ్చు. నామమాత్రపు ఛార్జీలపై విత్తనాలను కూడా పరీక్ష చేయించుకొనవచ్చు.

ఇక్కడ ఒక ప్రయివేటు జంతు ప్రదర్శనశాల కూడా ఏర్పాటు చేయబడింది. ఇందులో వన్యమృగాలు కొన్ని వున్నాయి. బాలల



బాలల విభాగం

కొరకు చిన్న రైలును కూడా నడుపుతున్నారు. పిల్లల కొరకు ఒక ప్రత్యేక విభాగం వుంది.

కుటీర పరిశ్రమల ప్రత్యక్ష ప్రదర్శన, పశుప్రదర్శన, కోళ్ళ ప్రదర్శన, కుక్కల ప్రదర్శన, మొక్కల పెంపకం ప్రదర్శనవంటి ప్రదర్శనల పోటీలను ఏర్పాటు చేయడం; ఉత్తమ పరిశోధనకు బహుమతి యివ్వడం వృత్తి పనివారలకు పోటీ జరపడం—ఈ అఖిల భారత పారిశ్రామిక ప్రదర్శన ప్రత్యేకత. అంతేగాక సాంస్కృతిక ప్రదర్శనలను, ఆటలు, క్రీడల పోటీలు కూడా ఇక్కడ ఏర్పాటు చేయబడాయి. వివిధ విషయాలపై సమావేశాలను, కవిసమ్మేళనాలను కూడా యిక్కడ జరిపిస్తుంటారు.

ప్రదర్శన నిర్వహణ సంఘం తాలూకు ఆర్థిక కమిటీవారు తరచు సమావేశమై ఆదాయ వ్యయాలను ఎప్పటికప్పుడు సక్రమంగా వుండేటట్టు చూస్తుంటారు.

ఏటా పారిశ్రామిక ప్రదర్శనను జరిపించడంతోపాటు యీ ప్రదర్శన నిర్వాహక సంఘం జిల్లా స్థాయిల్లో కూడా ప్రదర్శనలు జరపడానికి తోడ్పడుతుంటుంది. సాంకేతిక, విద్యాసంస్థలను నెలకొల్పడం, వాటికి ఆర్థిక సహాయాన్ని యివ్వడం చేస్తుంటుంది. ప్రదర్శన సంఘం అధ్వర్యంలో వరంగల్లు, విజయవాడ, నిజామాబాదు, ఇంకా మరికొన్ని జిల్లా కేంద్రాలలో అప్పుడప్పుడు ప్రదర్శనలను ఏర్పాటు చేస్తున్నారు.

అఖిల భారత పారిశ్రామిక ప్రదర్శన 1965లో రజితోత్సవాన్ని జరుపుకుంది. ఈనాడు యీ ప్రదర్శనను రోజూ 25 వేలు మొదలుకొని 75 వేల వరకు జనం దర్శిస్తున్నారు. సెలవు రోజుల్లోనూ, పండుగ రోజుల్లోనూ ఈ సంఖ్య ఇంకా ఎక్కువగానే వుంటున్నది.



# గడచిన నెలల్లో

టి. వెంకట్రావు

గత డిశంబరు 10వ తేదీ వరకు పదిహేను రోజులపాటు సాగిన రాష్ట్ర శాసనసభ శీతాకాల సమావేశంలో అనేక అంశాలు చర్చకు వచ్చాయి.

సంయుక్త సమావేశంలో గవర్నరు చేసిన ప్రసంగంపై సాగిన చర్చలో సభ్యులు శాంతి, భద్రతల పరిస్థితిని గురించి ఎక్కువసేపు మాట్లాడారు. సూర్యాపేట తాలూకా లోని మూడు గ్రామాలలో "పాదయాత్ర" చేసిన ముఖ్యమంత్రి యదార్థ పరిస్థితులను గురించి వివరించారు.

సామ్యవాద సరళి సమాజ స్థాపన లక్ష్యాన్ని సాధించడం కొరకు కృషి జరుగుతున్నదనీ, ఎట్టి హింసా విధానాలను అనుసరించకుండా సాంఘికమైన మార్పులను సాఫీగా తీసుకొనిరావలెననీ ముఖ్యమంత్రి ఉద్ఘాటించారు.

## కేసోరం సిమెంటు ఫ్యాక్టరీ

ముఖ్యమంత్రి పాలకుర్తి వద్ద కేసోరం సిమెంటు ఫ్యాక్టరీకి ప్రారంభోత్సవం చేశారు. దేశం నినాదాలు, ఆందోళనలు, ఉపన్యాసాలు, హింసామార్గాల వల్ల గాక శాస్త్రీయ, వ్యవసాయ పరిశోధనల వల్ల పారిశ్రామికాభివృద్ధి వల్ల మాత్రమే విప్లవాత్మకమైన ప్రగతిని సాధిస్తుందని అయన అన్నారు. సహజసిద్ధమైన వనరులను వినియోగించుకొని పారిశ్రామికీకరణకు అనువైన వాతావరణం కల్పించవలసిందిగా ఆయన ప్రజానీకానికి విజ్ఞప్తి చేశారు. నాల్గవ పంచవర్ష ప్రణాళికలో పోచంపాడు ప్రాజెక్టును పూర్తి చేయడానికి ప్రభుత్వం నిశ్చయించుకున్నదనీ, 1970 నాటికి 40,000 ఎకరాలకు నీటిపారుదల జరపడానికి తలపెట్టబడిందనీ ఆయన తెలియజేశారు. రాష్ట్రావసరాలను, దేశావసరాలను తీర్చడానికి వీలుగా కేంద్రం రామగుండంలో ఎరువుల కర్మాగారాన్ని నెలకొల్పగలదన్న ఆశాభావాన్ని ముఖ్యమంత్రి ప్రకటించారు. మరో విధంగా చెప్పాలంటే భూసంస్కరణలద్వారా రైతులకు సౌకర్యాలు కల్పించడం, ఆధునిక విజ్ఞానం అందించడంద్వారా భూవసతిలేని బీదవారికి బంజరు భూములను పంపిణీ చేయడం వంటి చర్యల ద్వారా వ్యావసాయక విప్లవాన్ని తీసుకొని రావడానికి రాష్ట్ర ప్రభుత్వం ఉపక్రమించింది. దీనితోపాటుగా పారిశ్రామిక వేత్తలను ఆకర్షించడానికి కూడా చర్యలు గైకొనబడుతున్నాయని ముఖ్యమంత్రి పేర్కొన్నారు.

## జూనియర్ కళాశాలలు

రాష్ట్రంలోని జూనియర్ కళాశాలలలో వచ్చే విద్యా సంవత్సరం నుంచి తెలుగును బోధనా భాషగా ప్రవేశపెడుతున్నట్లు ప్రకటన జరిగింది. విద్యారంగంలో విప్లవాత్మకమైన మార్పును ప్రవేశపెట్టే చర్య యిది. జూనియర్ కళాశాలలను నడపడానికి జిల్లా పరిషత్తులనుకానీ, స్థానిక సంస్థలనుకానీ అనుమతించరని విద్యామంత్రి శ్రీ పి వి. నరసింహారావు శాసన సభలో తెలియజేశారు. రాష్ట్ర రాజధానికి, జిల్లా ముఖ్యపట్టణాలకు వెలుపలవుండి సాధారణంగా తాలూకా కార్యస్థానాలలో వున్నటువంటి పాఠశాలలను జూనియర్ కళాశాలలక్రింద మార్చడం కొరకు పరిశీలించడం జరుగుతుందని విద్యామంత్రి వెల్లడించారు.



కరీంనగర్ జిల్లాలోని పాలకుర్తిలో కేసోరం సిమెంటు ఫ్యాక్టరీకి ముఖ్యమంత్రి శ్రీ బ్రహ్మానందరెడ్డి నవంబరు 29 న ప్రారంభోత్సవం చేసినప్పటి చిత్రం

రాష్ట్రంలోని మూడు విశ్వవిద్యాలయాలు నెలకొల్పిన కమీషన్లు, వివిధ విద్యా సంస్థలను పరిశీలించిన మీదట వాటిలో వేటిని జూనియర్ కళాశాలల క్రింద మార్చడానికి వీలుంటుందో నిర్ణయిస్తాయి. కొత్త 10వ తరగతి పరీక్షను తెలుగుతోగాక యితర భాషతో పూర్తి చేసినవారి కొరకు నిర్ణీత విద్యా సంస్థలలో కొంత కాలంపాటు ఇంగ్లీషు మీడియం సెక్షన్లను కూడా నిర్వహిస్తారు.

అయితే ఇతర బోధనా భాషలతో సెక్షన్లు, కళాశాలలు నిర్వహించదలచిన ప్రైవేటు మేనేజిమెంట్లు, మామూలు గ్రాంట్-ఇన్-ఎయిడ్ నిబంధనలకు లోబడి ఆ ప్రకారం చేయవచ్చునని ఆయన అన్నారు. ప్రతిపాదిత జూనియర్ కళాశాలల కొరకు తెలుగు అకాడమీ పాఠ్యపుస్తకాలను తయారు చేస్తున్నట్లు కూడా మంత్రి తెలియజేశారు.

## తొలి హరిజన వైస్ ఛాన్స్‌లర్

శ్రీ ఎల్. బుల్లయ్య, ఆంధ్ర విశ్వవిద్యాలయం ఉపాధ్యక్షులుగా నియమించబడడాన్ని విద్యారంగంలోనివారు హర్షించారు. ఆయన బహుశః దేశంలోని విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షులందరిలోనూ వయస్సులో చిన్నవారు. హరిజనుడు విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షుడుగా నియమించబడడం కూడా ఆయనతోనే ప్రారంభమైంది. శ్రీ బుల్లయ్య ఉద్యోగ జీవితం, అవిభాజిత మద్రాసు రాష్ట్రంలో ప్రారంభమైంది. ఉన్నత విద్యాశాఖ డైరెక్టరుగా నియమించబడే వరకూ ఆయన రాష్ట్ర విద్యాశాఖ డైరెక్టరుగా వున్నారు. రాష్ట్రంలో యు. జి. సి. జీతపు స్కేళ్ళను వర్తింపజేయడానికి ఆయన కృషి చేశారు. తనిఖీ చేయడానికి సంబంధించిన బాధ్యతలను పరిపాలనా విషయాల నుంచి విడదీయడాన్ని వీరు గావించిన ముఖ్యమైన సంస్కరణగా పరిగణిస్తున్నారు.

## శిక్షణ కార్యక్రమం

విద్యాధికార్ల 8వ శిక్షణ కోర్సును కేంద్ర కార్మిక, ఉపాధి శాఖల మంత్రి శ్రీ జె. ఎల్. హథి ప్రారంభోత్సవం చేశారు. కార్మిక సంఘాల ఉద్యమంలో ఇదొక ముఖ్య సంఘటన. ఈ కార్యక్రమం 1958వ సం॥లో ప్రారంభమైంది. ఇప్పటి వరకు 6.5 లక్షల మంది కార్మికులకు, 14,000 మంది కార్మిక-ఉపాధ్యాయులకు, 349 మంది విద్యాధికార్లకు శిక్షణ యివ్వడం కొరకు రూ. 283 లక్షల మొత్తాన్ని వెచ్చించారు. పారిశ్రామికరంగం కొత్త యంత్రాలతో త్వరితంగా విస్తృతిజెందుతుండటంవల్లనూ, కొత్తగా ఉద్యోగావకాశాలు ఏర్పడుతుండటంవల్లనూ ఏర్పడగల సమస్యల నివృత్తికి సుశిక్షితులైన కార్మిక నాయకులు అవసరం.

## ఆగ్నేయాసియాలోని పెద్ద దూరదర్శిని

ఉస్మానియా విశ్వవిద్యాలయానికి చెందిన 48 అంగుళాల రెఫ్లెక్టర్ టెలిస్కోపు, రంగాపూర్‌లోని కొత్త అవరణలో పని చేయడం ప్రారంభించింది. అబ్జర్వేటరీ డైరెక్టరు డా॥ ఆర్. వి. కరండికర్ పర్యవేక్షణ క్రింద దీనిని నెలకొల్పారు. ఈ దూరదర్శినిని తయారు చేసిన అమెరికా సంస్థకు చెందిన యిద్దరు ప్రతినిధులు దానిని నెలకొల్పడంలో ఆయనకు తోడ్పడ్డారు.

ఆగ్నేయాసియా అంతటిలోకీ పెద్దదైన దూరదర్శిని యిది. దీని తర్వాత పెద్దదైన దూరదర్శినిలు వరుసగా హెల్వాన్ (ఈజిప్టు), ఒకాయమా (జపాను)లలో వున్నాయి.

48 అంగుళాల దూరదర్శిని ప్రాజెక్టు 1965లో ప్రారంభమైంది. ఇప్పటి వరకు దీనికి రూ. 40 లక్షలు ఖర్చు చేశారు. భారత—అమెరికా దేశాల గోధుమ ఋణ ప్రణాళిక క్రింద విశ్వవిద్యాలయ గ్రాంట్ల సంఘంవారు, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వంవారు దీనికి నిధులు సమకూర్చారు. దీని స్థాపనకు విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షుడు డా॥ డి. ఎస్. రెడ్డి ప్రధానంగా కృషి చేశారు.

శక్తివంతమైన ఈ దూరదర్శిని స్థాపించబడడంతో ఉస్మానియా విశ్వవిద్యాలయపు ఖగోళ శాస్త్ర శాఖ, ప్రముఖ పరిశోధనా కేంద్రంగా రూపొందింది. విదేశాలలోని ఖగోళ శాస్త్రజ్ఞులకు ఉపయోగపడ గలుగుతుంది.

* * * *

పందొమ్మిది వందల అరవై ఎనిమిది వెళ్ళిపోయి కొత్త సంవత్సరం వచ్చింది. ప్రజలలో ఆశల్ని రేకెత్తించింది. అరవై ఎనిమిదిలో కరువు వచ్చి ఆర్థిక పరిస్థితులు క్షీణించి కష్టాలతో గడిచింది. అయితే పంటలు కొత్త సంవత్సరంలో కష్టానికి తగ్గ ఫలితాలన్నివ్వవచ్చు. కొన్ని ముఖ్యమైన ఆహార పదార్థాలధరలు తగ్గుముఖంపట్టడంకుడా ప్రారంభించాయి.

అన్నపూర్ణ అనదగిన ఆంధ్రప్రదేశ్ పారిశ్రామిక రంగంలో కూడా అడుగుపెట్టింది. కొంతకాలం క్రితం వరకు ఆంధ్రప్రదేశ్‌లో చెప్పుకోదగిన పరిశ్రమలు లేవు. కాని యీనాడు కేంద్ర రంగం క్రింద భారత్ భారీ విద్యుత్పరికరాల కర్మాగారం, సింథటిక్ మందుల కర్మాగారం, ప్రయివేటు రంగం క్రింద కోరమాండల్ ఎరువుల కర్మాగారం వంటి భారీరకం పరిశ్రమలు రెండు మూడు ఆంధ్రప్రదేశ్‌లో ఏర్పాటయ్యాయి. 1969 సంవత్సరాన్ని నిస్సంశయంగా పారిశ్రామిక సంవత్సరంగా చెప్పవచ్చు అని పరిశ్రమల మంత్రి శ్రీ బి.వి. గురుమూర్తిగారు పేర్కొన్నారు. మొత్తం నూరు కోట్ల రూపాయల పెట్టుబడిగల పథకాలనేకం సంసిద్ధంగా వున్నాయి.

## నూతన సంవత్సర కానుక

పారిశ్రామిక వేత్తలను ఆకర్షించడానికై ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం అమ్మకం పన్ను, విద్యుచ్ఛక్తి, నీటిరేట్ల విషయంలోనూ, భూమిపన్ను విషయంలోనూ రాయితీలను అనేకమైన వాటిని ప్రకటించింది. 1969 జనవరి 1 తర్వాత లైసెన్సు పొందిన, లేదా నెలకొల్పబడిన కొత్త పరిశ్రమలకు యీ రాయితీలు వర్తిస్తాయి. నాగార్జునసాగర్, కె. సి. కాలువ ఆయకట్టు ప్రాంతాల్లోనూ, రామగుండం - కొత్తగూడెం ప్రాంతంలోనూ నెలకొల్పదలచిన పరిశ్రమలకు మరికొన్ని అదనపు సౌకర్యాలను కూడా ప్రభుత్వం ప్రకటించింది. ఆ పరిశ్రమలు ఉత్పత్తి ప్రారంభించినది మొదలుకొని అయిదేళ్ళవరకు యీ రాయితీలు

యివ్వడం జరుగుతుంది. సాంప్రదాయకమైనవీ, ఆర్థిక సహాయం పొందేవీ అయిన పారిశ్రామిక వాడలకు పదేళ్ళపాటు ఆ యా పారిశ్రామికవాడల గ్రేడులనుబట్టి రాయితీ యివ్వడం జరుగుతుంది. రాష్ట్రంలో శీఘ్రగతిని పారిశ్రామికీకరణ జరిగే వుద్దేశంతో ఆంధ్రప్రదేశ్ మంత్రిమండలి సమావేశమై, పారిశ్రామిక వేత్తలకు ఈ రాయితీలను నూతన సంవత్సరపు కానుకగా ప్రకటించింది.

## పారిశ్రామిక ప్రదర్శన

మైసూరు ముఖ్యమంత్రి శ్రీ వీరేంద్ర పాటిల్ అఖిల భారత పారిశ్రామిక ప్రదర్శనకు ప్రారంభోత్సవం చేస్తూ, దేశం పారిశ్రామికంగా అభివృద్ధి చెందుతున్నట్టు పేర్కొన్నారు. మనం ఉత్పత్తి చేస్తున్న వస్తువులకు విదేశమార్కెటు వుండడం చాలా అవసరం అన్నారు ఆయన. ఈ ప్రదర్శన ప్రారంభోత్సవ కార్యక్రమానికి అధ్యక్షత వహించిన ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డి ఈ సందర్భంలో మాట్లాడుతూ పారిశ్రామిక వేత్తలకు ప్రభుత్వం ప్రకటించిన రాయితీ సౌకర్యాలను గూర్చి వివరించి, దేశంలోని అన్ని ప్రాంతాల పారిశ్రామిక వేత్తలూ ముందుకు రాగలరన్న తమ ఆశాభావాన్ని వ్యక్తంచేశారు.

## నాగార్జునసాగర్ ఆయకట్టు అభివృద్ధి

నాగార్జునసాగర్ ఆయకట్టు అభివృద్ధిని శీఘ్రవంతం చేయడానికి సంబంధించిన తీవ్రతర ప్రచార, సమాచార ఉద్యమానికి కేంద్ర మంత్రి శ్రీ కె. కె. షా ఇటీవల ప్రారంభోత్సవం చేశారు. ఈ నాడు అధిక ఆహారోత్పత్తి అవసరం ఎక్కువగా వుండడం దృష్ట్యా నాగార్జునసాగర్ ప్రాజెక్టు ప్రాముఖ్యాన్నిగూర్చి అందరికీ తెలియచెప్పేవుద్దేశంతో యీ ఉద్యమం రూపొందించబడింది. ఈ ఉద్యమం అటు వ్యవసాయదారులు, యిటు సంబంధిత అధికారులమధ్య సన్నిహిత అవగాహన ఏర్పడడానికి తోడ్పడుతుంది.

భారతప్రభుత్వం తాలుకు క్షేత్రప్రచార విభాగం డైరెక్టరేట్ వారూ, ఆంధ్రప్రదేశ్ జనసంబంధశాఖ కలిసి సంయుక్తంగా యీ ఉద్యమాన్ని నిర్వహిస్తున్నాయి, ఆరుక్షేత్రప్రచార యూనిట్లు విడివిడిగావెళ్ళి యీ ప్రచార కార్యక్రమాన్ని కొనసాగిస్తున్నాయి. ఒక్కొక్క విభాగం పదేసి గ్రామాలను ఆవరిస్తూ ప్రచారం చేస్తాయి. వ్యవసాయశాఖ, సహకారశాఖ వంటి శాఖలు కూడా యీ ఉద్యమంలో సహకరిస్తున్నాయి.

పూర్తిగా భారతీయ ఇంజనీర్లూ, సాంకేతిక వేత్తలూ రూపొందించి, నిర్మాణం పూర్తిగావిస్తున్న నాగార్జున్‌సాగర్ ప్రాజెక్టు పనితీరుకు కేంద్ర మంత్రి శ్రీ షా తమ హర్షాన్ని ప్రకటించారు. ఈ ఆనకట్ట, మన అభివృద్ధి కార్యక్రమాలకు ఎంతగానో తోడ్పడగలదని ఆయన పేర్కొన్నారు.

అభివృద్ధి కార్యక్రమాలలో ప్రచారం యొక్క ప్రాధాన్యాన్ని గూర్చి శ్రీ షా పేర్కొంటూ, కేంద్ర స్థాయిలో ప్రచారాన్ని ఒకే శాఖ పరం చేయాలన్న ఆలోచన వున్నట్టు తెలియ జేశారు. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల ప్రచార విభాగాల మధ్య సన్నిహిత సమన్వయం వుండాలని ఆయన సూచించారు.

ఈ ప్రాజెక్టు క్రింద రానున్న కొన్ని నెలలలోనూ అదనంగా 2.5 లక్షల ఎకరాలకు సేద్యపు నీరు లభించగలదని సహకార మంత్రి శ్రీ విజయభాస్కర రెడ్డి తెలియ జేశారు. జూలై నాటికి యీ 2.5 లక్షల ఎకరాలకు సేద్యపు నీరు అందజేయడంతో సేద్యపునీరు అందుతున్న ప్రాంతం 10 లక్షల ఎకరాలు కాగలదని ఇక్కడి ప్రాజెక్టు అధికారి అంచనా. అంటే మనం ఏర్పరచుకున్న లక్ష్యంలో సగం మేరకు సేద్యపు నీటిని లభింప జేయగలుగుతున్నామన్నమాట.

## ప్రపంచ బ్యాంకి బృందం రాక

నలుగురు సభ్యులుగల ప్రపంచ బ్యాంకు నిపుణుల బృందం నాయకుడు శ్రీ ఎ. గొలాన్ యిటీవల ఆంధ్రప్రదేశ్ రైతుల కృషిని శ్లాఘించారు. డ్రైనేజి పథకంలోనూ, గోదావరి బారేజ్, పోచంపాడు ప్రాజెక్టుల కొనసాగింపుకుగాను రాష్ట్ర ప్రభుత్వానికి ఎంతవరకు ప్రపంచబ్యాంకి సహాయపడగలదనే విషయాన్ని పరిశీలించే నిమిత్తం శ్రీ గొలాన్, అతని బృందం కృష్ణా, గోదావరి డెల్టా ప్రాంతాన్ని సందర్శించారు. వారు నాగార్జున సాగర్‌ను కూడా సందర్శించి, ఆయకట్టు ప్రాంతంలో సాగర్ జలాల వినియోగాన్ని పరిశీలించారు. శ్రీ గొలన్ మాట్లాడుతూ, తాను నాగార్జునసాగర్ ఆయకట్టు ప్రాంతంలో దూర ప్రదేశంలోని గ్రామాలకు వెళ్ళినప్పుడు కూడా అచ్చటి ప్రజలు కనబరచిన ఉత్సాహం తనను ముగ్ధుని చేసిందని అన్నారు. సాధ్యమైనంత ఎక్కువ నీటిని వినియోగించుకోవడంపట్ల వారు చాలా శ్రద్ధ చూపుతున్నారని ఆయన తెలిపారు.

## భారత వైద్యుల సంస్థ వార్షిక సమావేశం

ఆంధ్రప్రదేశ్ గవర్నరు శ్రీ ఖండూభాయ్ దేశాయ్ ఉస్మానియా వైద్యకళాశాలలో భారత వైద్యుల సంస్థ 24 వ సంయుక్త వార్షిక మహాసభను ప్రారంభిస్తూ, డాక్టర్లు-ముఖ్యంగా స్పెషలిస్టులు-తమవైఖరిని మార్చుకొని, తమ సేవలు ప్రజల ఆరోగ్యాభివృద్ధికి యితోధికంగా తోడ్పడడానికి వీలుగా కొత్త దృక్పథాన్ని అలవర్చుకోవాలని ఉద్బోధించారు. ఆధునిక వైద్య సదుపాయాలూ, వైద్య నిపుణుల సేవలూ సామాన్య వ్యక్తులకు కూడా అందుబాటులో వుండాలని ఆయన పేర్కొన్నారు.

మహాసభకు అధ్యక్షత వహించిన రాష్ట్ర ఆరోగ్యశాఖ మంత్రి శ్రీ ఎం. ఇబ్రహీం అలీ అన్సారీ మాట్లాడుతూ, వ్యాధి నిరోధన కంటే వ్యాధి నిర్మూలనే స్పెషలిస్టుల ధ్యేయంగా వుండాలని అన్నారు. ఆరోగ్య కార్యక్రమాలలో చేర్చడం కొరకు వారు అవసరమైన చర్యలను సూచించవచ్చునని ఆయన తెలిపారు. ఆహ్వాన సంఘాధ్యక్షుడు డా. బంకట్‌చంద్రా ప్రసంగిస్తూ ఒకే

విధమైన వైద్య పరీక్ష పద్ధతిని రూపొందించే నిమిత్తం ఇంగ్లాండు అమెరికాలలో వలె మన దేశంలో కూడా వ్యవస్థీకరించబడినటు వంటి వైద్య పరీక్షా కేంద్రాలను నెలకొల్పాలని కోరారు.

## దక్షిణాది రాష్ట్రాల సమాచార మంత్రుల సమావేశం

జూబిలీ హాలులో జరిగిన దక్షిణాది రాష్ట్రాల సమాచార మంత్రుల సమావేశంలో పత్రికలపై గుత్తాధిపత్యం పెరుగుతుండడంపట్లా, పత్రికా స్వాతంత్ర్యానికీ, ప్రజాస్వామ్యానికి ఎదురవుతున్న సమస్యలపట్లా ఆందోళన వెలిబుచ్చారు. ప్రజాస్వామ్యం నిర్వహణలో పత్రికలు ప్రధాన పాత్రనిర్వహిస్తాయనడంలో ఎట్టి సందేహంలేదు. జర్నలిస్టులు సత్యాన్వేషణ చేయాలి.



దక్షిణాది రాష్ట్రాల సమాచార మంత్రుల ప్రారంభ సమావేశంలో కేంద్ర మంత్రి శ్రీ కె. కె. షా ప్రసంగిస్తున్న దృశ్యం

ఈ సమావేశంలో, జనసంబంధ మంత్రి శ్రీ కొండా లక్ష్మణ్ బాపూజీ ప్రసంగిస్తూ, అనారోగ్యకరమైనట్టి కేంద్రీకరణ ధోరణులను అరికట్టే నిమిత్తం, గుత్తాధిపత్యం వహిస్తున్న పత్రికలకూ, "పెద్ద పత్రికల"కూ ప్రకటనలను విడుదలచేసే విధానం విషయంలో ప్రభుత్వం జాగ్రత్త వహించాలని అన్నారు. ఈ సమావేశానికి అధ్యక్షత వహించిన అప్పటి కేంద్ర రేడియో, సమాచార శాఖల మంత్రి శ్రీ కె. కె. షా, శ్రీ కొండా లక్ష్మణ్ అభిప్రాయాలతో ఏకీభవించారు. పత్రికా రంగంలో గుత్తాధిపత్య ధోరణుల ప్రాబల్యం చాలా శ్రద్ధగా చర్చించవలసిన అంశమని ఆయన పేర్కొన్నారు.

## ఇరాన్ రాజ దంపతులకు ఉస్మానియా విశ్వవిద్యాలయం గౌరవ డాక్టరేటు

ఇరాన్ రాజదంపతులు ఇటీవల హైదరాబాదును సందర్శించినప్పుడు నగరంలో వారికి ఘనస్వాగతం లభించింది. ఉస్మానియా విశ్వవిద్యాలయం ప్రత్యేక స్నాతకోత్సవంలో ఇరాన్ రాజుకు గౌరవ డాక్టరేటు డిగ్రీని సమర్పించింది. స్నాతకోత్సవం జరిగిన విశాలమైన టాగూర్ ఆడిటోరియం సదస్యులతో క్రిక్కిరిసిపోయింది. గౌరవ అతిధులను దర్శనం చేసుకునే నిమిత్తం లోపల స్థలం లేక పోవడంచేత అనేక మంది వెలుపల నిరీక్షించవలసి వచ్చింది.



ఇరాన్ రాజుకు బేగంపేట విమానాశ్రయంలో రాష్ట్ర గవర్నరు, ముఖ్యమంత్రి, నగర మేయరు ప్రభృతులు స్వాగతం చెప్పినప్పటి దృశ్యం

ఇరాన్ రాజు తమ ప్రసంగంలో ఇరాన్, భారత దేశాలలోని శాస్త్రీయ, సాంస్కృతిక సంస్థల మధ్య ముమ్ముందు సహకారం ఇతోధికంగా వర్ధిల్లాలని పేర్కొన్నారు.

ప్రపంచంలోని కొన్ని అవాంఛనీయమైన ధోరణుల విషయమై ప్రస్తావించి ఆయన భౌతిక, ఆధ్యాత్మిక అభివృద్ధిశక్తుల మధ్య సమన్వయాన్ని సాధించవలసిందిగా ఉభయ దేశాలలోని మేధావులకూ, తమ దృక్పథంతో ఏకీభవించేవారందరికీ విజ్ఞప్తి చేశారు.



# నగరంలో . . .

## తొలి పశువైద్య సిబ్బంది సంఘ భవనం

ఆంధ్రప్రదేశ్ తొలి పశువైద్య సిబ్బంది సంఘ భవన నిర్మాణం ప్రారంభం సందర్భంగా ఆంధ్రప్రదేశ్ పశువైద్య సిబ్బంది సంఘంవారు ఏర్పాటు చేసిన సభలో పశుసంవర్థకశాఖ డైరెక్టరూ, పాల కమీషనరూ అయిన డా॥ సి. కృష్ణారావు మాట్లాడుతూ యీ సంఘం తన స్వంత భవన నిర్మాణాన్ని ప్రారంభించడం గర్వకారణమని అన్నారు. భారత దేశంలో పశువైద్య సిబ్బంది నిర్మించుకుంటున్న స్వంత భవనాల్లో యిదే మొట్టమొదటిది. ఇది ఇతర రాష్ట్రాలలోని సంస్థలకు ఆదర్శప్రాయం కాగలదన్న తమ ఆశాభావాన్ని వ్యక్తం చేశారు. దీనికి వ్యవసాయ శాఖా మంత్రి శ్రీ పి. తిమ్మారెడ్డి శంకుస్థాపన చేశారు. దీని నిర్మాణానికి ప్రధానంగా సభ్యులనుంచే విరాళాలు సేకరించడం జరిగింది.

## ఎ. జి. ఆఫీసు తెలుగు నాటక సమితి ద్వాదశ వార్షికోత్సవం

హైద్రాబాదు అకౌంటెంట్ జనరల్ కార్యాలయం తెలుగు నాటక సమితి, ద్వాదశ వార్షికోత్సవాన్ని జనవరి 31 వ తేదీన రవీంద్రభారతిలో ప్రారంభిస్తూ, ముఖ్యఅతిథిగా విచ్చేసిన ఆంధ్రప్రదేశ్ సిటిపౌరుదల శాఖామాత్యులు శ్రీ శీలం సిద్ధారెడ్డి, నాటకరంగంలో తెలుగు నాటక సమితి చేస్తున్న కృషిని అభినందించారు. ఈ సమితి పన్నెండు సంవత్సరాలుగా పనిచేస్తున్నది.

ఉత్సవ సభకు సీనియర్ డిప్యూటీ అకౌంటెంట్ జనరల్ శ్రీ కె. యస్. మూర్తి అధ్యక్షత వహించారు.



అయిదవ ఫైనాన్స్ కమిషన్ అధ్యక్షుడు శ్రీ మహావీర్ త్యాగి సచివాలయంలో ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రితో, ప్రభుత్వ ప్రతినిధులతో చర్చిస్తున్న దృశ్యం

సమితి సభ్యుడు శ్రీ పి. వెంకటేశ్వరరావు రచించిన " పీఠ తెగిన మనిషి " నాటికను సమితి సభ్యులు ప్రదర్శించారు.

సమితి సభ్యులచే వాద్య, గాత్ర, లలిత సంగీత కచేరీలు గావింపబడినవి.



కేంద్రమంత్రి శ్రీ వై.బి. చవాన్ జనవరి 10 వ తేదీన హైదరాబాదులో లోకమాన్య బాలగంగాధర తిలక్ విగ్రహాన్ని ఆవిష్కరించిన దృశ్యం

## హైదరాబాదులో జమ్మూ-కాశ్మీర్ సాంస్కృతిక బృందంవారి కళా ప్రదర్శనం

జమ్మూ-కాశ్మీర్ రాష్ట్రానికి చెందిన సాంస్కృతిక బృందం వారు జనవరి 20 వ తేదీన సాయంత్రం హైదరాబాదులోని గాంధీ భవనంలో కళాప్రదర్శన లిచ్చారు. ఈ బృందంలో 36 మంది సభ్యులున్నారు.

హైదరాబాదుకు రావడానికి పూర్వం, యీ బృందం వారు బొంబాయి, విశాఖపట్నం, కొత్తగూడెంలలో సమర్పించిన కార్యక్రమాలు విశేషంగా ప్రజాదరణ పొందాయనీ, భారత దేశమంతా ఒక్కటేననీ, కాశ్మీర్ దీనిలో అంతర్భాగమనే సత్యాన్ని ఇది నిరూపించిందనీ ఆయన పేర్కొన్నారు.

తొలుత జనసంబంధ మంత్రి, బృందం సభ్యులకు పుష్పగుచ్ఛాలను, మొమెంటోలను సమర్పించారు.

బృందం నాయకుడు శ్రీ జితేంద్ర శర్మ మాట్లాడుతూ తమ పర్యటన సందర్భంలో చక్కని ఏర్పాట్లు చేసి, పర్యటన విజయవంతం చేసినందుకు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వానికి కృతజ్ఞతలు తెలియజేశారు. ముఖ్యంగా హైద్రాబాదు, తిరుపతి పర్యటన తమకు చిరస్మరణీయమైనదని ఆయన పేర్కొన్నారు.



జనవరి 20 వ తేదీన అఫ్గన్ వ్యవసాయ, నీటి పారుదల శాఖామంత్రి శ్రీ మీర్ మహమ్మద్ అక్బర్ రెజా ఆంధ్రప్రదేశ్ గవర్నరును కలుసుకున్నప్పటి చిత్రం

అంతర్ రాష్ట్ర సాంస్కృతిక బృందాల పర్యటన పథకం క్రింద భారత ప్రభుత్వం యీ పర్యటనను ఏర్పాటు చేసింది. ప్రసిద్ధ జానపద, శాస్త్రీయ, గిరిజన నర్తకులు, సంగీత విద్వాంసులు, వాద్యనిపుణులు యీ బృందం సభ్యులుగా ఉన్నారు.

## యుగోస్లావియా దేశపు 'జగ్రెబ్ ఒపేరా బాలే' బృందం

యుగోస్లావియా, జగ్రెబ్‌లోని క్రొయేషియన్ నేషనల్ థియేటరుకు చెందిన 14 మంది సభ్యులు గల నర్తకుల బృందం



యుగోస్లావియా సాంస్కృతిక బృందం వారు జనవరి 10 న రవీంద్ర భారతిలో ఇచ్చిన ఒక ప్రదర్శన దృశ్యం

1969 జనవరి 10 వ తేదీన హైదరాబాదుకు వచ్చారు. వీరు రవీంద్రభారతి థియేటరులో 10, 11 తేదీలలో ప్రదర్శన లిచ్చారు.

యుగోస్లావియాలోనూ, ఆగ్నేయ యూరపులోనూ ప్రాచీన కళా సంస్థగా ప్రసిద్ధిపొందిన 'పీపుల్స్ థియేటరు క్రొయేషియాలో' జగ్రెబ్ బాలే ఒక భాగం. ఈ సంస్థ 1860 లో స్థాపించబడింది.

ఈ బృందం వారు, నృత్యనాటికలు 'స్వాన్' లేక డాన్‌క్విక్సెట్' 'ది ట్రైకార్న్డ్ హాట్' ల నుండి కొన్ని ఘట్టాలను నృత్యనాటికలు, 'బాలేక్లాసు' 'రోమియో అండ్ జూలియట్' 'ది కార్నివాల్ ఇల్యూజన్' 'వి లైక్ బాచ్' 'డేవిడ్ ఇన్ ద విలేజ్' లనూ ప్రదర్శించారు.



రష్యా సాంస్కృతిక బృందం వారు ఇటీవల రవీంద్రభారతిలో యిచ్చిన ప్రదర్శనలో ఒక దృశ్యం

## హైదరాబాదులో డర్బాన్ ఆంధ్రమహాసభ సభ్యులు

దక్షిణాఫ్రికాలోని డర్బాన్‌లోగల ఆంధ్రమహాసభ సభ్యులు అయిదుగురు హైద్రాబాద్‌కు వచ్చిన సందర్భంలో 1969 జనవరి 10వ తేదీన ఉదయం 11 గంటలకు రాష్ట్ర సమాచార కేంద్రంలో వారికి స్వాగత సమావేశం ఏర్పాటు చేయబడింది. రాష్ట్ర జన సంబంధమంత్రి శ్రీ కొండా లక్ష్మణ్ బాపూజీ కూడా ఈ సమావేశానికి హాజరయ్యారు.

శ్రీ ఎ. జె. నాయుడు, శ్రీ పి. ఎం. నాయుడు, శ్రీమతి నాగమ్మ, శ్రీమతి కన్నమ్మ కుమారి లీలావతి నాయుడు_ యీ అయిదుగురు డర్బాన్ ఆంధ్రమహాసభ సభ్యులూ ప్రస్తుతం భారత దేశంలో పర్యటిస్తున్నారు.



దక్షిణాఫ్రికాలోని దర్బాన్ ఆంధ్రమహా సభ సభ్యుల గౌరవార్థం జనసంబంధ శాఖ ఏర్పాటు చేసిన సమావేశంలో జనసంబంధ మంత్రి శ్రీ కొండా లక్ష్మణ్ బాపూజీ ప్రసంగిస్తున్న దృశ్యం

## తెలుగు అభ్యసిస్తున్న ఉత్తరప్రదేశ్ విద్యార్థులు

ఉత్తర ప్రదేశ్‌లో తెలుగు అభ్యసిస్తున్న ఆ రాష్ట్ర విద్యార్థులు అయిదుగురు ఇటీవల ఆంధ్రప్రదేశ్ పర్యటించారు. వీరికి నవంబరు 19 న హైదరాబాదులోని రాష్ట్ర సమాచార కేంద్రంలో సన్మానం ఒకటి ఏర్పాటు చేయబడింది. జన సంబంధ మంత్రి శ్రీ కొండా లక్ష్మణ్ బాపూజీ యీ అయిదుగురు విద్యార్థులకు అభినందన చిహ్నాలను బహూకరించారు. ఈ సన్మానానికి కుమారి లీలాజోషి కృతజ్ఞత చెప్తూ తాము ఉద్యోగం సంపాదించాలన్న దృష్టితో తెలుగు నేర్చుకోవడం లేదని, యీ భాష



ఉత్తర ప్రదేశ్‌లో తెలుగు నేర్చుకుంటున్న విద్యార్థులు హైదరాబాదు వచ్చినప్పుడు రాష్ట్ర సమాచార కేంద్రంలో వారు జనసంబంధ శాఖా మంత్రిని కలుసుకున్నప్పటి చిత్రం

ఎడల తమకుగల అభిరుచి కారణంగానే నేర్చుకొంటున్నామని అన్నారు. జాతీయ సమైక్యతను బలీయంచేసేవుద్దేశంతో ఉత్తర ప్రదేశ్ ప్రభుత్వం తమరాష్ట్రంలో దక్షిణాది భాషలను బోధించే ఒక పథకాన్ననుసరించి ఆ రాష్ట్రంలో ఏడు కేంద్రాలలో తెలుగును బోధిస్తున్నారు.



డిశంబరు 4 న పబ్లిక్ గార్డెన్స్‌లో యాత్రా వారోత్సవాలకు ముఖ్యమంత్రి ప్రారంభోత్సవం చేసినప్పటి దృశ్యం

## నేతాజీ స్మారకనిధి

నేతాజీ సుభాష్ చంద్రబోసు ప్రవచించిన ఆదర్శాలను అనుసరించవలసిందిగా రాష్ట్ర గవర్నరు శ్రీ ఖండూభాయ్ దేశాయ్ యువకులకు విజ్ఞప్తి చేశారు.



ప్రపంచ ఆహార కార్యక్రమం అధికారులకు బేగంపేట విమానాశ్రయంలో రాష్ట్ర పశు సంవర్థక శాఖ డైరక్టర్ డా॥ సి. కృష్ణరావు స్వాగతం చెప్పినప్పటి చిత్రం

నేతాజీ జన్మదినోత్సవ నిర్వహణ సంఘంవారు నెలకొల్పిన నేతాజీ సుభాష్ చంద్రబోస్ స్మారకనిధికి గాంధీ భవన్ ఆడిటోరియంలో జనవరి23న ప్రారంభోత్సవంచేస్తూ రాష్ట్రగవర్నరు నేతాజీకి జోహార్లు అర్పించారు. 'జైహింద్' అన్న నినాదాన్ని తొలిసారిగా అన్నది నేతాజీయేననీ, దేశంలో ఆ నినాదం వినిపిస్తున్నంతవరకు

నేతాజీ స్మృతి మన హృదయంలో నిలిచేవుంటుందనీ గవర్నరు తెలియజేశారు. నేతాజీ స్మృతిని శాశ్వతంగా నిలపడానికి, ఆయన అడుగుజాడలను ప్రజలు అనుసరించేటు చేయడానికి యీ నేతాజీ స్మారకనిధి విశేషంగా తోడ్పడగలదని గవర్నరు పేర్కొన్నారు.

భారత ప్రభుత్వ ఆహార సంస్థ అధ్యక్షులు మేజర్ జనరల్ షా నవాజ్‌ఖాన్, యీ ఉత్సవానికి అధ్యక్షత వహించారు. ఆ సందర్భంలో ఆయన నేతాజీ మరణానికి సంబంధించిన విచారణా సంఘంలో సభ్యుడిగా తన అనుభవాలను పేర్కొన్నారు. నేతాజీ చితా భస్మాన్ని కొంత టోక్యోలో వదలవలసిందనీ, ప్రజలకు నేతాజీ స్మృతి చిహ్నంగా అక్కడ ఒక దేవాలయాన్ని నిర్మిస్తామని చెప్పినట్లు శ్రీ షానవాజ్‌ఖాన్ తెలియజేశారు.

ఆనాటి ఐ. ఎన్. ఎ తాలూకు ఝాన్సీరెజిమెంటు రాణి కెప్టెన్ శ్రీమతి లక్ష్మిసహగాల్ 'అజాద్ హింద్ గాథ' అన్న సావనీర్‌ను ఆవిష్కరిస్తూ, నేతాజీ ఆదర్శాలలో యువకులు శిక్షణ పొందవలసిన అవసరాన్ని గూర్చి పేర్కొన్నారు.

ఈ ఉత్సవ సంఘం అధ్యక్షులూ, జనసంబంధ మంత్రి అయిన శ్రీ కొండా లక్ష్మణ్ బాపూజీ మాట్లాడుతూ భారత దేశాన్ని గాంధీ సూత్రాలమీద నిర్మించినప్పటికీ ప్రజలమీద బోసు, భగత్ సింగ్‌ల ప్రభావాన్ని విస్మరించ దగదని అన్నారు. స్వాతంత్ర్యానికి పాటుపడిన గాంధీజీ, ఆయన అనుచరులతోనూ;అదే విధంగా బోసు, భగత్‌సింగ్ తదితర నాయకుల చిత్రాలతోనూ ఒక గేలరీని ఏర్పాటు చేయదలచినట్టు ఆయన పేర్కొన్నారు. నేతాజీ ఆదర్శాలకు సంబంధించిన ఒక పరిశోధక విభాగాన్ని కూడా ఏర్పాటు చేయదలస్తున్నట్టు తెలియజేశారు.

# ప్రోత్సాహక బహుమతులు

ప్రతిభావంతమైన ఉత్తమ కృషి జరిపినందుకుగాను, ప్రభుత్వోద్యోగులకు ప్రత్యేక ప్రోత్సాహక బహుమతులు ఇచ్చే నిమిత్తం 1966 వ, సంవత్సరంలో ప్రవేశ పెట్టబడిన పథకాన్ని పురస్కరించుకుని, ప్రత్యేక ప్రోత్సాహకబహుమతుల మంజూరీ కొరకు వివిధ శాఖలు అందజేసిన ప్రతిపాదనలను, ప్రోత్సాహక బహుమతుల సంఘంవారు 1968 అక్టోబరు 31 వ తేదీన జరిగిన సమావేశంలో పరిశీలించారు. ఈ సంఘంవారు చేసిన సిఫారసులను జాగ్రత్తగా పరిశీలించిన మీదట ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం ఈ దిగువ విధంగా ప్రోత్సాహక బహుమతులు యివ్వడానికి ఉత్తర్వు చేసింది. :—

జూనియర్ యింజనీర్లు, సూపర్ వైజర్లు, అసిస్టెంటు యింజనీర్లు ప్రొబేషను ముగింపు కొరకు ప్రతిపాదనలను స్వీకరించడంలో విశేష కృషి జరిపినందుకు ఛీప్ యింజనీర్ (జనరల్) కార్యాలయంలో యు. డి. సి.గా పనిచేస్తున్న శ్రీ. సి. సుబ్రహ్మణ్యంకు ఒక నెల జీతానికి సమానమైన రొక్కం బహుమతి.

ఎగువ సీలేరు ప్రాజెక్టులో పెన్‌స్టాక్ పైపులను స్థాపించడంలోనూ, పెన్‌స్టాకుల ఉత్పత్తిలోనూ ప్రత్యేకమైన ఆసక్తి, అభినివేశం, చొరవ, ప్రతిభాసామర్థ్యాలు ప్రదర్శించినందుకుగాను పబ్లిక్ వర్క్సు శాఖ ఎగ్జిక్యూటివ్ యింజనీర్ శ్రీ పి. ఎఫ్. మోసెస్‌కు ఒక నెల జీతానికి సమానమైన రొక్కం బహుమతి.

మంటలను చల్లార్చే విషయంలో సత్వర చర్యలు గైకొని ఉత్తమ కృషి జరిపినందుకు విజయవాడ పట్టణం డివిజనల్ ఫైర్ ఆఫీసరు శ్రీ ఐ. దక్షిణామూర్తికి ఒక నెల జీతానికి సమానమైన రొక్కం బహుమతి.

తన బాధ్యతలను ఎంతో శ్రద్ధగా నిర్వహిస్తూ, తన సిబ్బందికి విజయవంతంగా నాయకత్వం వహించినందుకు విజయవాడ పట్టణం రిటైర్డ్ డివిజనల్ ఫైర్ ఆఫీసర్ శ్రీ యస్.కె. ప్రకాశరావుకు అతను రిటైరైనప్పుడు పొందిన జీతానికి సమానమైన రొక్కం బహుమతి.

“హీటర్ ఎలిమెంట్స్” ను తయారు చేయడంలో చూపిన ప్రతిభ పనితనానికిగాను ప్రభుత్వ కేంద్ర ముద్రణాలయంలో మోనో మెకానిక్ శ్రీ మహమూద్ ఖాన్, ఎలక్ట్రిషియన్ శ్రీ అబ్దుల్ అజీజులకు ఒక్కొక్కరికి ఒక అడ్వాన్సు యింక్రిమెంటు.

తన బాధ్యతలను ఎంతో దీక్షతో విశ్వాస పాత్రంగా నిర్వహించినందుకు ముఖ్య మంత్రి సెక్యూరిటీ ఆఫీసరు శ్రీ. యస్. సీతాపతి నాయుడుకు ఒక అడ్వాన్సు యింక్రిమెంటు.

మోటారు శకటాల చట్టం నిబంధనావళికి వ్యతిరేకంగా జరిగిన నేరాలనూ, పన్నుల ఎగవేతకు సంబంధించిన కేసులనూ కనుగొనడంలో విశేష ప్రతిభను కనబరచిన నిజామాబాద్ మోటారు శకటాల ఇన్‌స్పెక్టరు శ్రీ పి. కృష్ణారెడ్డికి ఒక అడ్వాన్సు యింక్రిమెంటు.

కడప జిల్లా సహకార బ్యాంకుకు చెల్లించబడవలసిన బకాయీలను రాబట్టడం ద్వారానూ, యీ బ్యాంకు చెల్లించ వలసివున్న ఋణాలను చెల్లించి వేయడంద్వారానూ యీబ్యాంకు గౌరవ ప్రతిష్ఠలను పరిపోషించడానికి నిర్విరామంగా కృషి జరిపినందుకు సహకార సంఘాల స్పెషల్ కేటగరీ డిప్యూటీ రిజిస్ట్రార్ శ్రీఅబ్దుల్ కరీమ్‌ఖాన్‌కు ప్రశంసా పత్రం.

తన బాధ్యతలను ప్రత్యేక శ్రద్ధతో నిర్వహించినందుకుగాను సి. ఐ. డి. స్పెషల్ బ్రాంచి సెక్షన్ హెడ్ శ్రీ. కె. వి. దయానందుకు ప్రశంసా పత్రం.

అప్పుడు అమలులోవున్న అటవీశాఖ నిబంధనల విషయంలో మంచి సూచనలు చేసినందుకుగాను మెదక్ జిల్లా నర్సాపూర్ ఫారెస్ట్ రేంజర్ శ్రీ. కె. బుచ్చిరామరెడ్డికి ప్రశంసా పత్రం.

# జిల్లాలనుండి

## కోళ్ళ పెంపకం, పాడిపరిశ్రమ కేంద్రాలకు ప్రారంభోత్సవం

జనవరి 18న రాష్ట్ర న్యాయశాఖా మాత్యులు శ్రీ టి. వి. రాఘవులు అనంతపురానికి నాలుగుమైళ్ళ దూరంలోవుండే ఆరు బయలు జైలును వెళ్ళి సందర్శించారు. ఒక కోళ్ళపెంపకం కేంద్రానికి, ఒక పాడిపరిశ్రమ కేంద్రానికి ఆయన ప్రారంభోత్సవం జరిపారు. శాసనసభ్యులు శ్రీ కె. వి. వేమారెడ్డి అధ్యక్షత వహించారు.

## భీమగల్ బ్లాకులో వేసెక్టమీ శిబిరం

1969 జనవరి నెలలో నిజామాబాద్ జిల్లాలో భీమగల్లు బ్లాకు దుబ్బక్, గడ్కోలుగ్రామాలలో రెండు వేసెక్టమీ శిబిరాలను నిర్వహించింది.



విశాఖలో డిశంబరు 6న ఇ. సి. ఇ. పవర్ ట్రాన్స్‌ఫార్మర్, స్విచ్ గేర్ కర్మాగారానికి ముఖ్యమంత్రి ప్రారంభోత్సవం చేసినప్పటి దృశ్యం

## నెల్లూరులో యానాదులకు యిళ్ళకాలనీలు

నెల్లూరులో యానాదులకు, ఎరుకలకు గృహవసతులు కల్పించేందుకు పెన్నానదికి ఉత్తరగట్టుప్రక్కన ప్రభుత్వం మూడు యిళ్ళ కాలనీలను మంజూరు చేసింది. 500 మంది ఆది వాసీలకు పునరావాసం కల్పించేందుకు 42 యకరాల యిళ్ళస్థలాలను కేటాయించింది. మహాత్మాగాంధీ కాలనీలో శాశ్వతంగా యిళ్ళు కట్టుకొనేందుకై ప్రభుత్వం 20 వేల రూపాయలనుకూడా మంజూరు చేసింది.

## దౌలతాబాద్‌లో పంచాయితీ భవనం

మహబూబ్‌నగర్ జిల్లాకు చెందిన దౌలతాబాదులో పంచాయతీ భవనానికి ముఖ్యమంత్రి శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డి జనవరి 15న శంఖుస్థాపన గావించారు.



డిశంబరు 9వ తేదీన జనసంబంధ మంత్రి శ్రీ కొండాలక్ష్మణ్ బాపూజీ పెద్దగూడెం గ్రామ పాఠశాల నూతన భవనానికి ప్రారంభోత్సవం చేసినప్పటి దృశ్యం

## విద్యుద్దీపాలకు ప్రారంభోత్సవం

నీటిపారుదల, గిరిజనసంక్షేమ శాఖా మంత్రి శ్రీ శీలం సిద్దారెడ్డి డిసెంబరు 20న, హనుమకొండ పంచాయతీసమితికిచెందిన 'నగరం' గ్రామంలో విద్యుద్దీపాలకు ప్రారంభోత్సవం జరిపారు.

## కొండపల్లిగ్రామానికి రక్షిత మంచినీటి సరఫరా

ముఖ్యమంత్రి శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డి, విజయవాడకు 14 మైళ్ళ దూరంలోగల ఇబ్రహీంపట్నం వద్ద యునిసెఫ్ సహకారంతో కొండపల్లి, తదితర సమీప గ్రామాలకు రక్షిత మంచినీటిని సరఫరాచేసే ఒకసమగ్ర పథకానికి శంకుస్థాపన చేశారు. పంచాయతీ రాజ్‌మంత్రి శ్రీ తోట రామస్వామి ఈ కార్యక్రమానికి అధ్యక్షత వహించారు.



అనంతపురంలో డిశంబరు 28, 29 తేదీల్లో జరిగిన అఖిల భారత దళిత జాతుల సమావేశం దృశ్యం



రాజేంద్రనగర్ లోని ఆంధ్రప్రదేశ్ వ్యవసాయ విశ్వవిద్యాలయ నూతన భవనాలకు కేంద్ర మంత్రి శ్రీ వై. బి. చవాన్ జనవరి 10న ప్రారంభోత్సవం చేసినప్పటి దృశ్యం

## హరిజనులకు కుట్టుమిషన్లు

మంగళగిరిలో వస్త్రాలతయారీ శిక్షణకేంద్రంలో విజయవంతంగా తమ శిక్షణకాలాన్ని పూర్తిచేసిన హరిజన మహిళలకు, వెనుకబడిన మహిళలకు మొత్తం పందొమ్మిదిమందికి తలా ఒక కుట్టుమిషనును శాసనసభ్యులు శ్రీ టి. నాగేశ్వరరావు పంపిణీ చేశారు.

## నల్గొండలో గ్రామీణ విద్యుదీకరణ పథకం

నల్గొండ జిల్లాకలెక్టరు శ్రీ ఎం. చంద్రమౌళిరెడ్డి బదిలీ అయిన సందర్భంలో ఆయన గౌరవార్థం 'నల్గొండ లయిన్స్ క్లబ్' వారు ఏర్పాటుచేసిన అభినందన సమావేశంలో నల్గొండ భూమి తనఖా బ్యాంకు అధ్యక్షులు శ్రీ ఎం. లక్ష్మీనరసింహారావు రూ 1,21,600ల చెక్కును కలెక్టరుకు అందజేశారు.



విజయవాడ వద్ద పటమటలో డిశంబరు 21వ తేదీన రక్షిత మంచినీటి సరఫరా పథకానికి ముఖ్యమంత్రి శ్రీ కె. బ్రహ్మానందరెడ్డి శంకుస్థాపన చేసినప్పటి దృశ్యం

కలెక్టరు ఆ చెక్కును విద్యుచ్ఛక్తి మండలి డివిజనల్ ఇంజనీరుకు అందజేశారు.

మెల్లదుప్పలపల్లి గ్రామంలో గ్రామీణ విద్యుదీకరణ కార్యక్రమం క్రింద 57 బావులకు పంపుసెట్లను ఏర్పాటుచేయడానికీ, విద్యుత్ సౌకర్యం కల్పించడానికీ రూ 2,16,750ల మేరకు నల్గొండ భూమి తనఖా బ్యాంకు దీర్ఘకాలిక ఋణాలను మంజూరు చేసిందని బ్యాంకు అధ్యక్షులు తెలియజేశారు.

ఈ జిల్లాలో యీ మాదిరి పథకాన్ని ప్రవేశపెట్టడం యిదే ప్రథమమని ఆయన పేర్కొన్నారు.

## రైవీసుకాలువపై వంతెనకు శంకుస్థాపన

గుణదలవద్ద రైవీసు కాలువమీద వంతెనకు జనవరి 23న ముఖ్యమంత్రి శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డి శంకుస్థాపన చేశారు.



తిరుపతి వద్ద విమానాశ్రయాన్ని ఏర్పాటుచేసే విషయమై కేంద్ర పౌర విమానయానమంత్రి డా॥ కరణ్ సింగ్ వచ్చినప్పుడు పరిసర గ్రామ ప్రజలు ఆతిథ్యం యిచ్చినప్పటి దృశ్యం

విజయవాడ శివారులోని గుణదలగ్రామం మీదుగా రైవీసుకాలువ, ఏలూరు, బుడమేరు డ్రెయిన్‌లు ప్రవహించి నాలుగు భాగాలుగా ఆ గ్రామాన్ని విభజిస్తున్నాయి.

ఈ మూడు కాలువలమీద వంతెనలు లేకపోవడం గ్రామస్థులు — ముఖ్యంగా వ్యవసాయదారులు — విజయవాడ చేరుకోవాలంటే నాలుగు, అయిదు మైళ్ళ దూరం చుట్టు తిరిగి రావలసివుంటున్నది.

కేంద్ర నీటిపారుదల, విద్యుచ్ఛక్తి విషయాలమంత్రి డా. కె. ఎల్. రావు సలహాప్రకారం గుణదల పంచాయతీ ఈమూడు కాలువలమీద మూడు వంతెనల్ని నిర్మించే ఒక సమగ్రపథకాన్ని రూపొందించింది. రైవీసు కాలువమీద నిర్మించే వంతెన డా. కె. ఎల్. రావు పేరుమీద పిలువబడుతుంది. దీని నిర్మాణానికి రూ 1·36 లక్షలు ఖర్చు కాగలదు. ఈ వంతెన నిర్మాణానికి



వరంగల్లులో డిశంబరు 22న స్పెషల్ గ్రేడు పురపాలకసంఘ భవనానికి ముఖ్యమంత్రి శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డి శంకుస్థాపన చేస్తున్న దృశ్యం

గుణదల గ్రామస్తులు రూ 70,000లను విరాళంగా యిచ్చారు. గ్రామస్తులు చూపిన యీ స్వయం సహాయధోరణికి ముఖ్యమంత్రి గ్రామస్తులను అభినందించి, యిది యితర ప్రాంతాలవారికి కూడా ఆదర్శం కాగలదని పేర్కొన్నారు.

రైవీసు కాలువమీద, బుడమేరుమీద రెండు వంతెనల నిర్మాణానికి కావలసిన నిధుల్ని గ్రామస్తులూ, జిల్లాపరిషత్తూ, పంచాయతీబోర్డూ కూర్చుకోగలిగితే ప్రభుత్వం ఏలూరు కాలువమీద వంతెనకు అయ్యే ఖర్చును భరించగలదని ఆయన హామీ యిచ్చారు.

ఈ మూడు వంతెనల నిర్మాణమూ పూర్తయితే గుణదల రైల్వేస్టేషను ముస్తాబాదు వూరును మద్రాసు-కలకత్తా జాతీయ రహదారిలో కలిపి తద్వారా యీ ప్రాంతం అభివృద్ధికి విస్తృతమైన అవకాశాల్ని ఏర్పరుస్తుంది.

ఆంధ్రప్రదేశ్ కాంగ్రెసు అధ్యక్షులు శ్రీ కాకాని వెంకటరత్నం యీ కార్యక్రమానికి అధ్యక్షత వహిస్తూ గ్రామస్తులను, పంచాయతీబోర్డును అభినందించారు. బుడమేరుమీద వంతెన నిర్మించడానికి తగు సహాయం పరిషత్తు అందజేయగలదని కృష్ణాజిల్లా పరిషత్తు అధ్యక్షులు శ్రీ పిన్నమనేని కోటేశ్వరరావు హామీ యిచ్చారు.

## పొల్కేరుమీద ఆనకట్టకు శంకుస్థాపన

ఆదిలాబాదుజిల్లా ఖానాపూరు తాలూకాలోని మందపల్లి గ్రామంవద్ద పొల్కేరుమీద రూ 1.62 లక్షల ఖర్చుతో నిర్మించే ఆనకట్టకు కమ్యూనికేషన్ల మంత్రి శ్రీ జె. వి. నరసింగరావు శంకుస్థాపన చేశారు. చిన్న నీటివనరులు త్వరగా పూర్తయి సత్వరప్రయోజనాలు ఒనగూడుతాయి కనుక ప్రభుత్వం ప్రతి గ్రామంలోనూ చిన్న నీటివనరులపై తగినంత మొత్తాల్ని వెచ్చిస్తున్నదని ఆయన పేర్కొన్నారు. సెంట్రి సర్కిలులో ఆ విధమైన చిన్న నీటివనరులు నాలుగింటినీ రెండేళ్ళ వ్యవధిలో మంజూరుచేయడం జరిగిందనీ, అందులో రెండు అప్పుడే పూర్తయ్యాయనీ పేర్కొన్నారు.

చిన్న నీటివనరులను చేపట్టడంలో జిల్లా అభివృద్ధిమండలి కృషినిగూర్చి జిల్లాపరిషత్తు అధ్యక్షులు శ్రీ నారాయణరెడ్డి తమ అధ్యక్షోపన్యాసంలో పేర్కొన్నారు.

చీఫ్ ఇంజనీరు శ్రీ బి. ఎన్. రెడ్డి ఈ పథకం వివరాలను గూర్చి చెప్తూ, పొల్కేరు కడం నదికి ఉపనది అనీ, ఇది నిర్మల్ తాలూకాలోని భీమన్న గుట్టనుండి పుట్టినదనీ, నిర్మల్ ఖన్నాపూర్ తాలూకాలలోని అడవులగుండా 16 468.50 లక్షల ఘ. అ. నీటితో యిది ప్రవహిస్తున్నదని తెలియజేశారు. 68.908 చ. మై. పరీవాహకప్రాంతం దీనికి వుంది. సగటు వర్షపాతం 36.66 అంగుళాలు. ఈ పథకానికి మొత్తం రూ. 1.62 లక్షల ఖర్చు అవుతుందని అంచనా.



యాత్రా వారోత్సవాల సందర్భంగా తిరుమలాయపాలెం పంచాయతీసమితిలోని గ్రామీణులు కొందరు నాగార్జునసాగర్‌కు యాత్రకు వెళ్తున్న దృశ్యం

PUBLISHED BY THE DIRECTOR, JANA SAMBANDHA SAKHA, A.P. HYDERABAD. PRINTED BY THE DIRECTOR OF PRINTI[NG]
AT THE GOVERNMENT CENTRAL PRESS, HYDERABAD

